# భారతి

సాహిత్య మాసపత్రిక

ఫిబ్రవరి 1983

సరిహద్దు

...రంధి సోమరాజు

...పేక్షత

...ఖిలేశ్వర్

...పదవి

...కృష్ణారెడ్డి

అరసున్న

బ్రహ్మానంద

సుమతి శతకము

శ్రీరామమూర్తి

విష్ణువర్ధనుడు

సూర్యనారాయణ

ఇంకా రమేష్‌బాబు, రఘువర్మ, కిశోరుబాబు – అశోకుబాబు, రావు, సంజీవ్,
రంగారావు, వీరభద్రయ్య, ఆనంద నరశింహులు, సత్యనారాయణరెడ్డి,
చాణుక్య, ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



ఫిబ్రవరి 1983

సంపుటము: 60 సంచిక: 2

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1983





# సరిహద్దు!

## శ్రీ రంధి సోమరాజు

గతం పునాది మీద నిలచిన నేడు
సన సన్నగ మెరిసే అరుణారుణ కిరణం!

భూత భవిష్యద్వీణానాద మధురిమల
మొలచిన చిన్నారి మొలక!

ఆకసమంతా నిండి జ్యోతిఃస్ఫురణల
జ్వలించేట్టి దివ్యశక్తి!
ఎదిగి ఎదిగి
రేపుగా తిరిగినప్పు డుషోదయం!

అదెంత ముద్దు!

ఆ ముద్దూ క్షణంలో గతమే ....
అందుకే లే దెప్పుడూ
ఈ ప్రక్రియకు సరిహద్దు!

ఎప్పుడు పుట్టాడో
పుడమి నెలా పడ్డాడో
ఎలా ఎలా రూపొందాడో
ఇవాళ అంతా అంతా
కరతలామలకం!

ఆకసాని కెదగడం
అతని విశుద్ధ స్వభావం.
అతడు నూత్న భావసౌందర్యం!

నిన్న ఇవాళ రేపు
నిజాని కొక్కటే ....
ఆగ పండిన జ్ఞానమిది ...
గతాన్ని గుర్తించని ప్రకృత
గుర్తించడ మొక్కటే
పునాదిగా గల
మానవశక్తికి జోహారులు!

ఇది స్వర్గం తలదన్నిన వర్గసమీరం
అంతా పులకించే జ్యోత్స్నా మార్గ మధుమ్నాన
మయూరం

లేవు కోపతాపాలు
ఈర్ష్యాసూయలు
అవి పక్క పక్కనే నక్కిన నీలి రక్తనాళాలు,
మానవాణు విద్యుత్ సమీర
మృదు స్పర్శానంత సుఖాన
గుప్పున ఎరుపుకు తిరిగిన జవసత్వాలు!

పాటలో మాధుర్యం
మాటలో సంపెగలు
పని పాటల విశుద్ధ లక్షణాలు
వజ్ర వైఢూర్యాలు!

మనిషి మనిషే జ్ఞాన నిలయం
దూరం దగ్గర అంతా అతని ముందర
నక్షత్ర కాంతు లీ జాతి దీవెనల దివ్వెలు

ఈ చేత అగ్ని
ఆ చేత వెన్నెల

ఏదీ తక్కువకాదు ఏదీ ఎక్కువ కాదు
బరువు భారాలు తూచే కాటాలు ఈ గుండె హస్తాల
తెలియ వెవ్వరికీ వాటాలు వొంకరలు

సన్యాసం లేదు
విశృంఖల వ్యాభిచర్యం లేదు
తృప్తి ఒక్కటే
అణు సౌందర్య దీపం!

అందుకే వున్నాం మనమంతా
గగన మంతా నిండి
సంగీతం ఈ జాతి భాష
ఎప్పుడూ సాహిత్యం
సరికొత్త అలంకరణ!

గగన పరీరంభానంత మహోజ్వల
కాంతి వలయాలు
నందనవన వికసిత హృద్య ప్రసూనాలు
కడుపునిండా అనురాగాల గగనాలు
గుండెల నిండా నవ వసంతాలు
మనసంతా మల్లెల జల్లులు
చుట్టూ చేయీచేయి కలిసిన స్నేహ నికుంజాలు

ప్రాణవాయు కౌగిట
ఉద్భవించిన
జలకణాంతర్గత
మోహన మోహినీ ప్రణయాలు
విద్యుద్ గాన లహరులు
అంతటా సుఖ శాంతులు !

కలువల సుందర ముఖాలు
విలువకు విలువైన పనితనాలు
మందారాలు మధురోహలు
మనిషి చుట్టూ పరిభ్రమించే
సీతాకోక చిలుకలు !

వెలుగుకు రూపం ఈ మనిషి
వినూత్న మానవతా మహాగ్ని జ్యోత్స్నకు
పురుడు పోసిన తనయుడు !

నక్షత్రంగా రూపొందినవాడు
ధ్రువుడు వీడు
దృఢ దీక్షా కంకణధారుడు నేడు
ఈ అనంత రోదసిని
ఏ సరిహద్దు లేనివాడు !



# నా కు మా త్రం ...

ఎంత ప్రశాంతం
ఎంత ఏకాంతం
నిశ్శబ్ద హృదయంలో
సత్యసాయీ గానామృతాన్ని
చిలకరించుకొన్నా
నిర్నిద్ర మననంలో
వేణునాద ప్రేమ కడ అని
పొంగించుకొన్నా
వేగిరం నన్ను నేను కర్పూరంచేసి కరిగించుకొన్నా

సత్వరం నాకు నేనే శబ్దాన్ని స్వరాన్ని అయి
ఆరగించుకొన్నా
కొంత నన్ను వదలందే !
నా మనూ నాతో లేదే అన్న వెలితి వెడలందే !
అవును మరి ....
నా భార్య నాకు దైవం
ఆమె ఒడి నాకు గుడి
ఆ ఎత్తు గుండెలపైనే యీ దేహం ....
ఆ లోతు గుండెలలోనే యీ మనస్సు .... !

[ పుట్టపర్తిలోని ప్రశాంతిని విశ్రాంతిని అనుభవించి ఆహ్లాదించినా అనుభూతం కాని మనోవేదనలో ప్రేయసీ ఆరాధనలో వెలికి వచ్చిన ఒక అక్షర రూపం.]

# అనుభవైకం!

**నే** కనపడ్డప్పుడెల్లా
ఆమె ఒక్కసారిగా
నన్ను గుండెల కద్దుకొని
నొసటిపై ముద్దు పెట్టి
నాకోసం నయనాలు ఆర్ద్రం చేసుకొంటుంది.

ఆ ఒక్క క్షణం
నే ననుభవించే చిత్త నైర్మల్యం
అర్థంకాని శాంతీ శమత్వం
పుట్టపర్తిలో దొరకదు
మంత్రాలయంలో కనిపించదు
నమాజు శబ్దాల్లో దొరదు
చర్చి గంటల్లో మోగదు.
అది అనుభవైక వేద్యం!
ఈ గుండెకే అది సాధ్యం!
ఏమిటీ ఎందుకూ అలా అంటే
సైకో్ట్రానిక్స్!
ఏంట్రా! రాధాక్రిష్ణా! యిదీ అంటే
ఆలోచించి అనుభవాన్ని చెరుపుకోకు
అనుభవించు! అంతే!!-
ఆయన్నంటున్నట్లుగా ....
సో ప్రొసీడ్!

# రా! మోక్షాన్ని ప్రసాదించు!

**అ**నురాగాన్ని సైతం
అపరాధమనుకొంటే
ఆత్మీయతను కూడ
అవివేకమనుకొంటే
ఈ అవ్యాజాను వాత్సల్యాలు ఎందుకని?
అపురూపాను బంధాలు ఎవరి కోసమని?
కపటమన్నది యెరుగక
కల్లయన్నది తెలియక
మనసులోని మాటను
మమత వెన్నెల్ల మూటను
నీకోసమని చెబితే మూగవోతా వెందుకని?
కనీసము పలుకరించనైనా పలుకరించవేమిటని?
తప్పు కాదిది
శిక్షన్నది లేనిది
నాలోని నీ స్మృతిని తెలిపినందుకు
మనోగతిలో నీ స్థితిని చూపిన దుకు
నిశ్శబ్దమా నీవిచ్చే పురస్కారము, ఎ-దుకని?
నిట్టూర్పులేనా నాకు మిగులునవి, అవి ఏమిటని?
తెలిసే చేసినదిది
తెలివి తక్కువ తనమన్నది లేనిది
పరీక్షించాలనీ కాదు
ప్రవృత్తిని విమర్శించాలనీ కాదు
పాలు పంచుకొందునంటే దూరమౌదువెందుకని?
పవిత్ర బాంధవ్యమ్మున దాచుకొందునంటే కద
రావేమిటని?

పసిదానవూ కావు
పరుగుపందాల వయసూ కాదు
పాలూ, నీరూ తెలిసిన దానవు
ప్రేమా, మోహమూ తెలిసిన దానవు
మిన్నకుండిపోతే ఏమైపోవాలని, అసలీ బ్రతు
కెందుకని?
మారు మాటాడక నిలిచిపోతే, ఈ మనుగడే
ఏమిటని?

ఇంతకంటే చెప్పలేను
ఇకమీదట చెప్పబోను
ఈ సమస్య కిక సమాధానము నీవే
భవిష్యత్తుకూ నిర్ణేతవు నీవే
ఎదురు చూచుచున్నది కాలం కలిసివచ్చే
నీ తీర్పు కొఱకే!
ఏనాటికైనా వేచి ఉన్నది ఆ కాసింత చల్లని
నీ మాట కోసమే!

రా! మోక్షాన్ని ప్రసాదించు!
ఆ దేవదేవుడే నీవై నన్నలరించాడని
నన్ను. మురిసి పోనీ!

**డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు**

డా॥ ముదిగొండ వీరభద్రయ్య

# కవిత్వరచనలో కవిపాత్ర ఏమిటి?

## [పరమ చైతన్యం లేక అచేతన సిద్ధాంతాల అన్వయం]

కవి యొక్క 'వ్యక్తిత్వం' ద్విధా విభక్తమైనట్లుగా కవుల అనుభవాలు తెల్పుతున్నాయి. కవిత్వం మనిషిచేతనే సృష్టించబడ్డప్పటికీ, దాన్ని తిక్కనాదులు 'దివ్యకళ' అని అనడంచేత — కవిలోని 'అతిమానుష' భాగాన్ని గూర్చి జాగ్రత్తగా ఆలోచించాల్సి ఉంటుంది. మనస్సు ఉపరితలంనుంచి జరిగే వ్యవహారానికి కవిత్వానికి అంతగా సంబంధం లేదనిపిస్తుంది. మనస్సు యొక్క "లోలోతులు" కవిత్వానికి జన్మస్థానంగా కొందరు కవులే తెలిపారు. లొవెల్ 'కొలంబస్' కావ్యంలో

"ఎండ్ ఐ బిలీవ్డ్ ది పొయెట్స్; ఇట్ ఈస్ దే
హూ అట్టర్ విస్డమ్ ఫ్రమ్ ది సెంట్రల్ డీప్
ఎండ్ లిజనింగ్ టు ది ఇన్నర్ ఫ్లో ఆఫ్ తింగ్స్
స్పీక్ ది ఏజ్ అవుట్ ఆఫ్ ఎటర్నిటీ" 1

అని అంటాడు ఈ సెంట్రల్ డీప్ మనస్సులోని 'లోలోతుల'న్నమాట. ఆ లోలోతులకు వెళ్ళగల్గిన కవి తన బహిరుపాధితో సంబంధాన్ని ఈషణ్మాత్రమే కలిగి ఉంటాడు. అతని జీవచైతన్యం రచనావేళలో బహిర్ముఖం లేకుండా పూర్తిగా అంతర్ముఖంగా ఉంటుంది. ఆ వేళలో అతని నుంచి జరుగుతున్న కళాసృష్టిపై, వ్యక్తిగా ఆధిపత్యాన్ని వహించడానికి కానీ, అది ఎలా జరుగుతున్నదో తెలిసికొందామనిగానీ, అతడు సిద్ధపడడు. అలా అతడు సిద్ధపడితే — అతను బహిర్ముఖుడు కావడం జరిగి మనస్సు 'లోలోతుల' నుంచి దాని ఉపరితలానికి నెట్టివేయబడి కళాసృజన హృదయ వ్యాపారం కావడానికి బదులు బౌద్ధిక వ్యాపారమయి, దాని కళా విలువలు తగ్గిపోతాయి. కళా సృజన జరుగుతున్న వేళలో దాని సృజన ఎట్లా జరుగుతున్నదన్న విషయాన్ని కవులు ఆలోచించడానికి బదులు దానికి దిగ్భ్రాంతులైనట్లు ఒకరిద్దరు తెలుగు కవుల రచనలవల్ల తెలుస్తుంది. ఆ దిగ్భ్రాంతిలోనే పోతన 'పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట' అని అనడం జరిగింది. కవి కేవలం ఉపకరణంగా నిల్చినట్లుగా పోతనగారి ఊహ. రామభద్రుడు నిజానికి మనస్సులోని ఈ 'లోలోతులు' నించి బైటకు వచ్చినవాడు మాత్రమే. కవి అధికారం లేకుండా, దానంతట అదిగా వచ్చింది కాబట్టి 'పలికెడిది భాగవతమట' అని అనడం, మనస్సులోని ఈ ప్రాంతాన్నే షెల్లీ మానవునిలోని 'అదృశ్య స్వభావం' మరుగు పడుతోందంటూ కవిత్వం — "క్రియేటెడ్ బయి దట్ ఇంపీరియల్ ఫాకల్టీ హూస్ థ్రోన్ ఈస్ కర్టెయిన్డ్ వితిన్ ది ఇన్విసిబుల్ నేచర్ ఆఫ్ మాన్" 2 – అని ఆ అదృశ్య స్వభావాన్నే కవిత్వ జన్మస్థానంగా గుర్తిస్తాడు. కార్లైల్ వంటి పండితుడు కవిత్వ జన్మస్థానంగా మనస్సు మరుగుల్లో ఉండే ఈ స్థానాన్ని గుర్తిస్తూ "ది అట్టర్డ్ పార్ట్ ఆఫ్ మాన్స్ లయిఫ్ బేర్స్ టు ది అన్అట్టర్డ్, అన్కాన్షస్ పార్ట్ ఎ స్మాల్ అన్నోన్ ప్రపోర్షన్; హి హిమ్సెల్ఫ్ నెవర్ నోస్ ఇట్, మచ్ లెస్ డూ అదర్స్." 3 జాగ్రత్ స్థితిలో కవికి తెలియని ఈ మనస్సులోని మరుగు కవిత్వరచనావేళ కవికి అందుబాటులోకి వస్తుంది. అప్పుడు అతడు పొందే అనుభూతే 'ఆనందం'. ఈ ఆనందాన్ని పొందలేని కవి పాఠకునికి ఆనందాన్నివ్వలేడు. ఈ ఆనందం మనస్సుమరుగులోకి వెళ్ళగల్గితే తప్ప లభించేది కాదు. ఇక్కడ పొందే ఆనందాన్నే మనవాళ్ళు 'రసము' అని అన్నారు. 'కావ్యానందము'లో విశ్వనాథ "రస మనగా నేమి? లోకమునకు సంబంధించనిది. వట్టి మనోవృత్తి మాత్ర జన్యమైనది. దానియందు భావస్పర్శయేగాని వ్యక్తి స్పర్శలేదు. వ్యక్తిస్పర్శవచ్చినంతనే రస విశ్లథీకృతి కలుగును." 4 అని అంటాడు.

బహిర్జగత్తు వ్యక్తి స్పర్శతో కూడి ఉంటుంది. కేవల మనస్సునకు సంబంధించింది అలౌకికమైంది. ఆ మనస్సుతో కూడా సాధ్యమైనంత లోలోతులకు వెళ్ళగలిగితే అది పూర్తిగా అలౌకిక

మయి దివ్యత్వాన్ని పొందుతుంది. అక్కడ ప్రాదుర్భవం అవుతుంది కాబట్టే 'కవిత్వమొక దివ్యకళ' అని అనడం. 'పరమ చైతన్య' స్థితిలో కవిత్వం జన్మిస్తుంది కాబట్టి తిక్కన అలా అన్నాడు. ఈ పరమ చైతన్యస్థితిప్రాప్తిని గురించి విశ్వనాథ చాలా వివరంగా తెల్పుతూ 'కావ్యానందము'లో

“.... భావుకునకు పాఠకునకు కావ్యరూపమైన వాక్కు మనస్సును పొందును. వాక్కు మనస్సును పొందునా? వాగ్వృత్తి నశించును. మనోవృత్తి నశించును. మనస్సు ప్రాణములందు చేరదు. మనస్సు సూటిగా విజ్ఞానాత్మను పొందును. ఇది జాగ్రదవస్థాక్రమము. వాక్కు నశించలేదు. మనస్సు నశించలేదు. ప్రాణము నశించలేదు. వాని వృత్తులు నశించినవి .... అనగా వాఙ్మనః ప్రాణములు స్తంభించినవి. ఇంద్రియములు పనిచేయుట లేదు .... వాక్కు మనస్సు ప్రాణము మూడును స్తంభించిపోయినవి. అవిద్య గడ్డకట్టినది. భావకుని యొక్క చైతన్యము పరమ చైతన్యము నందు సుంతపాటు లీనమైనది.

కావ్య పఠితకు క్రమక్రమముగా నన్నియావరణలు దొలగవలయును. అతడాభ్యంతర వృత్తిమాత్ర రసికుడు కావలెను. వాడే శివుడగుచున్నాడు. దీనిపేరు కావ్యానందము.”[5] అని అన్నాడు. అభ్యంతరంలోకి పోవడం — అది ఎట్లా జరుగుతుందో, అలా 'లోనికి' పోతున్న వ్యక్తి క్రమ క్రమంగా ఒక్కొక్క ఆవరణనే — అంతరాన్నే — దాటుకొంటూ పరమ చైతన్యంలోకి ఎలా వెళ్తాడో విశ్వనాథ పై విధంగా వివరించాడు. ఇదంతా కవి వ్యక్తిలో ద్విధావిభక్తమైన 'ఇద్దర్ని' చూపడం కోసమే వివరించబడ్తోంది. కవి ద్విధావిభక్తం కావడాన్ని గురించి జోయెల్ చాండ్లర్ హారిస్ అనే రచయిత చెప్పినదానికి, ఈ వ్యాసకర్త చేసిన స్వేచ్ఛానువాదాన్ని కింద ఇవ్వడం జరిగింది.

“నా వరకు నేను — రాయబోతున్న విషయంమీద ఈషణ్మాత్రపు సూచనాప్రాయమైన ఊహనుకూడా కల్గించుండేవాణ్ని కాదు. కాని కలం తీసుకొని రచనకుపక్రమించేటప్పటికి కలం తుప్పు వదలి “ఇతరవ్యక్తి” సిద్ధమయ్యేవాడు. మా అందరిలో రెండు రకాలైన లక్షణాలు లేక వ్యక్తులు ఉంటారు. అందువల్లే “తమకు తామే మాట్లాడుకొనే” వారిని మీరు చూస్తుంటారు. వాళ్ళు తమలోని “ఇతరవ్యక్తి”తో మాట్లాడ్తారు. అవసరం అయిన ఆ క్షణంలో ఈ సమాచారాన్నంతా ఎక్కడినుంచి తెస్తావనీ, నేనెప్పుడో మర్చిపోయిన దాన్నెలా గుర్తుకు తెచ్చుకొంటావనీ అవతలి వ్యక్తిని తరచుగా అడిగేవాణ్ని! కాని నాకుతూహలాన్ని వాడెన్నడూ సమాధానపర్చలేదు. నేను కలం పట్టుకొన్నాక అతను వచ్చి నాబాధ్యతను స్వీకరించేటంతవరకు అతడు నా అవివేకానికి కేవల సాక్షిమాత్రుడుగా మాత్రమే ఉంటాడు.

వాడు రాసినదానికి ఒక్కొక్కప్పుడు హృదయపూర్వకంగా నేను నవ్వుతాను. తరచుగా నేనిలా నవ్వే సమయాల్ని నీవు చూడగల్గితే నీవు తప్పకుండా “ఆ ముసలాయన తన రచనకు తానే నవ్వుకోవడం మహాహంకారం” అని నిస్సందేహంగా అనుకొంటావు. కాని అసలక్కడే ముఖ్య విషయం ఉంది. అది అసలు నా రచనేకాదు; నా “ఇతరవ్యక్తి” నిజానికి రచిస్తున్నాడు. దానికి వచ్చే ప్రశంసల్నేమో నేను పొందుతున్నాను. ఇక్కడ నేనొక విషయాన్ని అంగీకరిస్తాను — పత్రికకు సంపాదకీయాలు నేను రాస్తున్నాను. వాటితో నేను నా “ఇతర వ్యక్తి”కి ఏమీ సంబంధం లేదు. వాటిపై అతని అభిప్రాయాల్ని పొందదలిస్తే వాడు వాటిని నిందాపూర్వకంగానూ, దూష్య విషయాలుగానూ భావిస్తాడని తేలుతున్నది. [ఏవోకొన్ని ఆదివారపు సంపాదకీయాలవంటి విషయాల్లో అతడు చేసిన సాయం ఉందనుకోండి.] వాడు పరమ దురవగాహ్యుడు. నేను వాణ్ని అర్థం చేసికోగల్గినంతవరకు కఠిన స్వభావం, చిరచిరలాడే స్వభావం ఉన్నవాడు. కాని ఈ స్వభావం నేను వాడికి — వాడి కిష్టమైన విషయాలపై నా కలం ద్వారా— రచనకు అవకాశం ఇచ్చేటంతవరకే. ఇక నేనేమో — నీకు తెలిసి ఉన్నట్లుగా — ఉత్సాహ స్వభావంతో, సత్స్వభావంతో, నిరపాయకరమైన ప్రవృత్తితో ఉండేవాణ్ని.

నాలోని ఆ “ఇతరవ్యక్తి”కి వాడికి సంతోషం కల్గించేరీతిలో వాడి శక్తిని వాడు పనికి వినియోగించే అవకాశాన్ని నేను ఇవ్వకపోతే వాడు నష్టం కల్గజేస్తాడని నాకు నిరూపణ అయింది.[6] పై విషయాన్ని ఒక రచయిత ఇంత వివరంగా చెప్పినదాన్ని, దీర్ఘమే అయినా ఈ వ్యాస ముఖ్యాంశాన్ని బలపరుస్తున్నందువల్లే ఇక్కడ ఉదహరించడం జరిగింది. రచనావేళలో రచయిత బాధ్యతను అతనిలోనే ఉన్న “ఇతరవ్యక్తి” తీసికోవడాన్నే విశ్వనాథ “.... ఎండ్ వెన్ అయామ్ రయిటింగ్ అయి డోంట్ ఎన్‌జాయ్ ఎయిదర్ ఫిక్షన్ ఆర్ పొయెట్రీ. దేర్ ఈస్ నో క్వెశ్చన్ ఆఫ్ ఎంజాయిమెంట్ దేర్. అయి ఆల్వేస్ ఫయిండ్ మయిసెల్ఫ్ ఇన్ ఎ హాయి సయికలాజికల్ పిచ్; సంథింగ్ లయిక్ ట్రాన్స్ నాట్ టు బి డిస్టర్బ్‌డ్.”[7] అని అన్నాడు.

ఇంకా ఆయన

“అయి నెవర్ థింక్ ఆఫ్ ది ప్లాట్ నార్ ఆఫ్ ది స్టయిల్ టు బి ఎంప్లాయిడ్ నార్ ఆఫ్ ది ఆర్ట్ - అయి బిగిన్. ది లాంగ్వేజి, ది ప్లాట్, ది ఆర్ట్, ది ఎక్స్‌ప్రెషన్, ది పొయెట్రీ దే ఆల్

కమ్ అప్ దేర్ ఓన్ ఎకార్డ్.... బట్ ఎట్ ది యాక్చువల్ మోమెంట్ ఆఫ్ డిక్టేషన్ ఇట్ ఛూసెస్ ఇట్స్ ఓన్ వే.... ఎవ్రీ లెటర్ అయి మస్ట్ సే ఈజ్ యాన్ ఆటోమాటిక్ అవుట్‌బర్స్ట్ ఆఫ్ ది మూడ్ ఇన్ విచ్ అయి విల్ బి ప్లేస్డ్. దిస్ ఈజ్ ఎ వండర్ టు మి ఎండ్ అయి యామ్ నెవర్ ఏబిల్ టు ఎనలయిస్ దిస్ స్టేట్ ఆఫ్ మయిండ్."8

ఇది కవులందరి అనుభవంలోని విషయంగా ఇక్కడ మనకు అర్థమవుతోంది. అందుకే రచనలో రచయిత స్థానాన్ని గురించి వివేచించే ప్రయత్నానికి పూనుకోవడం, కవిత్వోత్పత్తి స్థానం మనస్సు 'లోలోతుల'ని తేలుతున్నది కాబట్టి మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఈ 'లోలోతుల' విషయాన్ని ఎలా వివరించారో తెలిసికోవడం అవసరం. యూంగ్ దీన్ని "అన్‌కాన్షస్"గా నిర్ణయిస్తూ అది రచన కెంతగా తోడుపడ్తుందో తెల్పుతూ ఇలా అంటాడు [అనువాదం ఈ వ్యాసకర్తది.]

"మనిషిని కబళించి, అతణ్ని తనకు పరికరంగా చేసికొనే ఒక రకమైన అంతర ప్రేరక శక్తియే కళ. స్వీయ లక్ష్యాల్ని సాధించుకొనే స్వ-ఇచ్ఛ పరిసాధించబడ్డవాడు కాదు కళాకారుడు — అతడు తన ద్వారా దాని లక్ష్యాల్ని అది సాధించుకోవడానికి అంగీకరించేవాడు [మాత్రమే]. ఒక మనిషిగా అతనికి కొన్ని మనః స్థితులూ (మూడ్స్) ఒక కామనా (విల్) కొన్ని స్వీయ లక్ష్యాలూ ఉండవచ్చును. కాని ఒక ఉన్నత దృక్పథంతో చూస్తే అతడొక కళాకారుడుగా, అచేతనను [అన్‌కాన్షస్], మానవజాతియొక్క మానసిక జీవితాన్ని, తనతో తీసుకొని వెళ్తూ, దానికొక రూపాన్ని కలిగించే 'సామూహిక మానవుడుగా' [కలెక్టివ్ మ్యాన్] అవుతాడు."9

"సృజనాత్మకశక్తి ఆధిపత్యం వహించినప్పుడల్లా, చైతన్యవంతమైన ఇచ్ఛకు వ్యతిరేకంగా మానవ జీవితం 'అచేతన' చేత తీర్చిదిద్దబడి పరిపాలించబడ్తుంది — దానికితోడు అదృశ్యాహంకారం — జరుగుతున్న వాటికి కేవలం అసహాయమైన సాక్షికి మించి ఏమీ కాకుండా — ఒక అంతర ప్రవాహంలోకి ఊడ్చి పెట్టబడ్తుంది. ఈ చర్యలో కవికర్మ — కవియొక్క విధి [ఫేట్] అయి, అతని మానసికాభివృద్ధిని నిర్ణయిస్తుంది. ఫౌస్ట్‌ని సృజించేది గోధేకాదు. ఫౌస్టే గోధేని సృజిస్తుంది... "10

పైవిధంగా మనస్సులోని 'లోలోతుల'ను 'అన్‌కాన్షస్'గా యూంగ్ నిర్ణయిస్తూ, కళాకారుడంటేనే ఈ 'అన్‌కాన్షస్'ని తీర్చిదిద్దుకొంటూ, దాన్ని తన వెంట తీసికొని వెళ్ళేవాడనీ, అతని స్వీయేచ్ఛలు అతని కళమీద పనిచేయవనీ వివరించాడు. ఈ అన్‌కాన్షస్‌ని తనవెంట తీసికొని వెళ్ళడాన్నే గుంటూరు శేషేంద్రశర్మ విభూతి మాటల ఆధారంతో ఆత్మకళాభ్యాసం అంటూ ఆ ప్రక్రియ మీదా, దాని ప్రయోజనం మీదా ఇలా వివరించారు —

"వాడు (కవి) తటస్థంగా ఆలోచనాత్మక మాత్రంగా కూర్చోడు. సర్వేంద్రియాలతోసహా మానవ మహాంబుధిలోకి దూకుతాడు, బయటి కొస్తాడు. లోతుల్లోకి పోతాడు. తరంగాలమీద తేలుతాడు. అనుభూతిని కళగా నేర్చుకొనే దశలో ఒకడు మొదట బహిర్జగత్తు చేత బాధితుడౌతాడు. కానీ బాధను మూర్ఖుడివలె గాక సచేతనంగా అనుభవిస్తాడు .... అప్పుడు బాధ అంతర్ముఖత్వం బోధిస్తుంది. అప్పుడు సమస్త ప్రపంచాన్నీ తనలో చూచుకొంటాడు. అంటే జగత్తు కవి ఆత్మలోపడి కరిగిపోతుంది లేదా కవి జగత్తులోపడి కరిగిపోతాడు. ఇలా సంభవించే బాహ్యాంభ్యంతర ప్రయాణ కళాభ్యాసంలో వాడు సుఖ దుఃఖ విచక్షణ కోల్పోతాడు. ఈ ప్రక్రియే ఆత్మకళ అనబడింది. అణుభేదనం చేత అపారశక్తి విముక్తమైనట్లు ఈ ప్రక్రియ చేత ఆత్మ నిక్షిప్త చైతన్య మహాసాగరం గట్లు తెంచుకొని ఘోషిస్తుంది. ఈ చైతన్య సాగర జాగరణమే ఆత్మ కళాభ్యాస ప్రయోజనం."11

'ఆత్మకళాభ్యాసం'గా శేషేంద్ర చెప్తున్నదీ, 'అన్‌కాన్షస్'ని రచయిత తనవెంట తీసికొని వెళ్ళి దానికొక రూపాన్ని కల్గిస్తాడని యూంగ్ చెప్తున్నదీ, ఒక్కటే. శేషేంద్ర ఈ అన్‌కాన్షస్‌కి సమానార్థకంగా 'చైతన్య మహాసాగరం' అని వాడ్తున్నారు. ఇదే వ్యాసంలో ఉదహరించినట్లు విశ్వనాథ దీనినే 'పరమ చైతన్యం'గా తెలిపారు. ఈ పరమ చైతన్యముండే స్థానాన్ని గురించి విశ్వనాథ 'కావ్యానందము'లో తెల్పుతూ

"బ్రహ్మలోకమునందు బ్రహ్మ సరస్సు ఉన్నదట. బ్రహ్మ పదార్థమనగా ననంత చైతన్యము. అదియే యొక లోకమందము. అందొక సరస్సున్నదందము ఏసరస్సునుండి సరస్వతి ప్రవహించుచున్నదో యది యాసరస్సు. చైతన్యము వలననే కదా అన్ని యూహలు నన్ని క్రియలు శరీరధారులకు జరుగుచున్నవి. వీనికి సరస్సు అనునది యక్కఱ లేదు. ఇవి యన్నియు నెచటనుండి సముద్భవించుచున్నవో యట్టి చోటు తన్మహా చైతన్యమున నున్న యొక కొటారు అనవచ్చును. ఆ మహా చైతన్యమునందీ కొటారమెట్లు కలదో ఈ సరస్సు కూడ నట్లే కలదు. కొటారునకు చెఱువునకు భేదమేమి? కొటారు నుండి వస్తువులు తెచ్చికొనవలయును. చెఱువునుండి జలము ప్రవహించును. వాగ్దేవియనగా సరస్వతి యచటినుండి ప్రవహించుచున్నది. ఆమె యా ప్రవాహమూర్తి."12 అని అన్నారు. 'అన్‌కాన్షస్'

కన్నా పైస్థితి 'కొటారము'గానూ, అది ఒక మహా చైతన్యంలోని ఒక భాగంగానూ, దానిలోని ఇంకొక భాగమే ఈ 'సరస్సు'గానూ చెప్తున్నారు విశ్వనాథ. ఈ సరస్సు నుంచి వాక్కు ప్రవహిస్తుంది కాబట్టే దాన్ని సరస్వతి అంటారని విశ్వనాథపైన చెప్పినది యూంగ్ చెప్పిన 'అన్‌కాన్షస్' ఒక్కటే.

ఈ 'అన్‌కాన్షస్'కి తెలుగులో 'అచేతన' అని అనువాదం చేశారు. మూలమైన జర్మన్ శబ్దానికి ఈ రెండుకూడా నిజానికి వ్యతిరేకార్థాన్నిస్తున్నాయి. మహా చైతన్యానికి 'అచేతన' అని రూఢి చేయడం సబబుకాదు. మన మనస్సులోనే ఉండి దాన్ని మనం జాగ్రత్ స్థితిలో గుర్తించలేని దశలో అది 'అచేతన'. కళాకారుడు ఆత్మకళాధ్యానంలో దాన్ని తన వెంట తీసికొని వెళ్ళగలిగినప్పుడు నిజానికి అది 'అచేతన' కాదు. అప్పుడదే మహాచైతన్యం. దీని మొదటి దశను దృష్టిలో పెట్టుకొనే దీనికి 'అచేతన' అని పేరు పెట్టడం జరిగింది.

'అచేతన' మేలుకొన్నప్పుడు వాగ్దేవి స్రవించడానికి ప్రపంచ సాహిత్యంలోనే గొప్ప ఉదాహరణగా వాల్మీకి కవిద్వారా హఠాత్తుగా ఉద్గమించిన 'మానిషాద' శ్లోకాన్ని తెలుపవచ్చును. వేద ఋక్కుల్ని అపౌరుషేయాలుగా చెప్పడం బహుశః ఇందువల్లే జరిగి ఉండవచ్చును. జాగ్రత్ చేతనతో కాక ఈ అచేతనలో నుంచి స్రవించినవి కాబట్టే అవి మంత్రాలుగానూ, వాటి అర్థాలను వైదిక ఋషి దర్శించినట్లుగానూ చెప్పడం జరిగింది.13 అక్కడ ఋషి నిమిత్తమాత్రుడుగా, కేవలం ఉపకరణంగా మాత్రమే ఉండి ఆ మహాచైతన్యంలోనుంచి స్రవించిన వైదిక సాహిత్యాన్ని ఉద్గమింపచేశారు. అందుకే వైదిక సాహిత్యంనిండా ఎన్నో సజీవ ప్రతీకలున్నట్లుగా శ్రీ అరవిందులు గమనించగల్గారు.14 ఎడ్గార్ ఎలన్ పో రాసిన గొప్ప కవిత ది రావెన్, కాలెరిడ్జ్ రాసిన కుబ్లా ఖాన్‌లు పూర్తిగా ఈ అచేతన స్థితినుంచి ఉద్భవించినవే. ది రావెన్‌ను గురించి 'పో' కవి ఎంత కాన్షస్‌గా రాసినట్లు వివరణ ఇస్తూ వ్యాసం రాసినప్పటికీ విమర్శకులు దాన్ని నమ్మకపోవడం అది ఈ 'అచేతన'స్థితినుంచే రాయబడిందని భావించడంవల్లనే కావచ్చును.15 తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవి అయిన శ్రీశ్రీ 'మహాప్రస్థాన' గీతం కూడా ఇలా ప్రభవించిందే. దాని మూలాల్ని వెదకడంలో దాన్ని రాసిన కవికూడా ఆ కవితా రచనతో సంబంధం లేని వేరే పరిశోధకుడుగానే వెదకి "హరీంద్రకవి 'ఘరూ హుఆ హై జంగ్' అనే పాటా, నజ్రుల్ ఇస్లామ్ గీతాలూ నా మనస్సులో ఏవోమారు మూలల్లో మారు మోగుతూ ఉండాలి."16 "ఎడ్గార్ పో గంటలని అనుసరిస్తూ [అనువదిస్తూ కాదు.] ఒక గేయంరాశాను. అందులో

హరోం హరోం హర హర హర హర హర
హరోం హరా అని పలికే గంటలు

అన్న పాదాలు తతిమ్మా గేయంతో బేలన్సు కాకపోవడంవల్ల వాటిని ఉపసంహరించాను. రెండు నెలల తర్వాత ఆ 'హరోం హరోం హర' నించే మరో ప్రపంచం గీతం వెలువడిందని అనవచ్చును."17 'మోగుతూ ఉండాలి'- 'వెలువడిందని అనవచ్చును.' అన్నమాటలు వేరే వ్యక్తి తప్ప రాసిన కవే అనాల్సినవి కానట్లు అనిపిస్తాయి. కాని ఈ ఘట్టంలోనే రచయిత పాత్ర రచనలో ఎంత అన్న ప్రశ్న కల్గి ఈ వివేచన చేయాల్సివస్తోంది.18 ఒక వ్యక్తి 'అచేతన'లో కళాకారుడూ, కవిగానూ, జాగ్రచ్చేతనలో కేవలం విమర్శకుడు, పాఠకుడు లేక ఒట్టి వ్యక్తిగా మాత్రమే ఉంటాడు. రచన ముగించాక — రచన చేసిన వ్యక్తే జాగ్రచ్చేతనకు దిగివస్తే అచేతనలో జరిగినప్రాసెస్‌ని అక్షరాక్షరంచెప్పలేడు. అచేతనలో మునిగి తన రచనను నిర్వహించుతున్నప్పుడే ఆ స్థితిని విశ్లేషించబోతే ఆ ఉన్నత స్థితిని అతడు కోల్పోయి జాగ్రత్ స్థితికి దిగజారిపోయి కళాసృజన చేయలేకపోతాడు. జాగ్రత్ స్థితిలో జ్ఞాపకాలతో రచన చేయబోతే అది కేవలం యాంత్రికోత్పాదనం (మాన్యుఫాక్చర్) అవుతుంది తప్ప సృజనకాదు. సృజించే వేళలో కవి స్థితి చాలా ఉన్నతమైంది. ఈ ఉన్నత స్థితినే టాగోర్‌బాబు

"జగత్తుకు పైగా మనోమయ కర్మాగారమున్నది. దాని మీదుగా విశ్వహృదయ సృజనాయతనం వున్నది. ఆ మీద సాహిత్యోత్పత్తి జరిగే కళా నిర్మాణ వీధి."19

ఈ స్థితిలో ఉన్న కవి వేరు, ఈ స్థితినుంచి తిరిగి వచ్చిన మామూలు వ్యక్తిగా మారిన కవి వేరు. అచేతనలోంచి అన్నిపంచి విషయాలే రావడం ఆ కవియొక్క వ్యుత్పన్నతమీద, సంస్కారం, ప్రతిభమీద ఆధారపడి ఉంటుంది. ప్రచారం కోసం రాసే రచనలు సాధారణంగా ఈ 'అచేతన' నుంచి ఉద్గమించక పోవడం వల్లనే వాటికి సాహిత్యస్థాయి రావడం లేదు. కవి కేవల ప్రచారకుడుగా దిగజారిపోవడంవల్ల అతని కవిత్వాన్ని కళావిలువలు నశించిపోతాయి. దానికి బదులుగా అతడు ఋషి వంటి ద్రష్టగా ఎదగాలి — యోగిగా మారాలి. కాని యోగికీ కవికీ ఈ 'పరమ చైతన్యాన్ని' సాధించుకోవడంలో ఒక ముఖ్యాతి ముఖ్య భేదం ఉన్నది. విశ్వనాథ దీన్ని వివరిస్తూ కావ్యానందములో

"యోగి యేమి చేయుచున్నాడు? మనస్సునకు నింద్రియములకు నడుమనున్న తలుపును మూసివేయుచున్నాడు. అందుచేత

మనస్సునకు గత్యంతరములేదు. ఉన్నచో చీకటిగా నుండవలయును. లేదా చైతన్యములోనికి పోవలయును. అది యానంద భూమి. చీకటి లేదు. విచిత్రముగా నుండును.

భావుకుడైన కావ్యపాఠకుడు మనస్సునకు నింద్రియములకు నడుమనున్న తలుపును మూయలేదు. మూసెడి ప్రయత్నము లేదు. అందుచేత వీని మనస్సు చైతన్యభూమిలోనికి పోవును. వెంటనే తిరిగివచ్చును. ఈ కావ్యసాధకుని మనస్సుయొక్క కట్టు కంబము లోకములో నున్నది."20 పాఠకునికే కాదు. కవి స్థితి కూడా ఇటువంటిదే. చైతన్య భూమిలోనికి వెళ్ళిరాగల్గిన కవే కవి. బాహ్యాభ్యంతర ప్రయాణాలు చేయలేనివా డెన్నడూ కవి కాలేడు. అలాంటి ప్రయాణాలు చేయలేకపోతే — కవి ఇరు వ్యక్తులుగా విభాజ్యం అయి తనలోని 'ఇతరవ్యక్తి'ని శాశ్వతంగా సాధించుకోలేక పోతాడు.

## పా ద సూ చి క లు

1) ది పొయెటిక్ మయింద్ - పు. 91లో ఉదహరించబడింది. - ఫ్రెడరిక్ క్లార్క్ ప్రెస్కాట్
2) డిఫెన్స్ ఆఫ్ పొయెట్రీ - పు. 7. పై గ్రంథంలోని 16వ పుటలో ఉదహరించబడింది.
3) ఎస్సేస్, సర్ వాల్టర్ స్కాట్ - అదే చోట 87వ పుటలో ఉదహరించబడింది.
4) పు - 279
5) అదే - పు. 292
6) లయిఫ్ అండ్ లెటర్స్ బయి జూలియా సి. హారిస్-పు.334. 'పొయెటిక్ మయింద్' గ్రంథం 102, 3 పుటల్లోని పాద సూచిగా ఇవ్వబడింది.
7) మయి సెల్ఫ్ - మయి వర్క్ - విశ్వనాథ - [విమర్శిని: 2వ సంపుటం - పుట 95 - కాకతీయ విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖ ప్రచురణ.]
8) అదే - పు. 94-5
9) సయికాలజీ అండ్ లిటరేచర్, పు. 229
10) అదే - పు. 230
11) కవిసేన మేనిఫెస్టో పు. 56. కింద గీతలు నేను పెట్టినవి.
12) కావ్యానందము - పు. 2, 3
13) "....యాన్ ఎక్స్‌పీరియన్స్ దట్ కమ్స్ ఫ్రమ్ ది వెరీ ఇంటెన్సిటీ ఆఫ్ ది యాస్పిరేషన్, ఇట్ ఈజ్ స్పాంటేనియస్లీ ఫార్ములేటెడ్ ఇంటూ వర్డ్స్. వెన్ ఇట్ ఈజ్ టోటల్ ఎండ్ కంప్లీట్ ఇనఫ్, ఇట్ ఈజ్ ఫార్ములేటెడ్ ఇంటూ వర్డ్స్ .... విచ్ ఆర్ నాట్ తాట్ అవుట్, విచ్ ఆర్ స్పాంటేనియస్, విచ్ కమ్ అవుట్ స్పాంటేనియస్లీ ఫ్రమ్ ది కాంషస్‌నెస్. వెల్, ఇట్ ఈజ్ మోర్ దాన్ లయిక్‌లీ దట్ ది వేదాస్ వర్ లయిక్ దట్." - ది మదర్, వాల్యూమ్ 7, పు. 360.
14) ఈ విషయంకోసం శ్రీ అరవిందులు రచించిన అగ్నిసూత్ర భాష్య గ్రంథానికి రచించిన పీఠికను చూడవచ్చును.
15) 'ది రావెన్' కవిత నుదహరిస్తూ పో కవి రాసిన వ్యాసంలోని విషయాలపై విమర్శకుల అనుమానాలిలా ఉన్నాయి-

"పో కాల్డ్ దిస్ పీస్ హిస్ బెస్ట్ ఎక్సాంపుల్ ఆఫ్ క్రిటికల్ ఎనాలిసిస్. ఇట్ హాస్ ఆల్వేస్ ఫాసినేటెడ్ రీడర్స్ బికాస్ పో యూస్డ్ హిస్ ఓన్ పోయెమ్ "ది రావెన్" టు ఇలస్ట్రేట్ హిస్ తియెరీ ఆఫ్ పొయెటిక్ కాంపోసిషన్. వెదర్ ఆర్ నాట్ పో యాక్చువల్లీ కంపోస్డ్ "ది రావెన్" యాస్ హి సేస్ హి డిడ్ వాట్ హాస్ బీన్ ది క్రక్స్ ఆఫ్ ఎ లాంగ్ ఎండ్ కంటిన్యూయింగ్ క్రిటికల్ డిబేట్. - ది ఫిలాసఫీ ఆఫ్ కంపోసిషన్ బయి పో కంపయిల్డ్ ఇన్ "యాన్ ఆంథాలజీ ఆఫ్ అమెరికన్ లిటరేచర్ ఆఫ్ ది నయిన్‌టీన్త్ సెంచురీ." పు. 226
16) శ్రీశ్రీ సాహిత్యం - 2వ వచన విభాగం, పుట 527
17) అదే - పు. 528
18) కవిత్వం విషయంలోనేకాక మహా రచయితల నవలల్లోని పాత్ర సృష్టి - వాని నిర్వహణలో కూడా కొంత మేరకు ఈ 'అచేతన' యొక్క ప్రభావం ఉంటుంది - రాచకొండ విశ్వనాథశాస్త్రి రాసిన ఈ కింది మాటల్ని గమనించండి.

"నేను సృష్టించాలనుకొన్న కొన్ని పాత్రలు అవి సృష్టించబడ్డాక అవి నా వశం తప్పి పారిపోగా వాటిని పలబెట్టి ఆడడంలో (నాకు కష్టమే కాక, నవల రాయడంలో కొంత ఆలస్యం అయింది."

- 'మూడు కథల బంగారం' సీరియల్ నవలకు 'ముందు కొన్ని మాటలు' ఆంధ్రజ్యోతి [సచిత్ర వారపత్రిక] పు. 16, 14-5-82 సంచిక.
19) రవీంద్ర వ్యాసావళి, అనువాదం - రాయప్రోలు సుబ్బారావు, పుట 281.
20) పుట 1.1.



# ప్రేయసీ...

'రఘువర్మ'

నీ తలపుల సరసిలో
విరబూస్తూన్న పుష్పాలు
నా స్వప్నాలు !

నీ నయన చంద్రుల దృక్చంద్రికలలో
పరవశిస్తూన్న చకోరాలు
నా నేత్రాలు !

ఉదయవేళ విచ్చుకుంటూన్న
అరుణిమను చూస్తూన్నప్పుడల్లా...
చిరుకోపంలోని నీ చెక్కిళ్ళు
గుర్తుకొస్తాయి నాకు !

అస్తమయవేళ అలుముకుంటూన్న
కాలిమను చూస్తూన్నప్పుడల్లా....
అలసటతో మూసుకుంటూన్న
నీ కనురెప్పలు కనబడి
కలవర పెడతాయి నన్ను !

ప్రేయసీ ....
నా జీవన గీతానికి
సుఖ దుఃఖాలు రెండు చరణాలు !

ఈ గీతానికి నీవే నీవే పల్లవి !
నీ జ్ఞాపకం అనుపల్లవి !

❖✲❖

# సాపేక్షత

శ్రీ నిఖిలేశ్వర్

శూన్యం ఆవహించినపుడు
ఈ జీవితం వ్యర్థమనిపించి
ఏ ప్రయోజనం కోసం
ఏ మానవ విలువ కోసం
ఊపిరి పీలుస్తున్నామో —
అర్థంకాక అంతా సందిగ్ధమై
అయోమయపు పొరల్లో
చిక్కుకుని విలవిలలాడినపుడు;

ఈ క్షణానికి
నిన్నటి నిమిషానికి ఒక లంకే,
ఈ రోజు జరుగుతున్న చర్యకు
నిన్నటిరోజు ఇదే సమయానికే
జరిగిన పనికి సమాంతరంగా
పరుగులు పెడుతున్న సాపేక్షత !

కాని ఇపుడు

మాటకు మనస్సులోని భావానికీ మధ్య
తెగుతున్న ఆధారం,
నిజాయితీకీ సంపాదనకూ మధ్య
వేగంగా పెరుగుతున్న దూరం
జీవితాన్నీ దేశాన్నీ నిలదీసి
నిశ్చయంగా నిర్దయగా నిర్ణయించే కాలం !



డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# తెలుంగులో అరసున్న

ఆంధ్రప్రదేశ్‌లో నివసిస్తున్న ప్రాంతం - మనం - మన భాషని ప్రధానంగా రెండు పేర్లతో వ్యవహరిస్తున్నాం. 1) ఆంధ్రం 2) తెలుగు. 'తెనుగు' అన్న వ్యవహారంకూడా ప్రజల్లోవున్నా ప్రామాణిక రూపం ఈనాడు 'తెలుగు' మాత్రమే. 'తెలుంగు, తెలుఁగు' అన్న రూపాలు చారిత్రకంగా 'తెలుగు'కి పూర్వ రూపాలు. వాటిలో వరుసగా నిండుసున్న, అరసున్న ఉన్నాయి. అంటే వీటిలో ఉపధా 'లు'వర్ణం తర్వాత చారిత్రకంగా ఒకప్పుడు అనునాసికధ్వని (న్ =ం=C) ఉండి ఉండాలి. ప్రపంచ భాషల్లో చాలావాటిలో అనునాసిక ధ్వని లోపంవల్లే పూర్వాచును అనునాసికాకృతంచేసి ఉచ్చరించడం జరుగుతూ వుందని ఛార్లెస్ ఫెర్గ్యుసన్ ఒక పరిశోధనా వ్యాసంలో చెబుతున్నారు(1963 : XIV) అంటే 'తెలుఁగు' రూపం కన్నా 'తెలుంగు' ప్రాచీనం కావాలి. ఈ చిన్న వ్యాసం ఈ ఒక్క అంశాన్ని గురించి మాత్రమే రాస్తుంది. లిఖిత అలిఖిత ద్రావిడ భాషల ప్రమాణాల్ని ఆధారంగా మనం 'తెలుంగు'ను ప్రాచీనంగా ఉన్నరూపంగా నిర్ణయించగలుగుతున్నాం.

**వేపథ్యం :** బిషప్ కాల్డ్వెల్ (1856) నుంచీ 'తెలుగు' రూప నిష్పత్తిన్ని గురించి ఊహాపోహలు, సిద్ధాంత రాద్ధాంతాలు జరుగుతూనే వున్నాయి. విషయం ప్రసిద్ధం కాబట్టి కింద చెప్పిన గ్రంథాల్లో చాలా ప్రామాణిక చర్చలు లభిస్తాయి. పాఠకులు చూసుకోవచ్చు. (1) కాల్డ్వెల్ (1856) (2) కొమర్రాజు లక్ష్మణ రావు (1923) (3) గంటి జోగి సోమయాజి (1945) (4) జి. యన్. రెడ్డి (1974) (5) పి. యస్. సుబ్రహ్మణ్యం (1977). ఈ వ్యాసంలో చెప్పబడుతున్న అంశం కొత్తదే అయినా సుబ్రహ్మణ్యం (1977) నుంచీ స్ఫూర్తిని గ్రహించింది (ఆ గ్రంథంలో ఆయనా స్పష్టంగా చెప్పక పోయినా). పై గ్రంథాలతో పాటు వివాద ముఖ చర్చకు చూడదగ్గ గ్రంథం చిలుకూరి నారాయణరావుగారి 'ఆంధ్ర భాషా చరిత్రము' (1937, 2సం.)

### తెలుఁగులో బిందువు

కృత్రిమ వ్యుత్పత్తుల జోలికి పోకుండా తెలుఁగురూపంలో వున్న బిందువుకి (O> C) సహేతుకమైన వివరణం ఇవ్వగలమేమో చూడాల్సివుంది. తెనుఁగులో కూడా బిందువు ఉంది. భద్రిరాజు కృష్ణమూర్తి (1961) గారు మూల ద్రావిడంలో జరిగిందని గుర్తించిన -న-/-ల- ల వ్యత్యయాన్ని 'తెనుఁగు ~ తెలుఁగు' రూపాల్లో చూడ్డానికి ప్రయత్నించారు జి. యన్. రెడ్డిగారు (1974). ఆయన ఇచ్చిన వివరణం ఇది :

(ఎ) "ఈనాడు కూడా కొన్ని ప్రాంతాల గ్రామీణుల వ్యవహారంలో తెలుగులో న, ల-ల వ్యత్యయం కనిపిస్తుంది. మునగ - ములగ, చెనగు - చెలగు, మునుకోల - ములుకోల, జన్మం - జల్మం, లేదు-నేదు, లాగు నాగు మొదలైనవి. కాబట్టి తెలుఁగు త్రిలింగ శబ్ద భవం కాదనీ, దేశ్యమైన తెనుఁగు యొక్క రూపాంతరమే తెలుఁగు అనీ, ఈ రెండు రూపాలూ ప్రాచీన కాలం నుండీ తెలుగుదేశ వ్యవహారంలో ఉన్నాయనీ నిర్ణయించవచ్చు."

**[తెలుగు భాషా చరిత్ర (1974) : 8]**

పి. యస్. సుబ్రహ్మణ్యంగారి వివేచన ఇది :

(బి) "భాషా శాస్త్ర రీత్యా తెలుంగు, తెనుంగు పదాలలో తెలుంగే ప్రాచీనమనీ, దానిలో లకారం పక్కనున్న అనునాసిక ప్రభావంవల్ల నకారంగా మారి'తెనుంగు' ఏర్పడిందనీ చెప్పవచ్చు. ఇటువంటి మార్పు అడంగు > అణుగు మడంగు > మణుగు మొదలైన మాటలలో ఉంది. అదీకాక ఇరుగుపొరుగు వారైన తమిళులు మన భాషని 'తెలుంగు' అనే వ్యవహరిస్తారు."

**['ద్రావిడ భాషలు' (1977) : 27]**

సూర్యరాయాంధ్ర నిఘంటువు చూపిన పరిష్కారం ఇలా వుంది :

(సి) "తెనుగు (స్త్రీ) : ....దీని ప్రకృతి త్రిలింగః ప్రాకృతము తెలింగో. లాంగలి - నాఁగలి, తోల - తొన అయినట్లు తెలుఁగు శబ్దమే వర్ణ వికారముచే తెనుఁగైనది. కవి సంశయవిచ్ఛేద కర్త ప్రకృతులలోని 'ల' కారము వికృతులలో 'న' కారమగునని చూపుటకిచ్చిన యుదాహరణములలో 'త్రిలింగః, తెనుఁగు' అనునది ఒకటి .... బ్రౌను ఈ సిద్ధాంతము నంగీకరింపక 'తెన్' అను తమిళపదము మూలపదముగాఁ దీసికొని తెన్ - దక్షిణము,

తెనుఁగు - దక్షిణ దేశపు భాష అని వ్యుత్పత్తి చెప్పినాడు" (సంపుటము 4. 1979 ప్రతి పు. 16)

పైన ప్రదర్శించిన (ఎ) (బి) (సి)లలో రెండు విధాలైన అభిప్రాయాలు ప్రమాణంగా స్వీకరింపబడ్డట్టు తెలుస్తోంది.

1. తెన్‌గు తెల్ లు పర్యాయ వాచకాలు. తెన్ రూపాంతరమే తెల్. తెన్ - దిగ్వాచి (దక్షిణ మన్న అర్థంలో) - గు ప్రత్యయం కూడా కొడగు వంటి భాషల్లోలాగా దిగర్థాన్నే సూచిస్తుంది. న → లగా మారినట్టుగా (మునగ → ములగ లాగా) తెనుఁగు → తెలుఁగు అయింది. (ఎ).

2. తెన్ → తెల్ మార్పు ధ్వని పరిణామ దృష్ట్యా సాధ్యమే కావచ్చు - కాని 'తెలుంగు' నుంచి 'తెనుంగు' ఏర్పడటంలో అనునాసికం కారణంగా ల > నగా మారిందనడంలో ఉన్న సహజత, నిర్హేతుకంగా ల > న గానో, న > లగానో మారిందనటంలో లేదు (బి). (సి)లో చూపబడ్డ ప్రక్రియ కూడా ల > నగా మారటంలో ఉన్న ధ్వని పరిసర నియమాన్ని ప్రమాణీకరిస్తోంది. ఈ వ్యాసకర్త అదనంగా గ్రహించిన ప్రమాణం (సి).

ఇంతే కాకుండా (ఎ)ని అనుసరించి తెనుంగు లో వున్న బిందువుకి ఆకరం(సోర్స్) ఇదమిత్థమని నిర్ణయించబడటంలేదు.(బి)ని బట్టి కూడా అంతే. అయినా తమిళులు 'తెలుంగు' అంటారనటంలో సబిందుక రూపం ప్రాచీన మని మాత్రం గుర్తింప బడ్డది. (సి)ని బట్టి 'లింగ'లోని బిందువే మూలం కావాలి. (సరిగా ఈ కారణం వల్లే 'త్రినగ' రూపంనుంచీ 'తెనుఁగు'ను నిష్పాదనం చెయ్యడానికి చిలుకూరి నారాయణరావుగారు కూడా వెనుకంజ వేశారు. (చూ. ఆంధ్రభాషా చరిత్రము. 1937:32) కాని అనాగరక ద్రావిడ భాషలలోని రూపాలతో పోల్చిచూసేదాకా 'తెలుంగు'లోని బిందువుకి సహజమైన వివరణ దొరక్క పోయిందని అంగీకరించక తప్పదు. అంచేత 'లింగ'ను కూడా మూలంగా గుర్తించలేం.

## తెలుఁగు తొలి దశలు

తెలుగు ద్రావిడ భాషల్లో స్పష్టంగా ఒకటిగా ఈనాడు మనం గుర్తిస్తున్నాం. అంతే కాకుండా దక్షిణమధ్య ద్రావిడోప కుటుంబానికి (సౌత్ సెంట్రల్ ద్రవిడియన్) చెందిన భాషగానూ కృష్ణమూర్తిగారి పరిశోధనల ఫలితంగా ఈనాడు చెప్పుకోగలుగుతున్నాం. (మూల ద్రావిడ పదాది* చ-వర్ణ విషయంగానూ; ఇ → ఎ, ఉ → ఒల మార్పు విషయంగానూ కృష్ణమూర్తిగారు ఈ అంశాన్ని సప్రమాణంగా నిరూపించారు. (చూ. తెలుగు భాషా చరిత్ర 1974 : అధ్యా. 16 పు. 443-444)

కృష్ణమూర్తిగారి ఇటీవలి అవగాహన ఇది :

"తెలుగు తనకు దక్షిణ పశ్చిమాల నున్న తమిళ కన్నడాదులకంటె పూర్వోత్తరాల నున్న కూయి మొదలైన వాటికే పుట్టుకలో సన్నిహితమని శాస్త్రజ్ఞులంతా ఒప్పుకొన్న సత్యం." (1974, 443)

ఈ శాస్త్రీయ ప్రతిపాదనను నేపథ్యంగా స్వీకరించి ఆలోచిస్తే 'తెలుంగు'లోని బిందువుకి మూలం స్పష్టంగా తెలుస్తోంది. తెలుగుని ఆవరించుకొని ఉన్న మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలోని మధ్య ద్రావిడ భాషలనుంచి సమానార్థక రూపాల్లో -ంగ్ కనిపిస్తున్న సందర్భాలు చూద్దాం. ఇవన్నీ సుబ్రహ్మణ్యంగారి గ్రంథం (1977) నుంచే గ్రహింపబడ్డాయి.

1) గోండులు, గోండీ అనే మాటలు ఇతర భాషలవారు వాడేవి. గోండులు తమజాతి వారిని 'కోయ్‌తూర్' అనీ, తమ భాషని 'కోయాజ్' అనీ వ్యవహరిస్తారు. (పు. 36)

2) కొండ దొరలు అనే మాట తెలుగువారు వాడేమాట. వీరు తమ జాతి వారిని 'కూబిజ్' ('జ్'బహు వచన ప్రత్యయం) అంటారని డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు కనుగొన్నారు. (పు. 38)

3) కూయి భాష మాట్లాడే వారిని కోందులు, ఖోందులు లేక కంధులు అంటారు. వారు మాత్రం తమ జాతి వారిని 'కూఇంగ' ('ంగ' బహువచన ప్రత్యయం) అంటారు (పు. 40)

పై ప్రయోగాలు స్పష్టంగా నిరూపిస్తున్నాయి - 'ంగ' ప్రత్యయం బహువచనద్యోతకమనీ, అది జాతి (ఎథ్నిసిటీ)ని సూచించే రూపం తర్వాత చేర్చబడుతోందనీ.

ఈనాటి వ్యవహారంలో కూడా 'తెల'- అన్న మూలరూపం జాతివాచకంగా లభిస్తున్న ం 'తెలగ' 'బలిజ'కు పర్యాయ

వాచకం).* రాయలసీమలో 'బలిజ'లనే 'తెలగోళ్ళు' అనడం కూడా ఈ వ్యాసకర్త ఒకచోట గుర్తించాడు.

తెల్ - ప్రాంత సూచకంగా మిగిలి ఉన్న రూపం 'తెలంగాణా' (దీనికి రూపాంతరం - తెలంగాణా(ము)

ఇక తెల్ - తో కూడిన ప్రాచీన రూపాల విషయంచూడాలి నాయని కృష్ణకుమారిగారు ఒక గోండీ జానపద కథలో 'పెహంది లింగాల్' అన్న పురాణవ్యక్తిని గుర్తించారు (చూ. తెలుగు జానపదగేయ గాథలు 1977 : 71. ఆమె పెహంది + లింగాల్ అని విభజించుకొన్న రూపాన్ని పెహన్ + తిలింగాల్ అని విరుచుకోడానికి సాధ్యమవుతుందేమో భవిష్యత్తులో పరిశీలించాలి.)

చిల్లరిగె శ్రీనివాసరావుగారు (1933) చరిత్ర పూర్వదశల్లో తెలుగులకి, గోండులకి గల సంబంధాల్ని గురించి ప్రస్తావిస్తూ ధవళగిరి ప్రాంతాల్లోని అసురజాతివాడైన 'తెలంగ' మూర్తిని గూర్చి రాశారు. (చూ. పు. 94). ఆ గ్రంథానికి టి. రాజగోపాలరావుగారు రాసిన పీఠిక (పు. 1-108) కూడా గోండీ తెలుగుల సంబంధాన్ని గురించి చాలా విస్తారంగా చర్చించింది.

ఏటుకూరి బలరామమూర్తిగారు (1966) ఆంధ్రులలోని ఒక తెగగా ద్రావిడులైన తెలుగువారిని గుర్తించారు.

"ఇక మూడవతెగ ద్రావిడులైన తెలుగువారు. తెనుగు, తమిళ కన్నడ జాతుల ప్రజలు ద్రావిడ ప్రజలు. ఈ మూడు భాషలు ఒకే ద్రావిడ కుటుంబంలోనుంచి ఆవిర్భవించినవి. తెనుగు ప్రజల ఆదిమ నివాసస్థానం తెలంగాణా. అందులో నుండే తెలగాలు, తెలంగాణా, తెలంగాణ్యులు (ఉ. తెలఘాణ్యులనికూడా. బ్రాహ్మల్లో ఒక శాఖ - హెచ్. ఎస్. బి.) తెలింగిరి, త్రిలింగ దేశం మొదలైన పేర్లు ఏర్పడ్డాయి. బర్మాలోని తైలాంగ్ ప్రజలు ప్రాచీన తెలుగుజాతికి చెందిన వారనికూడా కొందరు ఊహిస్తున్నారు. తెనుగు అనే మాటకు దక్షిణ దిక్కుగా తిరుగువారు లేక ప్రయాణం చేయువారు అని అర్థం. తెన్ - దక్షిణ దిక్కు అని తమిళ కన్నడ భాషలలోని అర్థము."

(ఆంధ్రుల సంక్షిప్త చరిత్రలో పుట 14)

ఆంధ్రుల చరిత్రమీద పరిశోధిస్తున్న వారిలోనూ తెలుగన్న మాట జాతిని సూచిస్తోందన్న అభిప్రాయం ప్రసిద్ధంగా ఉందనటానికి బలరామమూర్తిగారి మాటల్ని ఉదాహరించడం జరిగింది.* 'తెలుగు'జాతి.వాచకమనటానికి ఇంకా ఎన్నో ప్రమాణాలున్నాయి.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సేకరించిన ప్రాచీన శాసనస్థ ప్రయోగాలని గంటి జోగిసోమయాజిగారు (1971 ప్రతి, పు. 20)ఒక అధస్సూచికలో కింది అమూల్య విషయాల్ని పదిలపరిచారు.

"985-1014 వఱకును పాలించిన రాజరాజునకు 'తెలింగకులకాల' యని బిరుదము గలదు. అతని సేనా నాయకుడు 'తెలుంగర్'ను ఓడించెను. క్రీ. శ. 1012 ఎపి. కర్ణాటక వా. III, నెం. 141 Sr. 2. మొదటి రాజేంద్రుడు (1012-1044 సం.) 'తెలుంగర్' అని ఎపి. డిపా. నెం. 30 సం. 1917. శాసనమున గలదు. శా. కాలము 1022 సం."

(ఆంధ్ర భాషా వికాసము పు. 20 అ. సూ. 1)

నన్నెచోడ శరుకాతి శాసనాల్లో తైలాంగ, తిలింగ, తెలింగ, త్రిలింగ వంటి శాసనస్థరూపాలున్నాయని సోమయాజిగారు రుదహరించారు పై ప్రయోగాల్లో జాతి/దేశ సూచనలున్నాయి. (చూ. పై. గ్ర. పు. 19,

* 'తెలగ' అన్న రూపంలో అరసున్న ఉండి ఉండాలని ప్రస్తుత పరిశీలన నిరూపిస్తోంది. కాని చాలావరకు అరసున్న లేని రూపాలే రికార్డై ఉన్నాయి. వెదకగా ఒక పద్యంలో అరసున్న కనిపిస్తోంది. ఒకప్పుడు కవులు, పండితులు ఈ విషయంగా ఏం అభిప్రాయపడ్డారో గుర్తించడానికని పాఠకుల కోసం ఆ పద్యాన్ని ఉదాహరిస్తున్నాను.

'తెలుఁగు శబ్ద వికారమో తెలఁగ పదము
తెలఁగ శబ్ద వికారమో తెలుఁగు పదము
తెల్గు నాయక కులజులే తెల్గలైరి
కప్పువడిపోయె ప్రాచీన గౌరవంబు'

— కాళహస్తి వేంకట నరసింహారావుగారి 'కులప్రసక్తి' (పూలదండలో) పుట 43.

* ఒక రూపానికి ధాత్వర్థ నిరూపణం చెయ్యడం అంటే కేవలం బుద్ధితో ఊహించి ధాతుక్రియాలకు ఇతర రూపాలతో ఉన్న అర్థ సామ్యవైషమ్యాల్ని ఆధారంగా అర్థ నిర్ణయం చెయ్యడమని కాదు. స్పష్టమైన చారిత్రక దృష్టితో ఒక పదానికున్న సామాజిక అస్తిత్వం, వినియోగం (సోషల్ ప్రాక్టీస్‌లో నిర్ధరింప బడుతున్నది) - వీటిని వ్యవహర్త కున్న 'స్ఫురణ'తో సమన్వయించ గల్గినపుడే ధాత్వర్థ నిరూపణంలో ప్రాయోగిక దృష్టి ఏర్పడ్డదని అర్థం.

చిలుకూరి నారాయణరావుగారు ఇంకా ఒకటి రెండు అదనపు ప్రయోగాల్ని చూపారు:

"శాసనములందీ దేశమునకు (అంటే కాకతీయులు రాజ్యము చేసిన దేశమునకు - హెచ్. ఎస్. బి) తెలింగ, తెలుంగ, తిలుంగ, తెలగ, తిలింగ యను పేళ్ళు కానవచ్చు చున్నవి. శా. శ. 1194 ప్రాంతముల రాజ్యమేలిన యాదవ రాజును రామచంద్రునికి 'తెలింగ తుంగ తమాల్మాలన దంతావల' యను బిరుదముండినట్లు తెలుపఁబడినది. కుంతల దేశాధీశుఁడగు రాచమల్ల దేవునకు 'తెలగలమారి' యను బిరుదముండెను."

(ఆంధ్ర భాషా చరిత్రము సం. 1. పు. 31)

పై అన్ని ప్రమాణాలూ నిరూపిస్తున్న అంశం 'తెల్' తప్పని సరిగా జాతినే సూచిస్తోందని - (అదే దేశాన్ని కూడా సూచించడంలో విప్రతిపత్తి ఏమీలేదు.)

సోమయాజిగారు సోదర ద్రావిడ భాషంనుంచి కింద చెప్పిన వివరాల్ని కూడా మరో అధస్సూచికలో దాచి ఉంచారు.

"తెనుఁగు శబ్దమునకు ప్రాచీన శాసన ప్రయోగములు కనుపట్టలేదు. దీనిని మొదట నకారము ప్రాస ఘటితముగా వాడిన వాడు నన్నయ. తెలుఁగు శబ్దము ప్రాచీన శాసనస్థము. తమిళ కర్ణాటక భాషా వాఙ్మయములలోను ఆంధ్రుల ప్రసక్తి వచ్చినచోట 'తెలుంగ, తెలుంగు' శబ్దములే ప్రయుక్తములయినవి కాని 'తెనుఁగు శబ్దము కనరాదు' చూ. తమిళములో - తెలుంగన్ = తెలుంగువాఁడు (కలింగత్తుప్పరణి 456-12 శ.) తెలింగమ్ = తెలుఁగుదేశము (నన్నూల్ 272, మయిలైనాదర్ వ్యాఖ్యానము 15శ.). తెలుంగమ్, తెలుఁగుదేశము, తెలుఁగుబాస (నన్నూల్ వృత్తి 273) కన్నడములో - తెలఁగు, తెలుఁగు = తెలుఁగు బాస (కన్నడ బసవ పురాణము 14వశ.) తెలుగ లిపి (పైది), తెలుంగితి = తెలుగుదేశ స్త్రీ (శబ్దమణి దర్పణము. 13వ శ.)"

నన్నయ తెలుఁగు శబ్దాన్ని వాడకపోవటం ఎంచేత? మనకు దొరికిన రూపం 'తెనుఁగు' అయినంత మాత్రాన ఆరోజుల్లో 'తెలుఁగు' వ్యవహారంలో లేదని ఎలా చెప్పడం? పండితులు 'ప్రాస'లో నన్నయ 'తెనుఁగు' అనే వాడాడని వాదిస్తున్నారు కూడా. అప్పుడు శర్మగారు సేకరించిన ప్రయోగాల్లో ఉన్న 'తెల్-' ధాతుయుక్త రూపాలు 'జాతి/వర్గ' సూచకం అవటంలో ఔచిత్యం కనిపించడం లేదూ; అప్పటికి 'తెలఁగలు' ఒక ప్రత్యేకవర్గం అయివుండాలి. తెన్- ధాతువుతో తెల్- ధాతువుకి అర్థంలో నిర్దిష్టమైన భేదం కనిపిస్తోంది. మునగ ౼ ములగ వంటి వ్యత్యయం అయితే అర్థభేదం ఉండరాదు. కాని ప్రస్తుతం చూపిన ప్రమాణాలు ఒకటి జాతివాచకమని, మరోటి దిగ్వాచకం కావచ్చని నిరూపిస్తున్నాయి.

చిలుకూరి నారాయణరావుగారు తమిళులకంటె తెలుగులు ఉత్తరాన ఉన్నారుకదా! (వడుగర్ - అని తెలుగువారిని తమిళులు పిలిచారుకూడా) అప్పుడు 'తెన్' అన్న దక్షిణదిగర్థవాచి తెలుగువారిని ఎలా బోధిస్తుందని ;- (చూ. ఆంధ్రభాషా చరిత్రము. పుట 33) ప్రశ్నించుకొన్నారు.

దీనికి సోమయాజిగారు సతర్కంగా ఒక వివరణ ఇచ్చారు:

"తెనుఁగు అనుశబ్దము కేవల ద్రావిడమయినను, తద్భవమైన (అంటే దక్షిణ - తెచ్చణ - తెన్ - అయివుండాలని ఆయనా ఊహించారు. చూ. పు. 32) నగునుగాని సంస్కృతము మాత్రము గాదు. తమ్ముఁబరిపాలించు నాంధ్రులుత్తరాది వారగుటచేఁ బాలితులైన తెనుఁగువారు తమ్ము తెనుఁగువారని వ్యవహరించుకొనుచుండిరని యూహింపనగును."

(ఆంధ్ర భాషా వికాసము; పుట 33)

కాబట్టి 'తెనుఁగు' అన్నరూపం 'దక్షిణాపథాన్ని'సూచించేది కావాలి - అప్పుడూ సమాధానం చేప్పలేని అంశం ఒకటి వుంది. ఈ రూపంలో అరసున్న ఎందుకుంది? యాదృచ్ఛికం అనవచ్చు కాని ప్రాచీన ప్రయోగాల్లో తెనుఁగు, (తెనుగ్గు) - స్పష్టంగా రికార్డైవున్నాయి. అది దిగర్థ వాచకమే అయితే తెలుఁగు రూపంతో సామ్యంవల్ల అరసున్న ఏర్పడివుండాలి. (తెలుగ్గు లాగా తెనుగ్గు వర్ణసమీకరణంవల్ల ఉచ్చరింపబడి వుండాలని-) ఒక సమయం వర్ణ వ్యత్యయంకారణంఅయితే న/ల వ్యత్యయం మాత్రం ఈ రూపంలో చారిత్రకంగా సత్యంకాదు. ల/న గానే చెప్పాలి. వర్ణసమీకరణం (ల→న [అనునాసికం ముందు) అనటమే సహజ వివరణగావుంది. గోండీ, కొండ, కుయి భాషల్లోని - జ్(గ్) యుక్త రూపాల్ని ఆధారంగా నిర్ధరించగల్గుతున్న అంశం - ఁగు దిగ్వాచి కాదని; జాతి ప్రజల్ని (బహువచనాన్ని) సూచించే రూపమని.

'గు' దిగ్వాచకం కావచ్చునన్న పూర్వ పండితాభిప్రాయం తెలుగు దక్షిణ ద్రావిడ భాషలతో సాన్నిహిత్యాన్ని ప్రదర్శిస్తోందన్న ఊహను ఆధారంగా కల్గింది కావచ్చు. కాని ప్రస్తుత ప్రతి

పాదన ప్రాచీన శాసన, కావ్య ప్రయోగాల్ని, సోదరభాషల వ్యవహారాన్ని, దక్షిణమధ్య ద్రావిడోప కుటుంబ సాజాత్యతను ఆధారంగా చేస్తున్నది కాబట్టి సహజంగా - 'ంగు' ను వివరించగలుగుతోంది. హ్రస్వాచ్చు తర్వాత చారిత్రికంగా అనునాసికం లుప్తం కావడంవల్లే అరసున్న - అది పోయి 'తెలుగు' లాంటి ఈనాటి వ్యవహారం సిద్ధించింది.

ద్రావిడ ధాతు నిఘంటువు (డి. యి. డి.) తెన్ - తోకూడిన రూపాల్ని ప్రదర్శించింది (చూ. అ. 2 39). - న/ల-వ్యత్యయం ఉన్న రూపాల్నీ చూపింది (చూ. అ. 45 4) - ఈ న-/ల-లు, మూల భాషలోని *-ణ-/*ళ-ల- నుంచీ పరిణమించినవి. తెలుంగు / తెనుంగులోని - ల-/న-వ్యత్యయం గురించి మాట్లాడటానికి పై డి. యి. డి. ప్రమాణం అవసరంగా కనిపించడంలేదు.

## ంగు పూర్వ చరిత్ర

ఈ వ్యాసంలో చరించాల్సిన కడపటి అంశం. -ంగు పూర్వ చరిత్ర గురించి. మారేమండ రామారావుగారు ఒక వ్యాసంలో (1950.18) తేల్ - అన్న నదీ ప్రాంతం నుంచి వలసవచ్చిన ఒక తెగ ప్రజలు తెలుగులన బడ్డారన్న విషయం రాశారు. ఆ ధాతు వ్యుత్పత్తిని నిరూపించడానికి ఇంకా కొంత పరిశీలన అవసరం కాబట్టి నిర్మాణాత్మకమైన ఉపపత్తుల్ని గ్రహిస్తూ 'తెలుంగు' లోని 'ంగు' పూర్వచరిత్ర తవ్వడం సాధ్యమవుతోంది. ఇక్కడ మరో విషయాన్ని పునరాలోచించాలి. 'తెనుగర్/తెనుగుట' అన్నరూపాలు 'తెలుగుజాతి జనులు' అన్న అర్థంలో ఎక్కడా వాడబడ్డట్టు ప్రమాణం లేదు. అందుకే 'తేల్' రూపాన్ని చరిత్ర పూర్వదశల్లోని ప్రాతిపదికగా గ్రహించడం; అది కుయి-కొండ - గోండీ మాండలికాలతో తెలుగు అభిన్నంగా ఉన్నదశ. - 'వాయు' అనే అర్థాన్ని నిష్పన్నంచేసే ప్రత్యయాలు-అజ్,-ఇజ్ (ఇంగ్)లు తేల్- ప్రాతిపదికకు చేర్చగా ఏర్పడ్డ రూపాలే తేల్+అజ్ → తెలాజ్ (కోయాజ్ అన్న రూపానికి సన్నిహిత మీ రూపం.◆ ధాత్వాదిలోని దీర్ఘాచ్చు అజాది ప్రత్యయం ముందు హ్రస్వమైంది. తర్వాతి రూపంకూడా చూడండి): తేల్ + ఇజ్ → తెలిజ్ (కువిజ్ అన్న రూపానికిది సన్నిహితం). ఈ రూపంమీద బహువచన ద్యోతకాలైన - కళ్ (- గులు) - గరు, రూపాలు చేర్చబడితే (-ళ-→ ల - గామారడంవల్ల) తెలింగల్ (ఉ) → తెలింగలు → తెలుంగులు (రూపాంతంలో 'ఉ' వర్ణంతో ప్రాతిపదికలోని 'ఇ' సమీకరణం పొందడంవల్ల); తెలుంగరు; తెలుంగులు వంటి రూపాలు ఏర్పడివుండాలి - కళ్ ప్రత్యయం - అర్ ప్రత్యయం- వీటి ప్రవర్తనకూడా భవిష్యత్తులో పరిశోధించదగ్గ అంశాలు.

◆ తేల్‌నదిని 'తెలివాహ' అని కూడా పిలుస్తారు (రామారావుగారి వ్యాసం పుట 18).

'లింగ'ను 'ల్+ఇంగ' గాలిడగొట్టడం ద్వారానే మనం పైన చర్చించిన రూపాల్లోని ద్రావిడ భాషా ప్రవర్తన లక్షణాన్ని గురించి పట్టుకోగలుగుతున్నాం. 'తెల్'-లోని 'ఎ' వర్ణం; -ఇంగ్ ముందు ఊర్ధ్వీకరణం పొంది - తిలింగ వంటి రూపాలు తర్వాతి దశల్లో ఏర్పడివుండాలి. ('ఇ' వర్ణం 'అ' ముందు 'ఎ' వర్ణంగా మారుతుందనడం పూర్వపరిశోధకులు గుర్తించారు కూడా.)

తి→తె→తై గా మారడంలోని 'వృద్ధి' పరిణామం (బర్మా లోని 'తైలాంగ్'; సంస్కృతీకృతమైన 'త్రైలింగ' వంటి రూపాలు సంస్కృత భాషా నిర్మాణమార్గాన్ని అనుసరించి పరిణమించినవి కావచ్చు. 'త్రిలింగ' రూపాన్ని మూలంగా చెప్పడం శైవమత ప్రభావం కావచ్చుననడంలో సందేహంలేదు.◆ తెన్-ని మూల ప్రాతిపదికగా గుర్తించి పైన చెప్పిన రూపాంతరాల్ని వివరించడం సాధ్యమైనంతగా సహజంగా కనిపించడం లేదు.

ఏనుంగులు, ఎలుకలు మొదలైన రూపాల్లో అనుచిత విభాగంవల్ల ఏనుంగు, ఎలుక వంటి ఏకవచనరూపాలు అనంతర కాలాల్లో ఏర్పడ్డట్టుగానే 'తెలుంగులు' నుంచి 'తెలుంగు' ఏర్పడింది. ఇప్పటికి లభించిన సహజవివరణం ఇది. పండితులు ఆలోచించి నిగ్గు తేల్చాలి.

## రిఫరెన్సులు


కృష్ణకుమారి, నాయని 1977 'తెలుగు జానపద గేయగాథలు', స్వీయ ప్రచురణ, హైదరాబాదు.

కృష్ణమూర్తి, భద్రిరాజు 1974 (సం) 'తెలుగు భాషాచరిత్ర', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రచురణ, హైదరాబాదు.


◆ బీరారు ప్రాంతంలో 'అంధ' లనబడే అనార్యతెగవారున్నారు. అంధ (అంధక = ప్రాకృతం) రూపమే సంస్కృతీకరింపబడి 'అంధ్ర' (ఆంధ్ర) అయిందని టి. బరో (1968) అభిప్రాయపడ్డట్టుగానే 'తిలింగ' రూపాన్ని రూప సామ్యాన్ని బట్టి 'త్రిలింగ' గా సంస్కృతీకరించి వుండవచ్చనటంలో అసహజత ఏమీలేదు. సంస్కృత నాటకాల్లో చూపించినట్టు సంస్కృత రూపం 'ఛాయా రూపం'గా కనిపిస్తోంది. (వివరాలకు చూ. బ్రహ్మానంద 'ప్రకృతి-వికృతి' (అముద్రిత వ్యాసం.)

జోగి సోమయాజి, గంటి 1945 'ఆంధ్ర భాషా వికాసము' (1971 ప్రతి) త్రివేణి ప్రచురణ, మచిలీపట్టణం

నారాయణరావు చిలుకూరి 937 'ఆంధ్రభాషా చరిత్రము', ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ, వాల్తేరు (2. సం.)

బలరామమూర్తి, ఏటుకూరు 1953 'ఆంధ్రుల సంక్షిప్త' చరిత్ర' లో ఆంధ్రుల ప్రాచీనత పు.9_15, విశాలాంధ్రప్రచురణ (4 ము. 1966)

బ్రహ్మానంద, హెచ్.ఎస్. 1982 'ప్రకృతి : వికృతి' (అముద్రితం)

రామారావు, మారేమాండ 1950 'ఆంధ్రులు ఆంధ్రదేశము', శాతవాహనసంచికలో స్వీయ సం. ఆంధ్రేతిహాస పరిశోధన మండలి ప్ర. గుంటూరు, పు. 13_21

రెడ్డి, బి. యన్. 1974 'ఆంధ్రము, తెనుఁగు, తెలుఁగు,' చూ. భ. కృష్ణమూర్తి (సం) పు. 1_14

లక్ష్మణరావు, కొమర్రాజు, వెంకట 1923 'లక్ష్మణరాయ వ్యాసావళి', విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, మద్రాసు

శ్రీనివాసరావు, చిల్లరిగె 1933 'ఆంధ్రదేశపు చరిత్రము'-సం. 1.

సుబ్రహ్మణ్యం పి.యస్. 1977 'ద్రావిడ భాషలు, స్వీయ ప్రచురణ. అన్నామలై నగర్

'ది ద్రవిడియన్ ఎటిమొలాజికల్ డిక్షనరీ' (డి. ఇ. డి.) టి. బరో & ఎం. బి. ఎమెనో (సం). ఆక్స్‌ఫర్డ్ (1961)

'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు' (1944) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ పునః ప్రచురణ (1979) సం. 4

బరో టి, 1968 కలెక్టెడ్ పేపర్స్ ఆన్ ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అన్నామలై యూనివర్సిటీ ప్రచురణ, పు. 334_336

కాల్డ్‌వెల్ బిషప్ 1856 'ఎ కంపారెటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ ఆర్ ది సౌత్ ఇండియన్ ఫామిలీ ఆఫ్ లాంగ్వేజస్' మద్రాసు యూనివర్సిటీ ప్రచురణ (1963)

ఫెర్గ్యుసన్, ఛార్లెస్ 1963 'అసంప్షన్స్ ఎబౌట్ నాసల్స్ - ఎ సాంపిల్ స్టడీ ఇన్ - ఫొనలాజికల్ యూనివర్సల్స్': అన్వర్ ఎస్. డిల్ (సం) 'లాంగ్వేజ్ స్ట్రక్చర్ అండ్ లాంగ్వేజ్ యూజ్'లో పునర్ముద్రితం (1971), కాలిఫోర్నియా




# ప ద వి

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

చెరకు రసముకన్న చెలియ మాటలకన్న
తేనె చినుకు పాల తేటకన్న
పెదవి తీపికన్న పదవి తీపిర మిన్న
కంటి నలుసుర ! పులికంటి మాట !!

కూడు గూడు లేక కుములుచు మనవచ్చు
కొన్ని దినములైన కోర్కెలుడిగి
పదవిలేని క్షణము ప్రాణాలు నిలువవు
కంటి నలుసుర ! పులికంటి మాట !!

కూటికొరకు పడెడి కొరగాని పాట్లెల్ల
పదవి కొరకు పడిన ఫలితమబ్బు !
తెలిసి బ్రదుకలేని 'తికోర్కెళ్ళు' సన్నోళ్ళు
కంటి నలుసుర ! పులికంటి మాట !!

ఇంద్రుడంతవాడు యింగితమ్మును వీడి
పడతులడ్డ లేదె పదవి కొరకు
నీవు నేను చేయ నేర మెట్లగునురా !
కంటి నలుసుర ! పులికంటి మాట !!

ఎగ్గు సిగ్గు వీడి ఎన్నెన్ని మార్గాల
అడ్డదారుల పడి గడ్డి కరచి
పదవినందు వాడె ప్రాజ్ఞుడై ధరచెల్లు
కంటి నలుసుర ! పులికంటి మాట !!

మందు మాకులైన మంత్ర తంత్రములైన
వీగిపోయినట్టి రోగిచెంత
పదవిపేరు పలుక పైకి లెగ్గున లేచు
కంటి నలుసుర ! పులికంటి మాట !!



# పరమేశ్వరుని సందేశం!

## శ్రీ కే. కిశోరుబాబు    శ్రీ కే. అశోకుబాబు

తాను
"స్థాణువు"
సతి
"అపర్ణ"
కుమారుడు
"విశాఖుడు"
అయినా
కలవరపడడు
కళ వళ పడడు
కించ పడడు
గగ్గోలు పడడు
పరమ శివుడు !
నిబ్బరంగా
ఆశ్రితులకి
ఇబ్బడి ముబ్బడిగా
"అభిమత ఫలాల్ని"
అనుగ్రహిస్తూనే ఉంటాడు !
ఎన్ని అననుకూల పరిస్థితులున్నా
క్లిష్ట సమస్యలున్నా
ప్రతి మనిషి
తనలాగే
ధృతీ క్షమలతో
విరాజిల్లు తుండాలంటాడు !
తనలాగే
అండచేరినవాళ్ళ అభీష్టాల్ని
ఈడేరుస్తుండాలంటాడు !
అదే అతని దివ్య సిద్ధాంతం !!
అదే అతని పవిత్ర సందేశం !!



"చాణుక్య"

# జస్టిస్ కుమార్ సుప్రీంకోర్టు నిర్ణయం

నేను గతంలో రెండు వ్యాసాలు వ్రాశాను. అవి 'ఏప్రిల్' 'ఆగస్టు' 'భారతి'లలో ప్రచురించబడ్డాయి. మొదటి దానిలో నేటి ధోరణుల రీత్యా ఎలా న్యాయమూర్తుల బదిలీ అవసరమనే విషయం పరామర్శించబడ్డది. రెండవదానిలో మన సుప్రీంకోర్టు 1981 డిసెంబరులో ఇచ్చిన చారిత్రాత్మక నిర్ణయంలో ఎలా ఈ బదిలీలను సమర్థించింది. వివరించటం జరిగింది.

ఈనాటి వ్యాసంలో, ఢిల్లీ హైకోర్టు జడ్జి శ్రీ కుమార్ విషయాలను గురించి వివరించటం జరుగుతుంది. ఇది కేవలం ఒక వ్యక్తికి సంబంధించిన విషయం కాక వ్యవస్థ లోటుపాట్లను సూచించే సంఘటన కాబట్టి దానిని విశ్లేషించటం జరుగుతున్నది.

ఆనాడు సుప్రీంకోర్టు ముందున్న రిట్లలో ప్రముఖ న్యాయవాది తార్కుండే వేసిన ఒకరిట్ ఉంది. అది శ్రీ కుమార్‌కు సంబంధించింది. మొదట్లో శ్రీయుతులు వోహ్రా, కుమార్, వాడ్‌లు ఢిల్లీ హైకోర్టు అదనపు న్యాయమూర్తులుగా 2 సంవత్సరాలపాటు 1979మార్చి7న నియమింపబడ్డారు. తరువాత తిరిగి 3 మాసాలపాటు నియమింపబడ్డారు. తరువాత వాడ్‌ను ఒక సంవత్సరకాలం తిరిగి నియమించారు. వోహ్రా, కుమార్‌లకు నియామకాలు లేకపోవట తో వారు పదవీచ్యుతులయ్యారు.

శ్రీ తార్కుండే తన రిట్‌లో వోహ్రా, కుమార్‌లను ప్రతివాదులుగా చేర్చారు. వారిలో కుమార్ అఫిడవిట్‌ను [ప్రమాణపత్రాన్ని] దాఖలుచేసి విచారణలో పాల్గొన్నాడు. వోహ్రా పాల్గొనలేదు.

ఇప్పటి ప్రశ్నల్లా కుమార్ ఎందుకు పదవీచ్యుతుడయ్యాడన్నదే. ఇది సుప్రీంకోర్టు తీర్పులో చాలా ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది.

ఇందులో ఢిల్లీ హైకోర్టు చీఫ్ జస్టిస్ శ్రీ ప్రకాష్ నారాయణ్ చాలా ప్రముఖపాత్ర వహించాడు.

1981 ఫిబ్రవరిలో, జస్టిస్ కుమార్ మీద వ్రాతపూర్వకమైన మరియు ఇతరులద్వారా అనేకమైన ఆరోపణలు చేయబడ్డాయనీ' తనకు ఇందులో నిజానిజాలు తెలుసుకునేందుకు యంత్రాంగమేమీ లేదనీ, అయినా తాను కుమార్‌ను తిరిగి నియమించమని చెప్పలేకపోతున్నానని వ్రాశాడు ["ఐ హావ్ నో ఇన్వెస్టిగేటింగ్ ఎజన్సీ టు కన్‌క్లూజివ్‌లీ ఫైండ్ అవుట్ వెదర్ ది కంప్లెయింట్స్ ఆర్ జెనుయైన్ ఆర్ నాట్"] ఈ ఉత్తరం భారత ప్రధానన్యాయమూర్తికి పంపబడింది. దాని మీద ఆయన మార్చిలో వ్రాస్తూ తానీ విషయాన్ని వివరంగా పరిశీలించ దలుచుకున్నాననీ, ఏదైనా కుమార్‌ను ఇంకో ఆరునెలలు పదవిలో ఉండనియ్య వలసిందని కోరాడు. దానిమీద కేంద్రమంత్రి శ్రీ శివశంకర్ సలహామీద కుమార్ పదవీ కాలం 3 నెలలు మాత్రం పొడిగించబడింది.

వెంటనే శ్రీ శివశంకర్ తిరిగి ఈ విషయాన్ని పరిశీలించమని ప్రకాష్‌నారాయణ్‌కు వ్రాశాడు. దానిమీద ఆయన భా. ప్ర. న్యాయమూర్తిని మార్చి 26న కలిశాడు, ఈ విషయం చర్చించాడు.

తిరిగి శ్రీ శివశంకర్ వ్రాశాడు. అలా కుమార్ విషయం వ్రాసేందుకు ప్రకాష్‌నారాయణ్ వద్ద "కాంక్రీట్ మెటీరియల్" ఉండి ఉంటుందనీ, దానిని తన విమర్శతో పాటు పంపవలసిందని కోరాడు.

దానితో ఆ "కాంక్రీట్ మెటీరియల్" బయటికొచ్చింది. అది ఇది : 1980 మొదటి సగంలో కుమార్‌ను గురించిన రవరవలు ప్రకాష్‌నారాయణ్ చెవినబడ్డాయి. కుమార్‌ను ఈ గుస

గుర ుంుంచి తప్పించేందుకు గాను, ఆయన చేస్తున్న పనినుంచి ఆయనను తప్పించి, ఆయనను ఇంకో జడ్జితో బెంచీలో నియమించారు. అయినా-వేటిని గురించయితే ఆ రవరవలు బయలుదేరాయో ఆ మూడు దావాలను కుమార్ విడువలేదు. అని తనే వినాలని తనతోపాటే తీసుకుపోయాడు, అదావాలివి 1417/78, 1408/79, 1409/79. అగస్టు 1980లో తిరిగి ఇంకొకజడ్జి కుమార్‌ను గురించి గుసగుసలాడారు. దానితో ప్రకాష్‌నారాయణ్, కుమార్ చేస్తున్న దావాలన్నిటినీ పరిశీలిస్తే, అందులో చాలాధనవంతుల దావాలు, కొంతమంది మాజీ మహారాజుల దావాలు కూడా ఉన్నాయి. ఇంతలో ప్రకాష్‌నారాయణ్ 1981 జనవరిలో శాశ్వత ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడ్డాడు. తరువాత ఈ విషయాలన్నిటినీ ఆలోచించుకొని, కుమార్ శాశ్వత న్యాయమూర్తి పదవికి అనర్హుడనే నిర్ణయానికొచ్చాడు. తరువాతది సాబిర్‌హుస్సేన్ అనే న్యాయవాది చేసిన ఆరోపణ. దానిని కుమార్‌కే చూపాడు నారాయణ్. కుమార్ దానిని గురించి ఏమీ వ్యాఖ్యానించలేదు. జడ్జిమెంటు చెప్పేందుకు మట్టుకు కుమార్ ఆరునెలలు తీసుకొన్నాడు. తరువాత కుమార్ పని విషయం కూడా నిదానంగా, తృప్తికరంగా లేదు, ఎక్కువ వ్యవహారాలను పరిష్కరించలేకపోయారు. ఇలా సాగింది ప్రకాష్ నారాయణ్ ఉత్తరం – అదే "మెటీరియల్".

దురదృష్ట మేమిటంటే ఇవన్నీ సత్యాలు కాకపోవటమే.

జస్టిస్ భగవతీ సీనియర్ న్యాయమూర్తిగా ఈ ధర్మాసనానికి అధ్యక్షత వహించారు. తనే ప్రముఖ పత్రికా రచయిత శ్రీ అరుణ్‌షౌరేతో ఈ తీర్పును గురించి 1½ గంటలు చర్చించి, తన 308 పుటల తీర్పునూ 5 పేజీలకు కుదించి దానిని షౌరేకు ఇచ్చారు. దీనిలోని సమస్యల ప్రాముఖ్యతరీత్యా, విస్తృతమైన చర్చ జరగటం మంచిదన్నారు. వీటన్నిటిరీత్యా జనవరి 1982 లో శ్రీ అరుణ్‌షౌరే 3 వ్యాసాలు వ్రాశాడు. అందులో, ఈ తీర్పులో బయటికిరాని అనేక విషయాలను బయటపెట్టారు.

అందులో ముఖ్యమయింది ఈ దావాల బండారం. ఆ మూడు దావాలు జైన్ శుద్ధ వనస్పతీ కంపెనీ తరఫున న్యూఇండియా అష్యూరెన్స్ కంపెనీమీద దాఖలుచేయబడ్డాయి. ఇందులో వనస్పతి కంపెనీ తరఫున కుమార్ ధనాన్ని ఆశించాడని ఆరోపణ, ప్రకాష్ నారాయణ్ కథనం. తనతో ఒక సాటి న్యాయమూర్తి ఈవిషయాన్ని మే లో ముచ్చటించాడని ("యర్లీ మే"). దానితో తాను కుమార్ గౌరవాన్ని కాపాడేందుకు కుమార్‌ను బెంచికి వేశాడనీ, అయినా ఆ దావాలను కుమార్ విడవలేదనీ కథనం.

కాని వాస్తవమో ?

మే కు ముందే, ఏప్రిల్ 11వ తేదినే కుమార్ ఆ వ్యవహారంలో అప్లికేషన్‌మీద తీర్పుచెప్పాడు. తీర్పు వనస్పతికంపెనీకి అనుకూలంకాదు, వ్యతిరేకమయింది.

ఆ తీర్పు తరువాత ఆ దావాలు జస్టిస్‌ఖన్నా ఫైలులోకి వెళ్లాయి.

ఇక ఆ దావాలు కుమార్ చేయటమెక్కడుంది ?

ఇది మొదటి అబద్ధం.

1981 జనవరిలో ప్రకాష్‌నారాయణ్ ఢిల్లీ హైకోర్టుకు పర్మనెంట్ ఛీఫ్‌జస్టిస్‌గా నియమింపబడ్డాడు. 1980 రెండవ సగంలో, కుమార్‌ను అప్రతిష్ఠ నుంచి తప్పించేందుకుగాను, ఒక్కడుగా కాకుండా, బెంచిలో సభ్యునిగా నియమించానంటాడు ప్రకాష్‌నారాయణ్.

వాస్తవాలేమిటి ?

1980 రెండవ సగంలో, కుమార్ ఒక్కడుగా కేవలం 5 వారాలే కూర్చున్నాడు. జస్టిస్ స్కార్‌తో కలిసి 3½ మాసాలు బెంచిలో కూర్చున్నారు. తరువాతి విషయం ఇంకా హాస్యాస్పదమయింది.

1981 జనవరిలో ప్రకాష్‌నారాయణ్ శాశ్వత ప్రధానన్యాయమూర్తి కావటంతోనే, తిరిగి కుమార్ ఒక్కడే కూర్చుని వ్యవహారాలు చూడవలసిన ఒరిజనల్ బెంచికి తానే నియమించాడు !

ఇది రెండవ అబద్ధం. ఈ ప్రవర్తనను, ఆ వ్రాతలను ఏమనాలి ?

మూడవది – అబద్ధం కాకపోవచ్చుకాని, పూర్తి అసంబద్ధం.

కుమార్‌ను మార్చినా, ఆ దావాలను "వదలలేదు" అనే విషయం. మామూలుగా హైకోర్టులలో బెంచీలను మార్చటమనేది, ఎవరెవరు కూర్చోవాలనేదీ నిర్ణయించేది ప్రధానన్యాయమూర్తి.

ఉదాహరణకు ప్రతినెలా 1వ తేదీన ఇవి మారతాయనుకోండి. 30-31 తేదీలలో ఉదాహరణకు ఒకదావా మీద అప్పీలులో సగం వాదనలు పూర్తయ్యాయనుకోండి. 1వ తేదీన ఆ బెంచి మారితే తిరిగి ఆవాదనలు కొత్తబెంచి ముందు మొదలుపెట్టాలి. ఇలా జరిగితే ఎంత కాలం వృధా అవుతుంది? కాబట్టి ఒకరిముందు అసంపూర్తిగా ఉన్న వ్యవహారం లేదా వ్యవహారాలు - అవ్వి కొద్దిగానే ఉంటాయి కాబట్టి - ఆ న్యాయమూర్తితోనే వెళతాయి. ఇది ఒక ఆనవాయితీగా వస్తున్నది. ఢిల్లీ హైకోర్టులోని అలవాటిది.

ఇంకో విషయం కూడా ఉంది. జిల్లాకోర్టులు, మున్సబు కోర్టులువలె, హైకోర్టులలో వాయిదాలు జడ్జీలు వెయ్యరు. దానికొక పెద్ద ఆఫీసు ఉండటం, వాళ్ళు జాబితాలు తయారుచేయటం, ఆ జాబితాల ప్రకారం ఆ వ్యవహారాలు ఆ జడ్జీల ముందుకొస్తాయి. కాబట్టి ఏ వ్యవహారం జడ్జిముందుకొస్తుందో ఆ జడ్జికి తెలియదు.

ఢిల్లీ హైకోర్టులో ఇంకో విశేషం కూడా జరిగింది. ఒక జడ్జి విన్న వ్యవహారాలు అదే జడ్జిముందుకు రావాలి అనే విషయం ఎంత రూఢిగా పాతుకుపోయిందంటే, ఒకసారి కనీసం ఇద్దరు జడ్జీలు తాము విన్న వ్యవహారాలు, తమముందు తిరిగివేయనందుకు, రిజిష్ట్రారును "కోర్టుధిక్కార" నేరం క్రింద ఎందుకు శిక్షించ గూడదని ప్రశ్నించేటంత వరకు వచ్చింది.

పైగా ఆ మూడు దావాలను తనముందే ఉంచితీరాలని కుమార్ వాటిమీద ఏమీ ప్రత్యేకంగా ఉత్తర్వులు జారీచేయలేదు.

ఈ పరిస్థితులలో ఆ దావాలను కుమార్ "వదలలేదు" అనటంలో అర్థం ఏమిటి?

వీటన్నిటినీ మించినది సుప్రీంకోర్టు పాత్ర.

కేవలం ప్రకాష్‌నారాయణ్ - శివశంకర్ - చంద్రచూడ్-కేంద్రప్రభుత్వా ఉత్తరప్రత్యుత్తరాలు బహిర్గతాలవటంలో ఈ విషయాలు బయటికి రాలేదు.

ప్రకాష్‌నారాయణ్ వాదాలను ఖండించే ఈ వివరాలన్ని కుమార్ ఒక అదనపు ప్రమాణపత్రం('సప్లిమెంటల్ అఫిడవిట్') ద్వారా సుప్రీంకోర్టు ముందుంచాడు జస్టిస్ భగవతీ అనుమతితో, ఆయన ఆదేశానుసారం, ప్రత్యేకదూతల ద్వారా, ఆ వ్యవహారాన్ని వింటున్న ఏడుగురు సుప్రీంకోర్టు న్యాయమూర్తుల ఇళ్ళకూ ఈ అదనపు ప్రమాణపత్రం పంపబడ్డది. అది ఈనాటికీ ఈ వ్యవహారంలో సుప్రీంకోర్టు రికార్డులో ఉంది.

కాని దురదృష్టమేమిటంటే, ఏడుగురు న్యాయమూర్తులూ తమ తమ తీర్పులో, మొత్తం ముద్రణలో 570 పేజీలొచ్చినా, ఒక్కరూ వీటిని గురించి ఎత్తకపోవటమే సుమా!

అంతే కాదు. జస్టిస్ భగవతీ తన తీర్పులో, ఈ వాస్తవాలను గురించి ఇలా వ్రాశాడు: "బట్, యాజ్ వుయి అబ్జర్వ్‌డ్ ఎ లిటిల్ వైల్ ఎగో, దిస్ ఈజ్ నాట్ ఎ మాటర్ హుచ్ కెన్ బి ఇన్వెస్టిగేటెడ్ బై ది కోర్టు అండ్ ఇట్ మస్ట్ బి లెఫ్ట్ టు ది గవర్నమెంట్ ... ...."

వాస్తవాలు తమ ముందున్న సుప్రీంకోర్టు ఈ దృక్పథాన్న వలంబించింది.

కాబట్టే అరుణ్‌షౌరే ఇలా వ్రాయగలిగాడు: "హావింగ్ రిసీవ్‌డ్ ది ఫాక్ట్స్, హావింగ్ రిపీటెడ్లీ సెడ్ దట్ ది సుప్రీంకోర్టు వుడ్ నెవర్ హెజిటేట్ టు ఎగ్జామిన్ ఫాక్ట్స్ ఇఫ్ ఎ డెసిషెన్ హాడ్ బీన్ టేకెన్ మాలాఫైడీ ఆర్ ఫర్ కొల్లేటరల్ రీజన్స్, భగవతీ అండ్ హిస్ కొలీగ్స్ డిసైడెడ్ నాట్ టు లుక్ ఎట్ ది ఫాక్ట్స్ ఎట్ ఆల్ ...."

తరువాతి విషయాలూ ఆసక్తిదాయకమైనవే.

సుప్రీంకోర్టులో బయటపడిన ఈ ఉత్తరాలు ఆధారంగా కుమార్, ప్రకాష్‌నారాయణ్ మీద రెండు లక్షలకు పరువునష్టం దావా వేశాడు. దానిమీద ప్రకాష్‌నారాయణ్ ఆ వివాదాన్ని ఢిల్లీ హైకోర్టు కాకుండా వేరే హైకోర్టుకు బదిలీ చేయమని అప్లికేషన్ పెట్టాడు.

ఇంతలో కేంద్రప్రభుత్వం ఇంకొక చర్య తీసుకుంది. ప్రభుత్వం ఆ ఉత్తరాలను బయటపెట్టకూడదని అభ్యంతరం పెట్టినా, సుప్రీంకోర్టు ఆ ఉత్తరాలను బయటపెట్టాలని ఆజ్ఞఇవ్వటం వలనే ఆ ఉత్తరాలు బయటికొచ్చాయనీ — ఆ విధంగా బయటికొచ్చిన పత్రాలను, ఆ వ్యవహారంలో కాకుండా ఇంకో వ్యవహారంలో వాడుకోగూడదనీ, (కుమార్ - ప్రకాష్‌నారాయణ్‌ల వ్యక్తిగతమైన దావా) అలా వాడుకుని కుమార్ కోర్టుధిక్కార నేరం చేశాడనీ సుప్రీంకోర్టు ముందు నేరారోపణ చేసింది.

ఈ రెండూ నేడు సుప్రీంకోర్టు ముందున్నాయి. వీటిలోని తీర్పులుకూడా చారిత్రాత్మకాలు కాక తప్పవు సుమా!

ఇంకో విషయం కూడా ఈ వ్యవహారంలో బయటికొచ్చింది. కుమార్‌మీద ఇంటెలిజన్సు బ్యూరో కూడా నివేదికలు

పంపింది. దానిని కేంద్రన్యాయశాఖామంత్రి, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి పంపాడు కూడా.

ఒక్క సందేహం. ఇంటెలిజన్సుబ్యూరో ఒక్క కుమార్ వ్యవహారంలోనే జోక్యం చేసుకుందా? లేక ప్రతిరాష్ట్రంలోని తాత్కాలిక న్యాయమూర్తులనూ శాశ్వత న్యాయమూర్తులుగా నియమించవలసిన ప్రతి సందర్భంలోనూ జోక్యం చేసుకుందా అన్న విషయం మనకింకా స్పష్టంగా తెలియటం లేదు.

ఇక రెండవ న్యాయమూర్తి వోహ్రా విషయం. సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ వెంకటారామయ్య తీర్పులో ఈ క్రింది విషయాలు ఉదహరించబడ్డాయి. 1981 మే 7 తేదీనాటి "చారిత్రాత్మక" ఉత్తరాన్ని ప్రకాష్‌నారాయణ్ వ్రాసిన తరువాత, నాటి న్యాయశాఖ మంత్రి శివశంకర్ న్యాయశాఖ కార్యదర్శికి ఒక నోట్ పెట్టాడు (19 మేన) అందులో ఆయన స్పష్టంగా ఇలా వ్రాశాడు: "నిన్న సాయంకాలం నేను ఢిల్లీ ప్రధానన్యాయమూర్తితో మాట్లాడాను. నా ఉత్తరానికి త్వరలో సమాధానం కావాలని కోరాను .... ఆయన తప్పకుండా ఒకటి రెండు రోజుల్లో సమాధానం పంపుతానన్నాడు. తాను 'కిస్సాకుర్సీకా కేసు' వ్యవహారాలను చూచేందుకూ, ఇంకా కొంత విచారించేందుకు కొంత సమయం అవసరమన్నాడు ..." ("…. దట్ ది మాటర్ నెసెసర్లీ ఇన్‌వాల్వ్‌డ్ ఎ లిటిల్ టైమ్ యాజ్ హి హాడ్ టు వేడ్ త్రూ ది ప్రొసీడింగ్స్ అఫ్ ది "కిస్సా కుర్సీ కా" కేస్ అండ్ మేక్ ఎ ఫ్యూ ఎంక్వైరీస్.")

"కిస్సా కుర్సీ కా" వ్యవహారం అత్యవసర పరిస్థితి తదనంతరం తీర్పుకొచ్చి, దానిలో సంజయ్‌గాంధీకి శిక్ష పడింది. ఆ శిక్ష విధించింది జస్టిస్ వోహ్రా.

కుమార్ విషయంలో ఆయన నిష్పక్షపాతం మీద అనుమానమొచ్చింది. కాని వోహ్రా విషయంలో ఈయన ఇచ్చిన తీర్పు మీద ప్రకాష్‌నారాయణ్ సొంతంగా విచారణ మొదలు పెట్టాడు. కుమార్ మీద వలె, వోహ్రామీద ఎవ్వరూ సంజయ్‌గాంధీ తరపున ఆరోపణలు చేయలేదు.

వీటన్నిటినీ మించిన ముఖ్యమైన విషయముంది. ఒక సాటి న్యాయమూర్తి తీర్పుమీద ప్రధానన్యాయమూర్తి అయినా సరే, పరామర్శించి, విమర్శించే అధికారముందా? దానిమీద అప్పీలు రూపేణా న్యాయమూర్తుల ముందుకు రావటం, విమర్శించటం వేరు, అలా కాకుండా పరామర్శించి, రిపోర్టు చేసే అధికారముందా అన్నదే ప్రశ్న.

"లేనేలేదు" అన్న విషయం నేటి న్యాయవ్యవస్థతో స్వల్ప పరిచయమున్న ఏ వ్యక్తికైనా తెలిసినదే. ఈ విషయాలను ఇంకా వివరంగా తెలుసుకోవటం మంచిది.

దాదాపుగా ప్రతి తాలూకా కేంద్రాలలోగల జిల్లా మున్సబుల తీర్పుల మీద సివిల్‌వ్యవహారమయితే, అదే తాలూకా కేంద్రంలో గాని లేక జిల్లాకేంద్రంలోగాని గల సబ్‌కోర్టులకు అప్పీళ్ళు పోతాయి. కాని ఒకే మున్సబు తీర్పు మీద సాటి మున్సబు అప్పీళ్ళు వినడు. అలాగే హైకోర్టు స్థాయి దాకా.

అక్కడ ఒక న్యాయమూర్తి తీర్పు మీద ఇద్దరు లేక ముగ్గురు న్యాయమూర్తులతో కూడిన బెంచికి అప్పీలు పోతుంది.

లేకపోతే ప్రధాన న్యాయమూర్తి అయినా, సాటి న్యాయమూర్తుల తీర్పులో జోక్యం చేసుకోగూడదు, విమర్శించగూడదు. ప్రధాన న్యాయమూర్తి ఎన్ని సంవత్సరాల అనుభవం కలిగినా, సాటి న్యాయమూర్తి శాశ్వత న్యాయమూర్తి కాకపోయినా, జిల్లాజడ్జి నుంచి అప్పుడే న్యాయమూర్తి అయి, కొద్దిరోజుల 'వయసు' గల న్యాయ మూర్తి అయినా – సూత్ర మిదే.

కాబట్టే ధర్మాసనంలోని మరొకన్యాయమూర్తి శ్రీ దేశాయ్ తన తీర్పులో ఈ విషయాన్ని గురించి చాలా ఘాటుగా వ్రాశాడు. ఢిల్లీ చీఫ్‌జస్టిస్‌కు ఈ అధికారమెవరిచ్చారో తెలియదనీ, ఆయన సమానులలో ప్రథముడనీ, దానికి కారణం వయస్సులో పెద్దవాడవటం తప్ప ప్రతిభాసంపత్తులు కావనీ, వోహ్రా కూడా ఈ విషయంలో రంగంలోకి దిగినట్లయితే, పరిస్థితి ఇంకా విషమంగా తయారయేదన్నాడు "ది చీఫ్‌జస్టిస్ అఫ్ ఢిల్లీ హైకోర్టు సీమ్స్ టు బి కంప్లీట్లీ అన్‌ఎవేర్ అఫ్ హిస్ డ్యూటీ అండ్ అబ్లిగేషన్ వైల్ రికమెండింగ్ ఆర్ రెఫ్యూజింగ్ టు రికమెండ్ ఎ కొలీగ్ ఫర్ ఎక్స్‌టెన్షన్. హి హోల్డ్స్ నో పొజిషన్ సుపీరియర్ టు ఎ హైకోర్టుజడ్జి. హి ఈజ్ ఓన్లీ ఫస్ట్ యమాంగ్స్‌ట్ ఈక్వల్స్ ఎంజాయింగ్ ది స్టేటస్ నాట్ ఆన్ మెరిట్స్ బట్ ఆన్ యాక్సిడెంట్ అఫ్ సీనియారిటీ. హి ఈజ్ నాట్ సపోజ్‌డ్ టు సిట్ ఇన్ జడ్జిమెంట్ ఓవర్ ది డెసిషన్స్ అఫ్ హిజ్ కొలీగ్స్. వేర్ డజ్ హి గెట్ దిస్ అథారిటీ పాసెస్ కాంప్రెహెన్షన్. మిస్టర్ ఓ. యన్. వోహ్రా టుక్ ఎ డిగ్నిఫైడ్ స్టాండ్ అండ్ డిడ్ నాట్ పార్టిసిపేట్ ఇన్ దిస్ స్క్వాబుల్, అన్‌డిగ్నిఫైడ్ యాజ్ ది హోల్ ఎపిసోడ్ అప్పియర్స్ టు బి హాడ్ హి కం అండ్ పార్టిసిపేటెడ్, మే బీ ది చీఫ్‌జస్టిస్ అఫ్ ఢిల్లీ హైకోర్టు వుడ్ హావ్

ఫౌండ్ హిస్ పొజిషన్ సో అన్‌టెనబుల్ దట్ దేర్ షుడ్ హావ్ ఎమినేటెడ్ ఎస్ట్రాంగ్ సెన్సర్ ఎబౌట్ ది మెథడ్ అండ్ మానర్ ఆఫ్ హిజ్ డీలింగ్ విత్ హిజ్ కొలీగ్స్. దీజ్ మే అప్పియర్ టు బి స్ట్రాంగ్ వర్డ్స్ బట్ దే స్టిల్ ఫెయిల్ టు ఎక్స్‌ప్రెస్ మై ఫీలింగ్స్ యాడెక్వేట్లీ. ఐ సే నోమోర్." (గుర్తింపు నాది). ఆ మాటలు చాలా ఘాటుగా కనపడవచ్చుననీ, కాని నిజానికి ఆ మాటలు తన భావాన్ని పూర్తిగా సూచించటం లేదన్నాడు.

క్లుప్తంగా జస్టిస్‌కుమార్ గాథ ఇది.

◆ ◆

తాజా వార్త.

జస్టిస్ దయాళ్ అలహాబాద్ హైకోర్టులో న్యాయమూర్తిగా 1979 జూలైలో నియమించబడ్డారు, ఇప్పటికి రెండుసార్లు పదవీ కాలాన్ని పొడిగించారు కాని, శాశ్వత న్యాయమూర్తిగా నియమించలేదు.

1983 నూతన సంవత్సర కానుకగా ఆయన రాజీనామా చేశాడు. కారణం, ఆయనకంటె పదవీకాలంలో చిన్నవారైన 13 మంది న్యాయమూర్తులు శాశ్వత న్యాయమూర్తులుగా నియమింపబడ్డారు, ఈయన కాలేదు. దానికి కారణాలు మనకు తెలియవనుకోండి.

◆ ◆

ఒక్క ప్రశ్నతో ఈ వ్యాసాన్ని ముగించవచ్చుననుకుంటాను.

1950 నుంచి 32 సంవత్సరాల రాజ్యాంగ జీవితంలోమనకు అనేక వందలమంది హైకోర్టు న్యాయమూర్తులున్నారు, పదవీ విరమణ చేసిన వారనేకమంది ఇంకా మన అదృష్టవశాత్తు సజీవులుగా ఉన్నారు. కాని వారిలో ఎంతమంది దేశహితకార్యాలలో పాల్గొంటున్నారు.

కనీసం న్యాయవ్యవస్థకు సంబంధించిన విషయాలొచ్చినప్పుడైనా, ఒక వాగ్లా, ఒక తార్కుండే తప్ప ఇంకెవ్వరూ లేరా? ప్రతిరాష్ట్రంలో జరుగుతున్న ఘోరాలను గురించి ఒక్క పదవీ విరమణ చేసిన న్యాయమూర్తి అయినా నోరువిప్పలేదా?

ఇది మనదేశంలోని మేధావి జీవితానికి కొలబద్దా?

దీనిని తలుచుకుంటేనే హృదయం జలదరిస్తుంది సుమా!

***

# భూతాలు

పంటపొలాలకు తలలు దువ్వుతూ
ఆప్యాయంగా వెన్ను నిమురుతూ
పెంచేది గాలి అని
తెలుసా!

ఎదురు మతం గల మహా తరులనే
కాళ్ళతో సహా ఎత్తి నేలపై
విసరనూ గలదని
తెలియదా?

ఎండిన ధారుణి నోళ్ళను తడిపి
ప్రగతి మార్గమున జీవననదిగా
సాగేది నీరు అని
తెలుసా!

ప్రజలకు తనకూ అడ్డం వుంటే
బలిసిన కట్టల కడుపులు పటపట
కూల్చనూ గలదని
తెలియదా?

చీకటి మంచును చీల్చే శక్తిని
దీపాలకు అందించి ఎర్రగా
బ్రతికేది అగ్ని అని
తెలుసా!

జన వీధులలో కుళ్ళు వాసనలు
చల్లే చెత్త చెదారం అంతా
కాల్చనూ గలదని
తెలియదా?

జుగుప్స రేపే పనులు చేసినా
ప్రజలను లాలిస్తూ పోషిస్తూ
నవ్వేది భూమి అని
తెలుసా !

కడుపు మండితే భూకంపంగా
ఒళ్ళు నోరుగా మార్చి సర్వమూ
మ్రింగనూ గలదని
తెలియదా ?

బంగారంలా పండు ఎండలను
ప్రపంచమంతా పబ్లిగ్గానే
పంచేది నింగి అని
తెలుసా !

పరాన్న జీవుల మురికి కాల్వలను
కాలరాయగా మంటల ఎండలు
విసరనూ గలదని
తెలియదా ?

మంచివాడినని సాధుజీవినని
నీ అంతస్తులు పెంచే వాణ్ణని
నా గురించి నీకు తెలుసా !
పంచభూతముల పరాక్రమం నా
మంచికి తోడై చెడును కూల్చునని
నాగురించి నీకు తెలియదా ?

# రేపు చూపు

నల్లని దుప్పటి పరిచి
చుక్కల మల్లెపూలు చల్లి
మేఘాల దిండ్లు వేసిన
శోభనపు గదిలా
వాడికి అనిపించి ది రాత్రి

మట్టికుండలో అడుగున మిగిలిన
తెల్లని మెతుకుల కోసం
మబ్బుల కుక్కలు తారట్లాడే
కూలిపోతున్న గుడిసెలా
నీకు కనిపిస్తోంది రాత్రి

నల్లని స్థూలకాయంమీద
బాణాలు గాయాలు చేస్తుంటే
చేతులడ్డంపెట్టుకుంటున్న
నెత్తురు కక్కి చచ్చే నిశాచరుడిలా
నాకు దర్శనమిస్తుంది రాత్రి.

శ్రీ రావి రంగారావు



డాక్టర్ బి. ఆర్. కె. రావు

# కొందరు ఆర్థిక వేత్తలు వారి ఆలోచనలు

## థామస్ కూపర్

థామస్ కూపర్ 1759లో ఇంగ్లండులో జన్మించాడు. అక్స్‌ఫర్డ్‌లో న్యాయశాస్త్రం అభ్యసించాడు. ప్రీస్ట్లీతో స్నేహం ఏర్పడిన తరువాత వైద్య, రసాయనిక శాస్త్రాలు అభ్యసించాడు. తన 36వ ఏట వయస్సులో 1795లో అమెరికా వెళ్ళి వర్తమాన సమస్యల చర్చల్లో తీవ్రంగా పాల్గొన్నాడు. వైద్యంలో యం. డి. డిగ్రీ పొందాడు. బానిస వ్యాపారంమీద, ఇతర విషయాలమీద విరివిగా వ్యాసాలు వ్రాసాడు. అలజడి చేయడంలో ప్రముఖుడుగా ఉండి అనేకసార్లు చట్టధిక్కారణ చేసాడు. ప్రెసిడెంటు జాన్ అడమ్స్‌ను, వారి పరిపాలనను తీవ్రంగా విమర్శించి ఆరు నెలలు జైలుశిక్ష, జరిమానా విధించబడ్డాడు. జైలునుండి విడుదల అయిన తర్వాత లాండ్ కమిషనర్‌గాను, కామన్ ప్లేస్ కోర్టు జడ్జిగాను నియుక్తుడయ్యాడు. అయితే త్వరలోనే దోషారోపణ చేయబడటంవల్ల ఉద్యోగం నుండి తొలగించబడ్డాడు. తరువాత ఫిలడల్ఫియాలో కాలం గడుపుతూ బాల్యదశలో ఉన్న పరిశ్రమలకు, రక్షణ పరిశ్రమలకు, ఆర్థిక రక్షణ కల్పించడానికి టారిఫ్ పన్నులు వెయ్యాలని వాదించాడు. కూపర్ 1839లో మరణించాడు.

తరువాత డికిన్‌సన్ కాలేజిలో రసాయనిక శాస్త్రంలో ప్రొఫెసర్‌గాచేరి, తదుపరి పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో కెమిస్ట్రీ ప్రొఫెసర్‌గా చేరాడు. 1817లో రసాయనిక శాస్త్రాన్ని, న్యాయశాస్త్రాన్ని బోధించడానికి వర్జీనియా విశ్వవిద్యాలయం వెళ్లాడు. మూడు సంవత్సరాల తర్వాత న్యాయశాస్త్ర ఉపాధ్యాయ పదవిని వదులుకునేటట్లు చేయబడ్డాడు. 1821లో సౌత్‌కెరోలినా కాలేజి అధ్యక్షుడయ్యాడు. అక్కడే పొలిటికల్ ఎకానమి టీచర్‌గా కూడా పనిచేసాడు. 1834లో మరల బలవంతం చేయగా ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చింది. సౌత్‌కెరోలినాలో స్వేచ్ఛా వ్యాపారం కావాలని, రాష్ట్రానికి సార్వభౌమత్వం కావాలని గట్టిగా వాదించాడు. ఇంగ్లండులో బానిస విధానాన్ని తీవ్రంగా విమర్శించాడు. సౌత్ కెరోలినాలో మాత్రం బానిస విధానాని కనుకూలమైన తత్వాన్ని ఏర్పరచటానికి, బలపర్చడానికి తోడ్పడ్డాడు. ఒకప్పుడు అమెరికాకు రాజ్యాంగబద్ధమైన ప్రజాస్వామ్యం కావాలని వాదించాడు. తరువాత ఆ వాదాన్ని విమర్శించి, అమెరికా స్వాతంత్ర్యాన్నికోరే తత్వాన్ని విమర్శించాడు. మొదట్లో అమెరికా బ్యాంకును విమర్శించి తరువాత దాన్ని బలపర్చాడు. తన అనుబంధాన్ని మార్చడంలో అసమానమైన శక్తిని చూపాడు. అందువల్ల సౌత్‌కెరోలినా కాలేజి అధ్యక్షుడుగా ఉండగా వ్రాసిన లెక్చర్స్ ఆన్ ది ఎలిమెంట్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమిని (1826) ఎవరూ నమ్మలేదు.

శిక్షణరీత్యాగాని, వృత్తిరీత్యాగాని కూపర్ ఆర్థిక శాస్త్రవేత్త కాదు. కాని తన తెలివితేటల్ని, తన వ్యాపారానుభవాలనుకు జోడించి ఆ కలయికకు అర్థశాస్త్ర సాహిత్యంతో తనకున్న ఒక మాదిరి పరిచయాన్ని కలిపి ఆర్థిక విషయాలమీద సాధారణ సూత్రాలను చెప్పాడు. తన ఎదుటనున్న ఆలోచనల్నిచూచి ఒక విషయానికి అనుకూలంగాగాని, వ్యతిరేకంగాగాని, చెప్పేవాడు. రికార్డో భాటక సిద్ధాంతము అతి భౌతికము అని ఎంచినా ఆయన అనుచరుడుగా ఉండాలని ఉబలాటపడేవాడు. రికార్డో సిద్ధాంతాలు బహుజనామోదం పొందడంచూసి రికార్డో వాదనలకు అనుకూలంగా ఉండదలచాడు. ఆర్థిక రక్షను, రక్షణ టారిఫ్‌లు కావాలనే వారిని తీవ్రమైనమాటల్తో విమర్శించాడు. టారిఫ్‌వద్దని దక్షిణాదివారు చెప్పడంలో తానూ అలాగే మాట్లాడేవాడు. అందువల్ల జాన్ సి. కాల్‌హౌన్ ప్రవేశపెట్టిన (1832) టారిఫ్ చర్యలు ఉపసంహరించుకోబడినవి.

కూపర్ కేవలం అనువర్తిత ఆర్థిక విషయాలమీద మాట్లాడాడు. అందులో సిద్ధాంతాలు లేవనీ చెప్పవచ్చు. స్వేచ్ఛా ఆర్థిక విధానాన్ని బలపర్చడంవల్ల అప్పటికి తనకు మంచిదనుకుని తీలా చేసాడు. నిస్సంకోచంగా మాట్లాడటం మంచిదేకాని ఆయన అభిప్రాయాలకు గుర్తింపు రాలేదు. ప్రాథమిక విద్య మినహా మరే

విద్య కూడ అందరికి లభ్యం కారాదన్నాడు. అయితే కాలేజీలను ప్రభుత్వం పోషించాలన్నాడు. ఉన్నత విద్యను గరపే పాఠశాలలు దేశానికి లాభదాయకమన్నాడు. సౌత్ కెరోలినాలో అర్థశాస్త్రానికి ఆదరణ సంపాదించాడు. అంతేగాక సౌత్ కెరోలినాకాలేజీలో అర్థ శాస్త్ర విభాగాన్ని ప్రారంభించాడు. అప్పటికది అమెరికాలో రెండవ అర్థశాస్త్ర శాఖ.

ఏమైనా అర్థశాస్త్రంలో ఇతని జ్ఞానం తక్కువేనని చెప్పాలి. పైగా అవకాశవాదిగా కన్పిస్తున్నాడు. ఆర్థిక విషయ జ్ఞాన సముపార్జన కిటువంటి వారి మీద ఆధారపడటం ప్రమాదకరం. అయితే ఆరోజుల్లో ఆర్థిక విషయాలపై ఆలోచించిన ఇతన్ని గౌరవించక తప్పదు. కడుపు కాలేవాడు, అన్నం అరగనంతవరకు తినేవాడు ఆర్థిక విషయాలను గురించి మాట్లాడవచ్చు. అదంతా అర్థ శాస్త్రం క్రిందికి రాదు. తమ స్వీయసమస్యలను బహిర్గతం చేసు కోవడంకావచ్చు. ఇందులో తప్పులేదు కాని, వారుకూడా ఆర్థికశాస్త్ర వేత్త, చెబితేలని మాత్రం హాస్యాస్పదమౌతుంది. పట్టుడు వాక్యా లతో వీధిలో ఆర్థిక విషయాలను మాట్లాడే వారు దేశం ఆర్థిక సమస్యలను పరిష్కరించవలసివస్తే బ్రతికున్న వాళ్ళేగాక, చచ్చిన వాళ్ళు కూడా అడుక్కుని తినవలసిందే. శాస్త్రీయంగా సిద్ధాంతాన్ని, సూత్రాన్ని ఏర్పర్చందే శాస్త్ర నిర్మాణం జరగదు. అర్థశాస్త్రంలో శిక్షణ, అధ్యయనము, అభ్యాసము, ఆ సూత్రాలను అనువర్తింప జేసి చూడాలనే దీక్ష, ఆచరణ, ఫలితాల నిర్ణయము, అవసరమైన మార్పులు, చేర్పులు చేయడము, వీటి వెనుక ఒక మహోదాత్తమైన ఆర్థిక సంక్షేమ తత్వము ఉండటము అవసరము. యాజమాన్య, నిర్మాణ చాతుర్యా జ్ఞానము, యోజనా రచనా చాకచక్యము, విశ్లే షణాశక్తి మొదలైన అనేక సులక్షణాలు గలవాడే నిజమైన ఆర్థిక శాస్త్రవేత్త కాగలడు.

## యస్. ఎన్. పాటిన్

పాటిన్ 1852లో జన్మించాడు. హాలే విశ్వవిద్యాలయం నుండి తన 26వ సంవత్సరం వయస్సులో డాక్టరేట్ డిగ్రీ పొందాడు. 1889లో పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా నియుక్తుడయ్యాడు. 1885లో ది ప్రెమిసిస్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి అనే మంచి గ్రంథాన్ని వెలువరించాడు. ఆ గ్రంథంలో స్వేచ్ఛా ఆర్థిక విధానాన్ని, స్వేచ్ఛా వ్యాపారాన్ని నిశితంగా విమర్శిస్తూ, ప్రణాళికా రచనను అసలు జరపడాన్ని, వ్యవసాయం బహుముఖంగా విస్తృతి చెందడాన్ని గట్టిగా బల పర్చాడు. పాటిన్ 1922లో మరణించాడు.

ఇంగ్లండు ఆర్థికాభివృద్ధిలో 'యుక్త వయస్సు' దశకు వచ్చిన పిదప స్వేచ్ఛా ఆర్థిక విధానాన్ని, స్వేచ్ఛా వ్యాపారాన్ని బలపర్చింది. అందువల్ల అభివృద్ధి చెందని (పాటిన్ కాలానికి) అమెరికాకు, ఇతరదేశాలకు ఈ స్వేచ్ఛా ఆర్థిక విధాన సిద్ధాంతాలు అనువర్తించవు.

ఆర్థిక సూత్రాలను మానవుడు తయారు చేసాడు. వాటిని అవసరమైనమేరకు మార్చి మాత్రమే స్థానిక పరిస్థితులకు అను వర్తింప చేయవలసి ఉంటుంది. పాటిన్ పెట్టుబడిదారీ వ్యవస్థను వ్యతిరేకించలేదుగాని, ధనికులమీద ఎక్కువ పన్నుల భారాన్ని మోపడంద్వారా - సమానత్వాన్ని ఏర్పర్చాలని, బీద ప్రజల జీవన ప్రమాణాలను పెంచాలని వ్రాసాడు. తన "ది థీరీ ఆఫ్ ప్రోస్పెరిటీ" అనే రచనలో ఆర్థిక సమస్యలపై తాను చేసిన విశ్లేషణకు నైతికశాస్త్రబద్ధమైన సూత్రాలను ఆధారం చేసుకున్నాడు.

ఆర్థిక దోపిడి, మిగులు విలువల విషయంలో పాటిన్ అభిప్రాయాలు దాదాపు మార్క్స్ అభిప్రాయాలవలె ఉన్నవి. సంఘం చేతుల్లో ఉన్న మిగులు విలువను, పన్నుల విధింపుద్వారా ప్రభుత్వం తీసుకుని, ఆధునిక పారిశ్రామికీకరణ వల్ల కల్గే బాధల నుండి అమెరికన్లకు విముక్తి కల్గించడానికి ఉపయోగించాలి. ప్రజ లందరికి కలసి ఉదరపోషణకు కావలసిన మొత్తం కంటె, సగటున, ఆర్థిక ఉద్యమదారులకు ఎక్కువ ముట్టరాదు. దీనిపైన మిగిలేవిలువ సామాజిక మిగులు అనగా సంఘం చేతుల్లో ఉన్న మిగులు అవు తుంది. ఈ మిగులును ప్రభుత్వం తీసుకుని ఆధునిక పారిశ్రామికీ కరణవల్ల కల్గేబాధలను తొలగించడానికి, ప్రజలు పనిచేసే పరిస్థితు లను, వారి జీవన ప్రమాణాలను మెరుగు పర్చడానికి, శ్రామికులకు మంచి వసతులు అందించడానికి ఖర్చు చెయ్యాలి. నిరుద్యోగులకు, స్త్రీలకు మేలుకలుగ చెయ్యాలని గట్టి అభిప్రాయం పెట్టుకున్నాడు. మగవారికున్న ద్రవ్యస్తోమతను ఆడవారికి కూడా కల్గించడం ప్రభుత్వ విధి. అలాచేయని ప్రభుత్వం పురోగామికం కాదు. ఎంతో దయ గలవాడైనా, పాటిన్ క్రిమినల్ నేరస్థుల ఎడ దయ చూపలేదు. ఆర్థిక శాస్త్రవేత్తగాకంటె సంఘ సంస్కర్తగా మంచి పేరు పొందాడు. ఇతర సాంఘిక శాస్త్రాల నుండి భావనలను తీసుకుని అర్థశాస్త్రంలో ఉపయోగించాడు.

# రిచర్డ్ టి ఎలీ

రిచర్డ్ టి ఎలీ 1854లో జన్మించాడు. కొంతకాలం కొలంబియా విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం సాగించాడు. అటుపిమ్మట జర్మనీవెళ్ళి కాంట్, హెగెలీల తత్వశాస్త్రాలను అధ్యయనం చేశాడు. 1881లో జాన్ హాప్‌కిన్స్ విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయుడుగా చేరాడు. 1882లో విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయంలో ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా పదవి స్వీకరించాడు. ఆ పదవితోపాటు డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్, పొలిటికల్ సైన్స్ అండ్ హిస్టరీ పదవీ బాధ్యతలను కూడా స్వీకరించాడు. అర్థశాస్త్రంలో పాండిత్యంగల అనేక వ్యాసాలు వ్రాసాడు. ఆయన ముఖ్యగ్రంథాలు : (1) ఇంట్రొడక్షన్ టు పొలిటికల్ ఎకానమి (1889) (2) ఔట్‌లైన్స్ ఆఫ్ ఎకనామిక్స్ (1893). ప్రొఫెసర్ ఎలీ 1943లో మరణించాడు.

ఎలీ పాత చారిత్రిక ఆర్థిక పీఠం అభిప్రాయాలను అనుసరించాడు. తన రచనలో సాంఘిక సంస్థలకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాడు. క్రైస్తవుల చర్చి సాంఘిక సంస్కరణల నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించాలన్నాడు. బీదలైన శ్రామికుల ఎడ దయ చూపాడు. శ్రామికులు తమ ఆర్థిక సంక్షేమం కొరకు నియోగదార్ల సహకార సంఘాలను ఏర్పరుచు కోవాలన్నాడు. శ్రామికుల న్యాయసమ్మతమైన హక్కుల్ని గుర్తించడం ద్వారా వర్గ సఘర్షణ రాకుండా చేయాలన్నాడు. ఇతడు వ్రాసిన 'ఔట్‌లైన్స్ ఆఫ్ ఎకనామిక్స్' అనే గ్రంథం అమెరికన్ కళాశాలల్లోను విశ్వవిద్యాలయాల్లోను విస్తారంగా ఉపయోగించ బడ్డది. రికార్డో భాటక సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ, దాన్ని తనశక్తికొలది బలపర్చాడు. జాన్‌స్టువర్ట్ మిల్ పంపిణీ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ అతన్ని గొప్పగా ప్రశంసించాడు. సాధారణ ఆర్థిక ప్రవృత్తుల్ని వివరించే సూత్రాలు సహజ సూత్రాలని చెప్పాడు. మామూలు విలువ ఉపాంత ఉపయోగితకు, ఉత్పాదన ఖర్చులకు సంబంధం కల్పించే దీర్ఘకాలీన సాధనమని చెప్పాడు. భూమికి సంబంధించిన ఆర్థిక విషయాల్లో చాలా శ్రద్ధ కనపర్చాడు. భూమిని అభివృద్ధి చేయడానికి, అడవుల పెంపకానికి మొక్కలు నాటడానికి పనిచేసే శాంతికాలపు పారిశ్రామిక సైన్యము వ్యాపార మాంద్యం వల్ల వచ్చే బాధలను తొలగించగలదన్నాడు. 1930-40 కాల వ్యవధిలో వచ్చిన మాంద్యాలలో అతని సలహాను అమెరికా ప్రభుత్వం అనుసరించింది. ఎలీ సోషలిస్టు కాదు; పెట్టుబడిదారీ విధానాన్ని బలపర్చనూలేదు. సోషలిజానికి, పెట్టుబడిదారీ విధానానికి మధ్యనున్న గీతమీద నిలబడ్డట్లు కన్పిస్తున్నాడు.

# యుఫ్. ఏ. పెట్టర్

ఫ్రాంక్ ఎ పెట్టర్ 1863లో జన్మించాడు. అర్థశాస్త్రంలో మొదట భాగం ఇండియానా విశ్వవిద్యాలయంలో అభ్యసించాడు. అత్యున్నత విద్యను సోర్‌బోన్నె, హాల్లె విశ్వవిద్యాలయాల్లో సముపార్జించాడు. ట్రస్టులు, గుత్తాధిపత్యానికి సంబంధించిన సమస్యల్లో మౌలిక ఆలోచనను సమకూర్చాడు. సిద్ధాంత కర్తగా గుర్తించ బడకపోయినా, ఆ రోజుల్లో గణనలో ఉన్న సుఖవాదం మీద ఇతడు చేసిన విమర్శకు మంచి గుర్తింపు లభించింది. పెట్టర్ 1949లో మరణించాడు.

1904లో పెట్టర్ వ్రాసిన "ది ప్రిన్సిపుల్స్ ఆఫ్ ఎకనామిక్స్ విత్ అప్లికేషన్ టు ప్రాక్టికల్ ప్రోబ్లమ్స్" అనే గ్రంథంలో తన అభిప్రాయాలను వ్యక్తీకరించాడు. 1915లో ఈ గ్రంథం రెండవ ముద్రణ వెలువడింది. ఈ గ్రంథంలో సుఖవాదం చెప్పే సుఖము-బాధ మనస్తత్వానికి చోటు లేకుండా చేసి. ఆ స్థానంలో సహజాత ఎంపిక మీద ఆధారపడే నూతనసిద్ధాంతాన్నిఏర్పర్చాడు. ఉపయోగిత, ఉపాంత ఉపయోగితా భావనలను వదిలివేశాడు. అయితే ఈ నూతన భావనను ఆధారం చేసుకుని అర్థశాస్త్రాన్ని తిరగ వ్రాయలేదు. కేవలం విలువ సిద్ధాంతాన్ని తిరిగి వ్రాయడంలో మాత్రమే ఈ నూతన భావనను ఉపయోగించాడు. జీవితం తుదిభాగంలో గుత్తాధిపత్యం నిర్వహించే సంస్థల సమస్యల్ని అధ్యయనంచేసి, 1931లో "ది మాస్క్వెరేడ్ ఆఫ్ మొనాపలీ" అనే మంచి గ్రంథాన్ని వెలువరించాడు. వినియోగదారు భవిష్యత్ వినియోగాని కంటె వర్తమాన వినియోగానికి ఎక్కువ విలువనిస్తాడు. ఈ తేడా కాలపు విలువ అనబడుతుంది. దీనివల్లనే భాటకము, వడ్డీ ఏర్పడుతున్నవి. బొహమ్‌బవార్క్ చెప్పిన చుట్టు తిరుగుడు ఉత్పత్తి సంగతం కాదు. వస్తూత్పత్తి ప్రక్రియలో జరిగిన మూల ధనీకరణకు వడ్డీరేటు ప్రతిబింబము. అనశ్వర వస్తువుల్ని మూలధనంగా మార్చడంవల్ల వాటి భవిష్యత్ ఉపయోగిత తగ్గుతోంది. ఈ తగ్గుదల వాస్తవ వడ్డీరేటుకు తోవతీస్తోంది. వడ్డీరేటు ఈ తరుగుదలను నిర్ధారించదు. ఒక కాలవ్యవధిలో అసంఖ్యాకంగా జరిగే వస్తువుల ఎంపికలు, భవిష్యత్ ఆదాయాలతో ముడిపడిన అనశ్వర వస్తువుల ధరలకు, అవి మార్కెట్‌లోని వడ్డీరేటుకు తోవతీస్తాయి. అయితే ఆస్తుల ఉత్పాదకతకూడా వడ్డీరేటు నిర్ణయంలో భాగస్వామిగా ఉంటుంది. ఒక ఆస్తి ఉపయోగిత, భౌతిక, ద్రవ్య రూపాలలో ఎక్కువ ఆదాయాన్నిస్తే వర్తమాన, భవిష్యత్. కాలాల మధ్య జరిగే ఎంపికలనిది ప్రభావితం చేస్తుంది. ఈ మార్పు వడ్డీరేటును ప్రభావితం చేస్తుంది.

# ఫ్రాన్సిస్ వేలాండ్

ఫ్రాన్సిస్ వేలాండ్ 1796లో జన్మించి 1865లో మరణించాడు. అతను 1837లో వ్రాసిన ఎలిమెంట్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి 1867కు ముందు ఇతర అమెరికన్లు వ్రాసిన అర్థిక శాస్త్ర గ్రంథాలన్నింటికంటె మిన్న అని, చాలా సంతులనాత్మకంగా ఉన్నదని చెప్పబడింది. అతను ప్రధానంగా అర్థిక శాస్త్రవేత్తకాదని కూడా అన్నారు. అయితే తత్వవేత్తగాను, దైవశాస్త్రవేత్తగాను పేరు పొందాడు. 1827 నుండి 1855 వరకు బ్రౌన్ విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడుగా పనిచేసాడు.

సంపదకు సంబంధించి శాస్త్రము రాజకీయ అర్థ శాస్త్రమని వేలాండ్ నిర్వచించాడు. భగవంతుడేర్పరచిన సూత్రాలను క్రమబద్ధంగా అమర్చడము శాస్త్రము. అర్థిక శాస్త్ర సిద్ధాంతము, దానిలో చెప్పబడిన సాధారణ సూత్రాలు నన్నాకర్షించినవి. అందువల్ల అర్థం చేసుకోదలచిన వారందరికి అర్థమయ్యే రీతిలో అర్థశాస్త్ర గ్రంథం వ్రాయడం నా ఆశయం. అందువల్ల ఏర్చికూర్చిన విషయాలతో అర్థశాస్త్రం మీద గ్రంథం వ్రాసాడు. స్మిత్, మాక్‌కులక్, కేరే, రికార్డోలనుండి ఎన్నికచేసి విషయాలు తీసుకున్నాడు. వీటికి కొన్ని ప్రత్యేక అమెరికన్ భావాలను కలిపాడు. ధర నిర్ధారణలో సప్లయి సూత్రాన్ని, డిమాండ్ సూత్రాన్ని చెప్పాడు. కాని ఈ విషయంలో ఉత్పత్తి ఖర్చుల సిద్ధాంతము అతని మనస్సులో మెదులుతోంది. భూమి మూలధనము. భాటకము వడ్డీ వంటిది. భాటకము ధరను నిర్ణయిస్తుంది. ఋణంతీసుకుంటే వడ్డీ చెల్లించాలి. వడ్డీ విషయంలో ప్రత్యేక చట్టాలు అవసరం లేదు. అది హెచ్చినపుడు మూలధనం యొక్క సప్లయి డిమాండులు దాన్ని తగ్గించడానికి ప్రయత్నిస్తాయి. మాల్థస్ చెప్పిన విషయాలు నిజమౌతాయనే భయ మతనికిలేదు. అహార ఉత్పత్తి జనాభాను మించి ఉండటమే ఇందుకు కారణము. సప్లయి డిమాండ్‌లు వేతన రేటును ఒక నిర్ణీత కాలవ్యవధిలో ఒకటిగా ఉండేటట్లు చేస్తాయి. జనాభా వేతనస్థాయి స్వయంగా క్రమబద్ధం చేసుకుంటాయి. అయితే ఈ రెండూ కూడా వేతన చెల్లింపుకు ఉపయోగించే వేతన నిధిమీద అధారపడతాయి. ఇతని వేతన సూత్రము ఉత్పాదకతా సిద్ధాంతాని కంటె వేతన నిధి సిద్ధాంతానికి దగ్గరగా ఉన్నది.

సారవత్వము, సైట్ కారకాలుగాగల ఉత్పాదకతా సిద్ధాంతాన్ని, భాటకాన్ని వివరించడానికి చెప్పాడు. వ్యవసాయ భూముల భాటకము వ్యవసాయ సారవత్వాన్ని బట్టి లభ్యమౌతుంది. భాటకము ధరను నిర్ణయిస్తుంది. ఉపాంత భూమిమీద చేసే ఖర్చు భాటకం చెల్లింపువల్ల చేయబడుతుంది. ఈఖర్చు వ్యవసాయోత్పత్తి ధరను నిర్ణయించదు.

అమెరికా సంయుక్త రాష్ట్రాల బ్యాంకు నితడు బలపర్చాడు. పేదలకు పనిలేనపుడు సహాయం చెయ్యాలనే చట్టాలను ఇతడు వ్యతిరేకించాడు. షేరుధనం, వస్తువుల వ్యాపారంలో చట్టా వ్యాపారాన్నితడు వ్యతిరేకించాడు. అమెరికా దక్షిణరాష్ట్రాల్లో బానిసవిధానం కొనసాగడాని కితడు అభ్యంతరంచెప్పలేదు. అయితే బానిస విధానాన్ని విస్తృత పర్చదలచిన కాన్సాస్-నెబ్రాస్కా-బిల్లు (1854) నితడు వ్యతిరేకించాడు. అందువల్ల అమెరికా దక్షిణ రాష్ట్రాల్లోని విద్యాలయాల్లో ఇతని ఎలిమెంట్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి అనే గ్రంథాన్ని పాఠ్య గ్రంథంగా ఉంచలేదు.

ఈ పుస్తకం బహుజనాంగీకారాన్ని పొందింది. ఇందులో ఉన్నతమైన నైతికదృష్టి కన్పిస్తున్నది. వివరణ సరళంగాఉండటం వల్ల అర్థశాస్త్రాభ్యాసానికి పూనుకున్నవారికి బాగా ఉపయోగించింది. చాలా విషయాలిందులో చెప్పబడినవి. అర్థిక స్వాతంత్ర్య తత్వాన్ని ప్రబోధించింది. టారిఫ్ పన్నుల విషయంలో స్వేచ్ఛా వ్యాపారాన్ని కోరింది. చాలా ఉదార దృష్టి గలదైనా బ్రిటిషు సాంప్రదాయ అర్థశాస్త్రం తీరులో నడిచింది. జపాన్‌లో వ్రాసిన మొదటి అర్థశాస్త్ర గ్రంథానికిది ప్రాతిపదికగా ఉపయోగించబడింది.

# లూయిస్ - షుల్ట్స్

అర్థశాస్త్రాన్ని అభివృద్ధి పర్చినందుకు, 1979లో ప్రొఫెసర్ సర్ అర్థర్ లూయిస్‌కు, ప్రొఫెసర్ థియొడోర్ షుల్ట్స్‌కు నోబుల్ బహుమతులు ప్రదానం చేయబడినవి.

అర్థర్ లూయిస్ అమెరికాలో ప్రిన్స్‌టన్ యూనివర్సిటీలో అర్థిక శాస్త్రాచార్యుడుగా పనిచేసారు. అనేక బ్రిటిష్, అమెరికన్ యూనివర్సిటీలలో, అంతర్జాతీయ సంస్థల్లోను కూడా అయన పని చేసారు. ఆ సంస్థల్లో గడించిన అనుభవం అతని రచనల్లో కన్పిస్తుంది. (1) ది ప్రిన్సిపుల్స్ అఫ్ ఎకనామిక్ ప్లానింగ్ (2) థీరీ అఫ్ ఎకనామిక్ గ్రోత్ (3) ఎకనామిక్ డెవలప్‌మెంట్ విత్ అన్‌లిమిటెడ్ సప్లయ్ అఫ్ లేబర్ (4) సమ్ యాస్పెక్ట్స్ అఫ్ ఎకనామిక్ డెవలప్‌మెంట్ (5) ది ఎవాల్యుయేషన్ అఫ్ ఇంటర్నేషనల్ ఎకనామిక్ అర్డర్ (6) ఇండస్ట్రియలైజేషన్ అండ్ ది గోల్డ్‌కోస్ట్ (7) ది ఇండస్ట్రియలైజేషన్ అఫ్ ది బ్రిటిష్ వెస్ట్‌కోస్ట్ (8) డెవలపింగ్ కలోనియల్ అగ్రికల్చర్ (9) ఇష్యూస్ ఇన్ లాండ్ డెవలప్‌మెంట్ పోలసీ (10) ప్లానింగ్ ఇన్ బేక్‌వర్డ్ ఏరియాస్ మొదలైనవి లూయిస్ చేసిన గొప్ప రచనల్లో కొన్ని అని చెప్పవచ్చు.

అమెరికాలోని గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తల్లో షుల్ట్స్ ఒకరు. ప్రస్తుతం చికాగో విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు. మూలధన భావనకు ప్రాముఖ్యతలోకి తెచ్చిన గొప్ప ఆలోచకుడు. కాగా లూయిస్ అభివృద్ధి ప్రణాళికా రచనను అమలు చేయడంపై గొప్పగా వ్రాసారు. వీరిద్దరూ కూడా వర్ధమాన దేశాల ఆర్థిక సమస్యల మీద, ముఖ్యంగా వాటి వ్యవసాయాభివృద్ధి మీద బహుళంగా రచించారు.

## లూయిస్ ఆలోచన

"అదనపు శ్రామిక సంఖ్య" మీద లూయిస్ రచనలు ముఖ్యమైనవి. అభివృద్ధి ప్రణాళికా రచన మీద వ్రాసిన వారికి లూయిస్ రచనలు నూతన మార్గాన్ని చూపించినవి. వ్యవసాయ రంగంలో ప్రచ్ఛన్న నిరుద్యోగిత ఉన్నట్లు లూయిస్ చెప్పారు. వ్యవసాయ రంగంనుండి వాస్తవిక(వస్తు) వేతనం ధారావాహికంగా అందకంపల్ల శ్రామికుల సప్లయి ఆ రంగంలో నిలకడగా అందుతోంది. సంపూర్ణ మార్కెట్ ఉన్నదని ఆయన విశ్వసించడు. అలాగే సమర్థవంతంగా శ్రామికులను కేటాయించడం జరుగుతుందని అంగీకరించడు. వ్యవసాయ రంగంలో ఎగుడు దిగుడులు లేనపుడు, అభివృద్ధి ప్రక్రియకు కీలకమైన స్థిరపారమ్యమైన పారిశ్రామికాభివృద్ధి రావడానికి వీలున్నది.

లూయిస్ ఆర్థిక నమూనాలో (1) జీవనాధారము (2) పెట్టుబడి అనేవి రెండు రంగాలు. మూలధన, సహజ వనరులతో పోల్చినపుడు శ్రామికులు చాలా హెచ్చుగా ఉన్నందువల్ల జీవనాధార రంగంలో ప్రచ్ఛన్న నిరుద్యోగితా బాధ ఉన్నది. కాని గనులు, విద్యుచ్ఛక్తి ఉత్పాదన, వాణిజ్యపు తోటలు మొదలైన వాటిలో మూలధన సాంద్రత హెచ్చుగా ఉన్నప్పటికి బాగానే బ్రతుకుతున్నవి. మూలధనము, కొత్త అభిప్రాయాలు ఆర్థిక వ్యవస్థ అంతటా పలచగా పరచబడలేదు. కొద్ది కేంద్రాల్లో అవి కేంద్రీకృతమై ఉన్నవి. జీవనాధార రంగము, పెట్టుబడి రంగం మీద హెచ్చుగా ఆధారపడి ఉన్నది. ఇతర చోట్ల శ్రామికుడు సంపాదించగల్గిన వేతనాన్ని బట్టి పెట్టుబడి రంగంలో వేతనం నిర్ణయించబడుతోంది. ఈ విధంగా ఉత్పత్తి ప్రక్రియ సాగుతూ ఉన్నది. వచ్చిన లాభము తిరిగి పెట్టుబడి చేయబడుతోంది. వస్తువులకున్న డిమాండ్ కనుసారంగా "స్వేచ్ఛా ఆర్థిక విస్తృతి" జరుగుతోంది. డిమాండ్, ధర, లాభాలు వేగంగా లభ్యమౌతున్న ఫలితంగా ఆర్థిక వృద్ధి ప్రక్రియ సాగుతుంది.

దీర్ఘకాలీన వ్యవధిలో ఈ ప్రక్రియ అంతమౌతుంది. జీవనోపాధి రంగంనుండి వచ్చే శ్రామిక సప్లయి ప్రవాహం అగిపోతుంది. ఈ రెండు రంగాల్లోని ఉపాంతోత్పత్తుల మధ్య ఉన్న అంతరం అంతరిస్తుంది. తత్ఫలితంగా "పారిశ్రామిక విస్తృతి", "మూలధనఏర్పాటు" పెరుగుదల జరుగుతుంది. ఈ ప్రక్రియ హీన వేతరేటు, ప్రచ్ఛన్న నిరుద్యోగి సమస్యలు మొదలైన వాటిని తొలగించడంవల్ల జీవనోపాధి రంగానికి మేలు కల్గుతుంది. కావలసిన రీతిలో అంగబలాన్ని నియుక్తి చేసుకోవడానికివీలుకల్గి ఆర్థిక రంగమంతటికి వృద్ధి లభ్యమౌతుంది అని లూయిస్ చెప్పారు.

## షుల్ట్స్ ఆలోచన

జీవనోపాధికి అనగా వ్యవసాయానికి సంబంధించిన ఆర్థిక విషయాలను ప్రొఫెసర్ షుల్ట్స్ అభివృద్ధి పర్చారు. 1. ట్రాన్స్‌ఫారమింగ్ ట్రెడిషనల్ అగ్రికల్చర్ 2. ఎకనామిక్ గ్రోత్ అండ్ అగ్రికల్చర్ 3. ఎకనామిక్ ఆర్గనైజేషన్ ఆఫ్ అగ్రికల్చర్ అనేవి వ్యవసాయార్థిక శాస్త్రంపై షుల్ట్స్ వ్రాసిన ప్రముఖ గ్రంథాలు. "ఫుడ్ ఫర్ ది వరల్డ్" అనే గ్రంథానికి కీతడు సంపాదకుడు. "ది స్టేట్ ఆఫ్ ది సోషల్ సర్వీసెస్" అనే యల్. డి. వైట్ ఎడిట్ చేసిన గ్రంథంలో షుల్ట్స్ వ్రాసిన ప్రముఖ వ్యాసం "ది రోల్ ఆఫ్ గవర్నమెంట్ ఇన్ ప్రమోటింగ్ ఎకనామిక్ గ్రోత్" ప్రచురించబడింది. సమాజంలో విద్యకున్న ప్రముఖ పాత్రను విశదీకరించడంలో షుల్ట్స్ నిపుణుడుగా భావించబడుతున్నాడు. యన్. బి. హెన్రీ ఎడిట్ చేసిన "సోషల్ ఫోర్సెస్ ఇన్‌ఫ్లూయెన్సింగ్ అమెరికన్ ఎడ్యుకేషన్"లో షుల్ట్స్ వ్రాసిన "ఎడ్యుకేషన్ అండ్ ఎకనామిక్ గ్రోత్" అనే వ్యాసం చాలా గొప్పగా ఉన్నది. సానుభూతితో ప్రభుత్వం, పెట్టుబడి దారులకు తోడ్పడినట్లయితే నిలకడగల "స్థిర పారమ్య అర్థికాభివృద్ధి" నియంత్రణ చేయబడని స్వేచ్ఛా ఆర్థిక వ్యవస్థ ద్వారా సాధ్యపడుతుందని షుల్ట్స్ అభిప్రాయపడుతున్నారు.

"అదనపు శ్రామికబలం" ఉంటుందని షుల్ట్స్ అంగీకరించలేదు. వర్ధమాన ఆర్థిక వ్యవస్థల్లోని వ్యవసాయావ్యవస్థల్ని అధ్యయనం చేసిన ఫలితంగా రైతులు వ్యష్టిగాను, సమిష్టిగా కూడా సమర్థవంతులేనని, అయినా బీదవారుగా ఉన్నారని షుల్ట్స్ చెప్పారు. సాంప్రదాయ పద్ధతిలో సాగుచేస్తున్నందువల్ల రైతుల దగ్గరున్న వనరుల్ని పునఃకేటాయింపు చేసినప్పటికి వ్యవసాయోత్పత్తి చెప్పదగినట్లు పెరగదని షుల్ట్స్ అంటున్నారు. వ్యవసాయాభివృద్ధి కావాలంటే ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఆ రంగానికి అనువర్తింప

చేయక తప్పదు. ఇలా చేయడం వనరుల్ని సమర్థవంతంగా కేటాయించడమౌతుంది అని షుల్ట్స్ చెప్పారు.

మార్కెట్ చట్రము సంపూర్ణమైనదని షుల్ట్స్ చెప్పారు. చాలా బీద దేశాలలో లభ్యమౌతున్న వనరులను ఉపయోగించబడుతున్న తీరులోనే ఉంచినట్లయితే ఆర్థిక వృద్ధి రాదు. ఆ దేశాల్లో చెప్పదగ్గ ప్రాముఖ్యతగల ఆర్థిక వృద్ధిని పొందేందుకు ప్రియత్నాన్ని, మూలధనాన్ని మూడు లక్ష్యాల సాధనకు పునఃకేటాయింపు చేయవలసి ఉన్నది. 1) పునరుత్పాదన చేయడానికి వీలున్న వస్తువుల రాశిని పెంచేందుకు 2) ఉత్పాదక శక్తులుగా ప్రజల గుణాత్మక లక్షణాన్ని మెరుగు పర్చుటకు 3) ఉత్పాదక కళల (పద్ధతుల) స్థాయిని పెంచేందుకు అని షుల్ట్స్ వివరించారు.

ఆర్థికాభివృద్ధి ప్రక్రియలో ఆర్థికేతర కారకాలు నిర్వహించే పాత్రను షుల్ట్స్ నొక్కి చెప్పాడు. ఈ సందర్భంలోనే విద్య ప్రాముఖ్యతను నొక్కి వక్కాణించాడు. మూలధన వస్తువుల మీద చేసిన పెట్టుబడి కంటె సాంఘిక విద్య మీద చేసిన పెట్టుబడి జాతీయాదాయాన్ని ఎక్కువగా పెంచగలదని షుల్ట్స్ వాదిస్తున్నారు. సాంఘిక విద్యను పెంపొందించే బాధ్యతను ప్రభుత్వమే తీసుకోవాలి. వ్యక్తిగతంగా సాంఘిక విద్యాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడను పెట్టుబడి దారులకు చాలకష్టమైన భారమౌతుంది అని షుల్ట్స్ వ్రాసారు.

దేశీయ సప్లయిలు చవుకగా లభ్యము కావడం సాధ్యంకాదు కాబట్టి విదేశాలనుండి సప్లయి చేసుకోవడానికి ఉదారదృష్టిని చూపాలని షుల్ట్స్ అంటున్నారు. విదేశ వ్యాపారం మీద కూడా ఆయన గొప్పగా చెప్పారు. స్వల్పకాలీన వ్యవధిలో ప్రధాన ఎగుమతులకుండే డిమాండ్ యొక్క నిలకడలేని తనాన్ని వర్థమాన దేశాలు జాగ్రత్తగా బలపర్చి పోషించినాయని షుల్ట్స్ అభిప్రాయ పడ్డారు. ఇందువల్ల వర్థమాన దేశాల్లో జీవన ప్రమాణాలు, పడిపోకుండా ముందంజవేసే ఆర్థికాభివృద్ధికి కావలసిన పెట్టుబడులు పడిపోతాయని షుల్ట్స్ అంటున్నారు.

ప్రజలు బ్రతికడానికి కావలసిన ఆహారాన్నిచ్చే వ్యవసాయ రంగంమీద, కార్య నిర్వహణ కవసరమైన బుద్ధి వికాసాన్ని, జ్ఞానాన్ని ఇచ్చే విద్య మీద, సర్వశక్తుల్ని నడిపే మానవ మూలధన శక్తివృద్ధి మీద మంచి ఆలోచనను అందించిన ప్రొఫెసర్లు షుల్ట్స్, లూయిస్‌లు, మనందరికి, ముఖ్యంగా వర్థమాన దేశస్థులకు అధ్యయన యోగ్యులని నిస్సందేహంగా చెప్పవలసి ఉన్నది. వీరికి నోబల్ బహుమతి నిచ్చి మానవ జాతి తనను తాను గౌరవించుకున్నది.

శ్రీ సి. ఆనంద నరశింహులు

# తిమ్మసముద్రం - తామ్రశాసనం

అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం తాలూకా, తిమ్మసముద్రం గ్రామకరణం వశంలో ప్రస్తుత తామ్రశాసనము, వీరి పూర్వీకుల నుంచి కలదు. ఈ తామ్రశాసనము శ్రీ జి. నరశింహదాసు, అప్పటి తాలూకా పౌర సంబంధ శాఖాధికారి (ప్రస్తుత జిల్లా శాఖాధికారి - కర్నూలు) కళ్యాణదుర్గం వారి ద్వారా పరిశోధన నిమిత్తం గైకొనబడినది. తిమ్మసముద్ర గ్రామం కళ్యాణ దుర్గానికి 35 కిలో మీటర్లు లేదా అనంతపురంనుండి 89 కిలోమీటర్ల దూరంలోగలదు. ఈ గ్రామం చేరుటకు బస్సు సౌకర్యం మాత్రం గలదు.

ఈ శాసనము మొత్తము, 55 పంక్తుల తెలుగు భాషలోగలదు. ఇది 27.5 సెం.మీ. పొడవు, 15.5 సెం.మీ. వెడల్పుగల్గియున్నది. శాసనము వివరముగా నుండుటచే పరిశోధన సులభనాయకమైనది. శాసన భాషా పరిచ్ఛేదములో ఏ విలక్షణమైన లక్షణాలు వాడబడ లేదు.

### శాసన కాలము

అన్ని శాసనములవలె ప్రస్తుత తామ్రశాసనము "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు" అని కాలనిర్ణయంతో ప్రారంభమయినది. ఇది రాజులు-రాజరికపు కాలంలో ఇవ్వబడనిది. కాన యిందు రాజవంశ ప్రశస్తి లేదు. ఇది తారీఖుగల శాసనము. ఈ శాసనము శక వర్షంబులు 1658 నళ సంవత్సరం, కార్తీక మాసం, శుద్ధ పౌర్ణమి 15, భానువారంనాడు నొసగబడినది. శాసన కాలమును క్రీ. శ. 1736, నవంబరు మాసం 15 భానువారంగా పరి గణించవచ్చును. ఈ శాసనకాలానికి భారతదేశమున మొగలు సార్వభౌమాధికారము నశించి వారి సుబేదార్లు స్వంతరాజ్య స్థాప కులుగా ప్రకటించుకొన్నారు. 1724కు మొదటి అసఫ్‌జా నిజముల్ ముల్కు నిజాం రాజ్య స్థాపకుడుగా దక్షిణ భారతదేశంలో స్వతంత్ర పాలకుడైనాడు.

### శాసన విషయం

శాసన వివరణ ప్రధానంగా 18వ శతాబ్దములో గూడా "క్రయ పత్ర విధానము" అను పద్ధతి అమలులో ఉన్నట్లు ఋజు వగుచున్నది. భారతదేశమును హైందవ చక్రవర్తులు, ముస్లిం వంశీయులు, విజయనగర రాజులు, 'బ్రిటిష్' వారు పరిపాలించిరి. ముఖ్యంగా 'బ్రిటిష్' వారు భారతదేశమును దాదాపు రెండు వందల సంవత్సరములు అనగా 1757 నుండి 1947 వరకు పాలించారు. 1757 నుండి 1858 వరకు కంపెనీ పరిపాలన, 1858 నుండి 1947 వరకు 'బ్రిటిష్' రాజరికం భారతదేశముపై చెల్లినది. తొలి భారత దేశపు చక్రవర్తిగా 1858లో విక్టోరియా మహారాణి గుర్తింప బడినది. కాని వీరికంటె మునుపే పైన పేర్కొనబడిన "క్రయ పత్ర" విధానపు పద్ధతి అమలులో ఉన్నట్లు యీ తామ్రశాసనము ద్వారా ఋజువగుచున్నది. ఇందు రెండు వర్గముల వారిని గూర్చి వారు చేసుకున్న ఒడంబడికను గూర్చి విశదముగా లిఖించబడినది.

కుందుర్పి సీమ పాలవాయి గ్రామానికి చెందిన క్రింద కన బరచిన హరితస గోత్రానికి చెందిన హోబళ్ళస్థల కరణాలు అయిన

1. తిరువెంగళప్ప పౌత్రుడు రమణప్ప పుత్రుడగు సుబ్బయ్య
2. వెంకటేశయ పౌత్రుడు తిమ్మప్పపుత్రుడగు అప్పకొండయ్య
3. వెంకప్ప పౌత్రుడు దాసప్ప పుత్రుడగు శేషప్ప - గార్లు

వీరు తమ అవసరనిమిత్తం కాశ్యప గోత్రులగు చికిణి గిరియప్ప పౌత్రుడు క్రిష్ణప్ప అనుజుడగు వెంకట గిరియప్ప నుండి అక్షరాలా వెయ్యింన్నూపాయా భైవరహాలు తీసికొనినట్లు యీ తామ్రశాసనము ద్వారా తెలియుచున్నది. పై వివరములు తామ్రశాసనము మొదటి వైపు 6వ పంక్తినుండి 20వ పంక్తివరకు లిఖించబడి యున్నది. పై మువ్వురు తీసికొన్న ద్రవ్యమునకు తిరిగి వెంకట గిరియప్పకు, "క్రయపత్ర పద్ధతి" గా మూడు గ్రామాలను - అనగా 1. వర్తిణా గ్రామము 2. పులి తిమ్మిరెడ్డిపల్లెగ్రామం 3. కాపరేణపల్లె గ్రామము - వీటియందుగల నిధి, నిక్షేప, జల పగైరాలను వెంకట గిరియప్పకు పుత్ర పౌత్ర వంశాభివృద్ధిగా అనుభవించుమని పై మువ్వురు వొప్పి వ్రాసి యిచ్చిన తామ్రశాసన క్రయదాన పత్రము. పై వివరములు తామ్ర శాసనము మొదటి వైపు 21వ పంక్తి నుండి 27వ పంక్తులలో మనకు విశదమగుచున్నది.

## శాసనములో పేర్కొనిన పల్లెల వివరణ

తామ్రశాసనంలో పేర్కొనబడిన గ్రామములు అనగా వలేజా గ్రామము, పులితిమ్మిరెడ్డిపల్లె గ్రామము, కాపలాపల్లె గ్రామము, పాలవాయి, కుందుర్పి - గ్రామములు నేటికి అనంతపురం జిల్లా, కళ్యాణదుర్గం తాలూకా యందు కలవు.

ఈ తామ్రశాసనంలో మరియొక ప్రత్యేకత ఏమనగా ప్రస్తుతం అమలులోగల 'సాక్షిపద్ధతి' కూడా 18వశతాబ్దంలో కలదని శాసనం ద్వారా ఋజువగుచున్నది. కాస్యప గోత్రులగు చికిణిగిరియప్ప పౌత్రుడు, వెంకప్ప పుత్రుడు, క్రిష్ణప్ప అనుజుడగు వెంకటగిరియప్పకు - కుందుర్పిసీమ పాలవాయికి చెందిన పైన కనబరచిన ముగ్గురు వ్యక్తులగు సుబ్బయ్య, అప్పకొండయ్య, శేషప్పగార్ల మధ్య జరిగిన "క్రియపత్ర విధానము" అనుదాన పత్రము పై సాక్షులుగా క్రిందకనబరచిన శ్రీయుతులు

1. వలేజా లింగారెడ్డి కొమారుడు పెద్దన్న
2. సోమిరెడ్డి కొమారుడు అయ్యన్న
3. లింగిరెడ్డి కొమారుడు సోమయ్య
4. వీరదిం్మయ్య కొమారుడు కొంకల దిం్మయ్య
5. హనుమయ్య కొమారుడు పెద్దలచ్చయ్య
6. తలాలూరా నలశిద్ధయ్య కొమారుడు గిడయ శిద్దయ్య
7. లింగయ్య కొమారుడు యర్రయ్య
8. బడిగె కరియంణ కొమారుడు మల్లయ్య
9. కంమరులుంకాజ కుమారుడు నాగయ్య
10. చాకల నాగయ్య కొమారుడు వీరయ్య
11. మంగళ కరియంణ కొమారుడు మల్లయ్య
12. సరాబువారి కొమారుడు తింమ్మయ్య
13. పంచాంగం వేదవ్యాసభట్లు కొమారుడు అనంతభట్లు
14. మాదిగ మూగివాని కుమారుడు గిడడు - లు సాక్షులుగా యీ శాసనం ద్వారా తెలియుచున్నది.

కులభేదము చూపక ప్రతికులం నుండి ఒకరిని సాక్షిగా ఎన్నిక చేయడం ఆ కాలంలో ప్రతి కులమునకు ప్రాధాన్యత నొసంగిరని యీ శాసనం ద్వారా ఋజువగుచున్నది. ఈ శాసనం పాలువాయి కరణం సుబ్బయ్య కుమారుడు తిమ్మరసయ్య స్వహస్తంతో లిఖించినట్లు తెల్పుతున్నది.

## శాసన పాఠం

### మొదటి ముఖము

1. శ్రీ వేంకటరమణ
2. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబు
3. లు ౧౬౭౮ అగున నేటి నళనామ సంవత్సరం కార్తీక శు ౧౫ లు
4. భానువారం శ్రీమదిఖిలాండ కోటి బ్రంహ్మాండ నాయ
5. కుడైన శ్రీ వెంకటాచలపతి ప్రియభక్తులయిన
6. కాస్యప గోత్ర అశ్లాయన సూత్రులయిన చికిణి



మొదటి ముఖము

7. గిరియప్ప పౌత్రులైన వెంకప్ప పుత్రులయిన క్రిష్ణప్ప అను
8. జుడైన మా దౌహిత్రుడైన వెంకటగిరియప్పకు కుం
9. దుర్పి సీమలోనికి చెల్లెపాలవాయి హోబళిస్థల కర
10. ణాలు హరితస గోత్ర ఆపస్తంబ సూత్రులయిన తిరు
11. వెంగళప్ప పౌత్రుడైన రమణప్ప పుత్రుడైన సుబ్బయ్య వెంకటేశ
12. య్య పౌంత్రుడైన తింమప్ప పుత్రుడైన అప్పకొండయ్య। యీ వు

# మేఘ సందేశం

ఈ
గుండె నిండా
నిండిన
నువ్వు
రాకుంటే,
నా
అణువణువునా
ఇమిడిన
నువ్వు
లేకుంటే....
నా గీముకు
ఏ సద్దూ లేదు
నా వేదనకు
ఏ హద్దూలేదు.
నా రోదనకు
సరిహద్దే లేదు
నా ఎడదకు
తొలిపొద్దే లేదు.
అయినా
ఏమైనా
ఆషాఢ మేఘం
అంపుతానంటుంది సందేశం.

◆ ◆

నిశీధి
వీధులలో
నిరాశ
బాధలలో
నిస్పృహ
గాథలలో
మరిచి పొమ్మనే
నీ బోధనతో
మరవలేననే
నా రోదనతో
నువ్వు రావేమోననే
వేదనతో
నువ్వున్నావేమోననే
శోధనతో
కృంగి పోతున్నాను
కృశించి పోతున్నాను.
అయినా,
ఏమైనా
ఆషాఢ మేఘం
అంపుతానంటుంది సందేశం.

◆ ◆

గత జీవితపు
గురుతులను
వర్తమానపు
వెతలను
భావి జీవితపు
కలలను
నా మేధలోని
కళలను
నీ మేనిలోని
చంద్రకళలను
ఏరి
కోరి
పూజారినై
పూజలు చేస్తున్నా
నువ్వు రావేమని
వేచి చూస్తున్నా.
అయినా
ఏమైనా
ఆషాఢ మేఘం
అంపుతానంటుంది సందేశం.

◆

వాడిన
పూదోటపై
వాలే
తేటిలా,
తేనియ లేక
గానము లేక
మూగదైన ఓ
ఎలదేటినైనాను.

పున్నమి జాబిలి లేక
ఉన్న తన చెలి లేక
పరవశమనలే లేక
పొగిలే చకోరకంలా,
నా జీవన నిశికి
శశి లేక
నా ప్రాణానికి
ప్రాణమైన నువ్వులేక
రగిలే పక్కినైనాను
అయినా
ఏంవైనా
అషాఢ మేఘం
అంపుతానంటుందీ సందేశం.

◆ ◆

నీ
నిర్ణయం
నిరాశను
పెంచుతోంది.
నీ
నిష్క్రమణం
నిశ్శబ్దాన్ని
జనింప చేస్తోంది.
నీ
విరహం
చితిని
పేర్చుతోంది.
అప్పుడు
నీ పూల శయ్యపై.
ఇప్పుడు
జ్ఞాపకాల అంపశయ్యపై.
నీకై వీక్షిస్తో
అలమటిస్తున్నా.
నిరీక్షిస్తో
మరణిస్తున్నా.
అయినా
ఏంవైనా
ఆ అషాఢ మేఘం
అంపుతానంటుందీ సందేశం.

(నిశ్శబ్దపు నీధిలో ....

— 'సంజు'

# వెదురు నుంచి వేణువు

చిట్టడవుల
నట్ట నడుమ
ప్రకృతి రీతిన
పెరిగిన గుబురు-
వెదురు !

అసమాన
సమాజాన
అట్టడుగున
కొట్టుకాడే ప్రాణి-
అజ్ఞాని !

* *

వెదురును తెంచి
నైపుణ్యాన్నుంచి
తీర్చిదిద్దితే ....
గేయాలకు
నవరాగాలకు
ఆయువు -
అదే వేణువు !

అజ్ఞానాంధకారంలో
మేధనే
సమిధనుంచి
చైతన్యమనే
నూనె పోసి
విజ్ఞాన జ్యోతి వెలిగిస్తే ....
మార్పులకు ఆది -
విప్లవ సౌధానికి పునాది !

శ్రీ ఎస్. సంజీవ్

శ్రీ ముదిగంటి సత్యనారాయణ రెడ్డి

# భూ సంస్కరణలు దాని అమలుపై ఒక పరిశీలన

మన దేశములాంటి అభివృద్ధి చెందుచున్న దేశాలలో ప్రధాన వృత్తి వ్యవసాయం. వ్యవసాయమే వాటి ఆర్థిక వ్యవస్థలకు వెన్నెముకలాంటిది. దురదృష్టం ఏమిటంటే, ఏ దేశాల ప్రధాన వృత్తి వ్యవసాయమో, ఎవరి జీవనభృతి వ్యవసాయమో, ఆ వ్యవసాయ రంగములోనే ఉత్పాదకత అభివృద్ధి చెందిన దేశములతో పోల్చుకొన్న చాల తక్కువగా యున్నదని చెప్పవచ్చును. ఉద్యోగ అవకాశములు చాలా తక్కువగా యుండుటయే కాకుండ, అల్ప ఉద్యోగిత, సాంప్రదాయ ఆర్థిక కార్యకలాపాలు ఈ ఆర్థిక వ్యవస్థలో ఎక్కువగా గోచరించుచున్నది. వీటి వలన ప్రజలలో ఒక విధమైన నిరాశ, నిస్పృహలు కొట్టవచ్చినట్లుగా కన్పించుచున్నవి. కావున గ్రామీణ రంగమును పునర్వ్యవస్థీకరించవలెనన్న, వారిలో, చైతన్యీకరణ, ఆదాయాలను పెంచాలన్న, వ్యవసాయ రంగములో విప్లవాత్మకమైన మార్పులను తీసికొని రావాలన్న, కౌలుదార్ల సమస్యలను తొలగించాలన్న, సుస్థిర ఆర్థికాభివృద్ధిని సాధించాలన్న ఈ వర్తమాన దేశములలో ఈ మార్పులను భూసంస్కరణల అమలు ద్వారా తీసికొని రావలసిన అవసరము ఎంతైనా ఉన్నదని చెప్పవచ్చును.

అయితే, ఇటీవల విజ్ఞుల రచనలను ఆధారంగా చేసికొని, వ్యవసాయ వ్యవస్థలోని సమస్యలను ముఖ్యంగా రెండుగా విభజించవచ్చును. అవి 1) సంస్థా పూర్వకమైనవిగా, 2) సాంకేతికమైనవిగా. వ్యవసాయాభివృద్ధి కోసం చర్యలు తీసికొనేటప్పుడు ఈ రెండు అంశాలను దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. 'దున్నేవానికి భూమి' లభ్యం కానిదే సాంకేతిక మార్పులను మాత్రమే ప్రవేశ పెట్టటం ద్వారా అధికోత్పత్తిని సాధించలేము. అందువలన సంస్థాపూర్వకమైన మార్పులను ప్రవేశ పెట్టి భూసంపదలలోని అసమానతలను తొలగించుటకు ఈ భూసంస్కరణల అమలు ఎంతో అవసరము.

## గ్రామీణ ప్రాంతాలలో భూ సంబంధాలు - భూ కమతాలు- వాని హెచ్చు తగ్గులు

పై నుదహరించిన అవశ్యకతను పరిశీలించుటకు ముందు భూమి హెచ్చు తగ్గుల తీరు తెన్నుల పూర్వ చరిత్రను తెలిసికొనుట తథ్యము అని తెలియుచున్నది. ముఖ్యంగా భూమి హెచ్చు తగ్గుల గురించి మూడు దశలుగా వివరించవచ్చు.

## పు రా త న కా ల ము

ప్రఖ్యాత రాజనీతి శాస్త్ర వేత్తలలో ఒకరైన రూసో 18వ శతాబ్దములో మానవుడు, అతని భూసంబంధాల గురించి తన సిద్ధాంతములో ఈ విధముగా ఉద్బోధించినారు. ప్రప్రథమముగా మానవుడు ఉదాత్తంగా, ఇతరుల సహాయాపేక్ష లేకుండా స్వతంత్రంగా వ్యవహరిస్తు అతడు ఉన్నదాతో సంతృప్తి పడే వాడని కాని కాల క్రమేణ ఈ వ్యవస్థలో మార్పులు; జనసంఖ్య పెరుగుదల మరియు వ్యక్తిగత ఆస్తి వ్యవస్థీకృతం కావడం వలన విజృంభించినవి అని చెప్పవచ్చును. ప్రథమంలో భూమండలం మీద జన సంఖ్య చాల కొద్దిగా ఉండి ఆర్థిక వనరులు, భూమి అడవులు, నదులు విస్తారంగా ఉన్నందువలన ఎలాంటి ఇబ్బందులు కనిపించ లేదు. తరువాత జనాభా పెరిగినందు వల్ల వాళ్ళలో ఒక విధమైన పోటీ పెరిగింది. తదనంతరము మానవులు ఒక నిర్ణీత స్థలములలో జీవనము గడుపుట ఆరంభించినారు. ఆ యా ప్రాంతాలలో వారు ఒక నిర్ణీత భూమిని స్వాధీనము చేసుకొని సాగు చేస్తుండే వారు. బుద్ధి బలము మరియు శారీరక బల ప్రయోగాల ద్వారా కొందరు ఎక్కువ భూమిని ఆక్రమించినారనియు, ఇతరులు తక్కువ భూమిని కలిగియుండి కడు బీదలుగా మారినారని రూసో తన సిద్ధాంతములలో వ్యక్తీకరించినాడు.

## మధ్యకాలిక భూమి పరిమితిలో మార్పులు

ప్రథమముగా ఆక్రమించి సాగుకు తెచ్చుకొనిన వారికి ఆ భూమిపై హక్కుగలదని మను ధర్మశాస్త్రము చెప్పుచున్నది. రైతు నకురక్షణ ఇచ్చి కాపాడురోజునకు పంటలో పాలునిచ్చుట హైందవ సాంప్రదాయమయ్యెను. భూమిపై శిస్తు వసూలు చేయుటకు మహమ్మదీయుల కాలములో మధ్య వర్తులేర్పడిరి. బ్రిటీష్ వారు భారతదేశమును వదిలి పోవు కాలములో 1) జమీందారీ, 2) మహల్వారీ, 3) రైత్వారి అను మూడు పద్ధతులమలు నందుండెను. ముఖ్యంగా జమీందారీ పద్ధతిలో ఎక్కువ భూమి కొందరు ఆక్రమించి అట్టి భూములకు పరిమితమైన స్థాయిలలో శాశ్వత భూమి హక్కులను సంక్రమించుట వలన, అట్టి జమీందారులు బ్రిటీష్ పాలకులకు సన్నిహిత మిత్రులగుట వలన వారు అధిక భూమితో భాగ్యవంతులగుటకు అవకాశములు కల్పించబడినవి అని చెప్ప వచ్చును. నాటి నుండి నేటి వరకు అట్టి భూమి కొందరి హస్తగతము కావడం నిత్యం గోచరించుచున్నది. ఈ విధముగా భూపరిమితిలో హెచ్చు తగ్గు లేర్పడి భూస్వాములుగా మరియు భూమి లేని నిరుపేదలుగా మారినారని చెప్పవచ్చును.

## ఆధునిక కాలము (ప్రస్తుత సర్వే కాలము) లో మార్పులు

ఇటీవల చేసిన సర్వే వలన కొన్నిముఖ్యమైన ఉదాంతములు వెలికి వచ్చినవి. అవి ఆధునిక కాలములో భూమి కొందరి హస్తగతము కావడానికి కారణములుగా చెప్పవచ్చును. వానిలో కొన్ని ఈ క్రింద నుదహరించబడినవి.

1) అప్పుల వలన భూమిని తాకట్టు పెట్టుట వలన అట్టి భూమి కొందరు చేతులతో కేంద్రీకృత మగుచున్నది.

2) నిరక్షరాస్యత వలన భూమిని కోల్పోవుచున్నారనియు,

3, భూమి శిస్తు చెల్లించే స్థోమత లేకుండా ఉండి భూములను కోల్పోవుచున్నారనియు.

ఈ విధముగా ప్రస్తుత కాలములో భూముల పరిమితిలో హెచ్చు తగ్గులు ఏర్పడుచున్నవనియు తెలియుచున్నది. మిగతా విషయములను ఆయాపట్టికలలో గ్రామ సర్వే అనే పుటలలో పొందు పర్చబడినవి.

## భూ కమతాలు- హెచ్చుతగ్గులపై ప్రభుత్వంయొక్క విధానము

భూకమతాలు-వాని హెచ్చు తగ్గులపై మన ప్రభుత్వములు (కేంద్ర, రాష్ట్ర) సమగ్ర చర్చలు జరిపిన తరువాత భూసంస్కరణలను రూపొందించబడినవి. మన దేశములో భూ సంస్కరణ కార్యక్రమాలు ముఖ్యంగా ఈ క్రింద నుదహరించిన విధంగా అమలుకు వచ్చినవని చెప్పవచ్చును. మధ్యవర్తుల తొలగింపు, కౌలు సంస్కరణలు, కమతాల గరిష్ఠ పరిమితుల నిర్ణయము.

గ్రామీణార్థిక వ్యవస్థను సామ్యవాద ప్రాతిపదిక మీద నిర్మించవలెనన్న వ్యవసాయరంగంలో సాంఘిక, ఆర్థిక పీడనలు తొలగి, సమానతలు కల్గించవలెనన్నా కమతాలను గరిష్ఠ పరిమాణం నిర్ణయించడం అవసరము. ఈ గరిష్ఠపరిమితిని నిర్ణయించుటతోమన దేశములోని రాష్ట్రములు ఒక్కొక్కటి ఒక్కొక్క విధముగా శాసనాలను రూపొందించుకొని అమలు చేసినవి మరియు అమలు చేయుచున్నవి.

గరిష్ఠ పరిమితి నిర్ణయించేటప్పుడు భూసారము, నీటి పారుదల వసతులు, సేద్యపద్ధతులు మొదలైన అంశాలను లెక్కలోనికి తీసికొనవలసి యుంటుంది. అందువలన వివిధ రాష్ట్రాల్లో గరిష్ఠ పరిమాణము వేరు వేరుగా ఉంటున్నది. ఉదా:- ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుత కమతాలకు 27-234 ఎకరాలు, రాజస్థాన్‌లో 22-336 ఎకరాలు, కర్నాటకలో 27-216 ఎకరాలు నిర్ణయించడమైనది. తరువాత కొన్ని రాష్ట్రాలు కనిష్ఠ - గరిష్ఠ మధ్యగల పరిమితులను తగ్గించినారు. నీటిపారుదల సౌకర్యాలు గల భూములే ఉండి రెండు పంటలు పండించగల్గినట్లయితే గరిష్ఠ పరిమితి 10-18 ఎకరాలుగా నిర్ణయించడమైనది. ప్రైవేటు వసతులద్వారా నీటి పారుదల సౌకర్యాలుంటే, పబ్లిక్ వసతుల నీటి పారుదల సౌకర్యాల భూమి 1 ఎకరము, 1.25 ఎకరాల భూమికి సమానంగా భావించి 18 ఎకరాలకు మించకుండా గరిష్ఠ పరిమాణాన్ని నిర్ణయించటమైనది. ఒకే పంటకు నీటి సదుపాయాలున్న భూములకు గరిష్ఠ పరిమితి 27 ఎకరాలుగా నిర్ణయించడమైనది. ఇతరరకాల భూములకు గరిష్ఠ పరిమితి 54 ఎకరాలుగా నిర్ణయించినారు. ఇసుక నేలలు, రాతినేలలు విషయంలో గరిష్ఠ పరిమితి 54 ఎకరాలకు మించవచ్చు. ఈ విధంగా ప్రభుత్వము వీని అమలుకై కృషిచేసినది.

## భూ సంస్కరణములు - ప్రయోజనములు

ఈ భూ సంస్కరణలు అమలు చేసినచో ఈ క్రింద నుదహరించిన ప్రయోజనములు సమకూరునని చెప్పవచ్చును.

ఈ భూసంస్కరణల అమలు వలన భూస్వాముల అజమాయిషీ, పెత్తనం, దొరతనం తగ్గి భూమి యాజమాన్యంనకు సంబంధించిన తేడాలు తగ్గును. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక, సాంఘిక అసమానతలు తగ్గి, సమ సమాజమునకు పునాది వేసి, సామ్యవాద సమాజస్థాపనకు దారితీయును. మరియు హరిత విప్ల

వాన్ని సాధించవలెనన్న, ఆర్థికాభివృద్ధి రేటును పెంచవలయునన్న సుస్థిరమైన గ్రామవ్యవస్థను రూపొందించవలయునన్న భూసంస్కరణల అమలు ఎంతేని అవసరమని చెప్పవచ్చును.

ఇవియేకాకుండా భూసంస్కరణలను అమలు చేసినచో ఈ క్రింద నుదహరించిన ప్రయోజనాలు కూడా కల్గును.

1) బానిసత్వము తొలగించబడును.

2) నిరుద్యోగ సమస్య తీర్చబడును.

3) బీడు భూములు సాగులోనికి తేబడును.

4) అధికోత్పత్తిని సాధించబడును.

5) మూలధనపు కొరత తీర్చబడుతుంది.

6) పారిశ్రామికాభివృద్ధి సమర్థవంతంగా నిర్వహించబడుతుంది.

7) ప్రభుత్వ ఆదాయము పెరుగుతుంది.

8) ఇతర రంగాలలో అభివృద్ధి జరుగుతుంది.

9) విదేశీ మారక ద్రవ్యమును సమకూర్చుకొనుటకు సహాయకారి అవుతుంది.

## పరిశీలన పద్ధతులు

భారతదేశము యొక్క బహుముఖాభివృద్ధికి భూసంస్కరణలు అత్యంత ప్రాధాన్యత వహించుచున్నవి. సమయము కొరత వలన శక్తి సామర్థ్యముల మేరకు ఒక గ్రామములోని అందరి ప్రజలయొక్క భూక తాలను గ్రహించక గ్రామములోని కొందరి ప్రజలను ఎంపిక చేసికొని పల్లెసీమ అభివృద్ధికి ఏ విధంగా తోడ్పడుతుందో తెలుపుట ఈ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశము.

ఈ లక్ష్యసాధనకై మ్యాడంపెల్లి గ్రామంలోని రైతుల యొక్క భూసంబంధాల గురించి వివేచనాత్మక అధ్యయనంగా గ్రహించి అనుభవపూర్వకమైన నగ్న సత్యాలను వెల్లడించుటకు ఆ గ్రామ ప్రజల యొక్క సాంఘిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ మరియు సాంస్కృతిక స్థితి గతులపై మరియు భూకమతాలకు - ప్రజలకు ఉన్న సంబంధాలను, భూకమతాలలోని లోపాలను మెరుగు పరుచుటకై 100 మంది యొక్క అభిప్రాయాలను పట్టికలతో సేకరించడం జరిగినది.

## మ్యాడంపెల్లి గ్రామ భౌగోళిక పరిస్థితులు

మ్యాడంపెల్లి గ్రామము, కరీంనగరం జిల్లాలోగల మల్యాల తాలూకాలో ఉన్న ఒక గ్రామము. ఈ గ్రామము సుమారు 1895లో రెడ్డి వంశీయులచే స్థాపించబడినట్లు సర్వేలో తేలింది. వీరు బీరుసాని మరియు తక్కళ్ళపెల్లి, నీరుకుళ్ళ అనే గ్రామాలనుండి వలస వచ్చి ఈ గ్రామమును స్థాపించినట్లుగా కొందరు విజ్ఞులు సర్వేలో వెల్లడి చేసినారు. ఈ గ్రామం ఉత్తరమున తక్కళ్ళపల్లి గ్రామము, దక్షిణమున భీమావరం గ్రామము మరియు తూర్పు పడమరల నుద్దాపెల్లి మరియు మానాల గ్రామాలను వరుసగా కల్గియున్నది.

## జనాభా

ఈ గ్రామములో క్రమ క్రమంగా జనాభా అభివృద్ధిచెంది ఇటీవల జరిగిన జనాభా లెక్కల [1981 సెన్సస్] ప్రకారము సుమారుగా 2500 నుండి 3000 వరకు ఉంటుంది. ఈ గ్రామములో వయోజన ఓటర్లు 18 సంవత్సరముల ప్రాయముగల ఓటర్ల సంఖ్య 1,258. ఈ ఓటర్లలో కులాల వారిగా ఈ క్రింది విధముగా నున్నారు. హరిజనులు (మాల) 301, వైశ్య (కోమటి) 28, విశ్వబ్రాహ్మణ (అవుస) 17, రెడ్డి (113), కుమ్మర - 17, కమ్మరి (విశ్వబ్రాహ్మణ) 35, కాపు వాండ్లు 187, పద్మశాలి 111, ముదిరాజ్ వాండ్లు 190, రజక (చాకలి) 57, యాదవ (గొల్ల) 119, గౌండ్ల వాండ్లు 7, మంగలి వాండ్లు 13, ముస్లింలు 3, భోగం వాండ్లు 8, అయ్యవార్లు 7, దర్జీవాండ్లు 5. ఈ గ్రామములో నున్న ఓటర్లలో అధిక మెజారిటీ ఓటర్లు హరిజనులు (301) మరియు అత్యల్ప మెజారిటీ ఓటర్లు ముస్లింలు (3).

## రవాణా మరియు కమ్యూనికేషన్ సౌకర్యాలు

ఈ గ్రామానికి, ఆయకట్టు రోడ్లు వలన ఆర్. టి. సి. రవాణా సౌకర్యము లేర్పడినవి. మరియు ఈ గ్రామములో విద్యుచ్ఛక్తి, సౌకర్యము కలదు. గ్రామములో విద్యుద్దీకరణ చేకూర్చబడినది. వ్యవసాయోత్పత్తుల విక్రయ మార్కెట్ సుమారు 8 కి. మీ. దూరములో నున్నది.

## నీటి వసతి

ఈ గ్రామములో ముఖ్యంగా నీటి పారుదల వసతులతో బావులు, చెరువులు ముఖ్యమైనవి. ఇటీవల ఏర్పాటు చేసిన శ్రీరాం సాగర్ ప్రాజెక్టు కాలువల వలన మరియు ఇతర వసతుల వలన ఈ గ్రామ ఆయకట్టులోని భూవిస్తీర్ణము 1150.02 ఎకరాల వరకు

సాగుచేయబడుచున్నది. అట్టి వివరాలను ఈ క్రింది పట్టికలో నుదహరించనైనది.

| క్రి: సం. | నీటిపారుదల వనరుల పేరు | సాగు అయ్యే భూమి విస్తీర్ణము |
|---|---|---|
| | | ఎ. గు. |
| 1. | బావులు | 100.00 |
| 2. | చెరువులు | 130.02 |
| 3. | కాలువలు (శ్రీరాంసాగర్ ప్రాజెక్టు) | 842.00 |
| 4. | ఇతర వనరులు | 78.00 |
| | మొత్తం | 1150.02 |

ఈ గ్రామములోని భూమి అధిక విస్తీర్ణములో కాలువల ద్వారానే సాగుచేయబడుచున్నది.

## పంటలు

ఈ గ్రామములో ముఖ్యంగా పండించే పంటలు - వరి, మొక్కజొన్న, పెసరు, వేరుశెనగ, మిర్చి, పసుపు మొదలగునవి. ఈ గ్రామములో ఆరు మాసములకు ఉత్పత్తి సుమారు 1560 కి॥ వడ్లు 300 కి॥ మొక్కజొన్న, 200 కి॥ పెసరు, 150 కి॥ వేరుశెనగ, 50 కి॥ మిర్చి మరియు 25 కి॥ పసుపు వచ్చుచున్నదని ప్రస్తుత గ్రామ సర్వేలో తెలియ వచ్చినది.

## గ్రామ ప్రజల వృత్తులు

ఈ గ్రామములోని ప్రజలు ఈ క్రింద నుదహరించిన వృత్తులు చేసికొనుదురు. కూలి, రొట్టెకొట్టుట, కట్టెలు అమ్ముకోవడము, జీతగాండ్రుగా నుండుట, వ్యాపారాలు చేయుట, మరియు బ్రతుకు తెరువుకై ఇతర దేశాలకు (అనగా సౌత్ అరేబియా, మాస్కట్) వెళ్లుట, మరియు కొందరు ప్రభుత్వోద్యోగులుగా నున్నారు. మరి కొందరు నీరుదితనము, మంచాలు అల్లుట, చేను కావలి, బట్టలు నేయుట మొదలగు వృత్తులలో నున్నారు.

## గ్రామములో నున్న భూమి విస్తీర్ణము

ఈ గ్రామములోనున్న భూమి విస్తీర్ణము సుమారుగా 1550.06 ఎకరములుగా నున్నది. అట్టి భూమి బంచరాయి, పరంపోగు, షికం, గ్రామ అబాది (ఇండ్ల క్రింద) రాస్తా (త్రోవలకై) మరియు కాస్తు క్రింద (సాగులోనున్న భూమి) సమ్మేళనము. అట్టి వివరములను ఈ క్రింద నుదహరించిన పట్టికలో పొందుపర్చబడినవి.

## భూమి వినియోగపు వివరాలు

| క్రి. సం. | భూమి పేరు | వైశాల్యము ఎ. గు. |
|---|---|---|
| 1) | సాగులో నున్న భూమి (పట్టా భూమి) | 1,150.02 |
| 2) | బంచరాయి | 289.38 |
| 3) | పరం పోగు (పి. పి.) | 65.14 |
| 4) | షికం (చెరువుల/కుంటల లోపలి భాగము) | 31.01 |
| 5) | గ్రామ అబాది (ఇండ్ల క్రింద) | 11.36 |
| 6) | రాస్తా క్రింద (త్రోవలకై) | 1.35 |
| | మొత్తం | 1,548.26 |

పైన చూపించిన బంచరాయిలో కొంత భాగము, చెట్లు, పొదలు మరియు గుట్టల క్రింద మరియు కొంత భాగము ఆక్రమించి బండ తీసికొనుటకు ఉపయోగించుకొను చున్నారు. మరియు పరంపోగుకు సంబంధించిన భూములను కూడా కొందరు అగ్రకులాల వారు మరియు బలహీన వర్గాలవారు ఆక్రమించుకొని సాగు చేస్తున్నట్లు ఈ సర్వేలోని మౌఖికాభిప్రాయాల ద్వారా తెలిసికొనవలసినది.

## గ్రామము యొక్క రాబడులు

చెట్లద్వారా (సీతా ఫలముల వేలము) మరియు ఇతర ఫలవృక్షముల వేలముల వలన కొంత ఆదాయము ఈ గ్రామము సమకూర్చుకొనుచున్నది. ఈ గ్రామములోని ఇండ్లపై ఇంటి పన్ను రూపేన

కొంత ఆదాయమును సమకూర్చుచున్నారు. మరియు చెరువులు, కుంటలలో నున్న చేపలు పట్టుకొనుటకు కూడా వానిని గ్రామ పంచాయతీ వారు వేలం వేసి డబ్బును సమకూర్చుదురు.

### గ్రామములోని పిల్లలకు మధ్యాహ్న భోజన వసతి

ఈ గ్రామములో పిల్లలకు మధ్యాహ్న భోజన వసతి గురించి పరిశీలించగా ఇచ్చట ఈ కార్యక్రమము సుమారుగా 3 సంవత్సరాల నుండి గ్రామ పంచాయతి అధ్వర్యములో సాగుచున్నది. ఈ భోజన వసతి పథకాన్ని ప్రప్రథమంగా ఆంధ్ర ప్రదేశ్‌లో అమెరికా రాయబారి అయిన ప్రొ॥ జే. కె. గాల్ బ్రెత్ గారు జులై 3, 1962లో, నర్సాపూర్ పంచాయితీ సమితి యందు ప్రారంభోత్సవము చేసారు.

పరమ దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న మన దేశ ప్రజల పిల్లలకు కొంత ఆకలి బాధను తీర్చి వేడినీళ్ళకు చన్నీళ్ళు తోడన్నట్లుగా ఇది పనిచేసిందని చెప్పవచ్చును. ఇంత మంచి ఆశయముతో తల పెట్టిన కార్యక్రమము దేశములోని అనేక గ్రామాలల్లో అమలు జరుగుటలేదని, నేను తీసికొనిన మచ్చు (సాంపుల్ సర్వేలో) గ్రామములోని సర్వేలో వెల్లడి అయిన మౌళికాభిప్రాయాల వలన గ్రహించబడినది. ప్రత్యేకంగా ఈ కార్యక్రమమునకై ఇచ్చిన ఆహారమును ప్రస్తుతము గ్రామములో పశువులకు పెట్టుట మరియు నల్లబజారులో అమ్మకం చేయుచు, కార్యక్రమ ఆశయానికి తీరని అపంకంగా పరిణమిస్తున్నారు ఆ పథకాధిపతులు.

### గ్రామములోని - సాంఘిక సంక్షేమ కార్యక్రమములు

ఈ గ్రామములో సాంఘిక సంక్షేమ శాఖవారు ప్రోత్సహించిన కార్యక్రమాలలో కుట్టు మిషన్ శిక్షణ కూడ ఒకటి. దీని ముఖ్యాశయము వెనుకబడిన తరగతులకు చెందిన గ్రామీణ స్త్రీలకు కుట్టు పని నేర్పి వారిలో ఉద్యోగ భృతిని సంపాదించే యోగ్యతను సమకూర్చు కొనుచు, పేదరికాన్ని రూపుమాపుట. కాని దీనికి విరుద్ధముగా ఈ గ్రామములో కుట్టు మిషన్‌లను అగ్రకులముల వాండ్ల ఇండ్లలో స్థాపించి, అగ్రకులములవారే వీటి ద్వారా లాభార్జన గడించుచున్నారు.

(సశేషం)



శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# కన్యకా పురాణము నందలి విష్ణువర్ధను డెవ్వరు?

తెలుగు జాతి చరిత్ర నిర్మాణంలో శాసనాది తదితర సాధన సామగ్రికి తోడు సాహిత్యం కూడ యథోచిత పాత్ర నిర్వహిస్తోందనటంలో అతిశయోక్తి లేదు. కొన్ని సందర్భాల్లో యితరాధారాలు వెలుగు చూపని కోణాల్ని పరిశీలించడానికి సాహిత్యమే మూలాధారమై నిలుస్తోంది. కాని ఒక చారిత్రకాధారంగా సాహిత్యపు ప్రామాణికత విశ్వసించటానికి సర్వంకష పరిశోధన అవశ్యకత ఎంతైనావుంది. తెలుగువారి చరిత్రకు సంబంధించిన వరకు అనేక క్లిష్ట సమస్యలు సాహిత్యాధారంతో పూర్తి పరిష్కారం సాధ్యపడకపోయినా కొంతవరకైనా వెలుగుచూస్తున్నాయి. అలాంటి సమస్యల్లో పరిగణింపదగినది శ్రీ వాసవ కన్యకా పురాణము[1] నందలి విష్ణువర్ధనుని గుర్తింపు విషయము.

చాళుక్య రాజుగ చెప్పబడిన ఒక విష్ణువర్ధనుడు పెనుగొండ వైశ్యశ్రేష్ఠుడైన కుసుమశెట్టి పుత్రిక వాసవిని మోహించి తనకిచ్చి పరిణయము సేయమనుట, అతని కోరిక వైశ్యులు కులాచారము పేరిట త్రోసిపుచ్చి రాజదండనకు గినిసి వాసవితో కల్సి అగ్నిప్రవేశము చేయుట కన్యకాపురాణమునందలి విషయము. ఇప్పటివరకు దీని యందలి చారిత్రకాంశములు సందేహాస్పదమని భావింపబడి పూర్తి పరిశోధన జరుగలేదు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు యీ పురాణకర్తయైన గురు భాస్కరాచార్యులు పదహారవ శతాబ్దపు మొదటి ప్రాంతపు వాడని నిర్ణయించిరి.[2] శ్రీ చాగంటి శేషయ్యగారు కూడ మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారము నందలి అనేక ప్రతులు సంశోధించి యాతని కాలము పదహారవ శతాబ్దమే నని అంగీకరించిరి.[3] ఈ గ్రంథమున బమ్మెర పోతనామాత్యుని ప్రస్తావింప బడుటను బట్టి తప్పక యీ గ్రంథము పదిహేనవ శతాబ్ది తర్వాతిదే యని రూఢి యగు చున్నది.

కన్యకా పురాణము ప్రముఖముగా పెనుగొండ వైశ్యుల కుల ధర్మములను కట్టడి యొనర్చుట కుద్దేశించిన గ్రంథముగా కన్పడుచున్నది. అందు చెప్పబడిన కథాంశము సూక్ష్మముగా నిది. భగవంతుడైన శివుని ప్రేరణచే వైశ్యులు భూలోకమందలి పదునెన్మిది పట్టణములందు ఆవిర్భవించిరి. పెనుగొండనగరము వారి ముఖ్యపట్టణము. మిగిలిన పదిహేడు పట్టణములు వరుసగా ధర్మ. ధనద, పాంచాల, నిరవద్య, జననాథ, క్షీరకాసార, దెందులూర, ఏలూర, ఘంటశాల, త్రిగుణిత. ఘనభీము, విశాఖ, కళింగ, నృశింహ, వీరనారాయణ, ఆచంట, నగరము. ఈవైశ్యకుటుంబము లన్నింటికి కులపతి పెనుగొండ శ్రేష్ఠియైన కుసుమ శెట్టి. అతని కుమార్తెయే పార్వతీదేవి అంశయని వర్ణింపబడిన వాసవీ కన్య. ఆమెకు ఏడవ సంవత్సరము నడచుచున్నప్పుడు ఒకనాడు రాజరాజ నరేంద్రుని తండ్రియైన చాళుక్య విష్ణువర్ధనుడు జైత్రయాత్ర ముగించుకొని పెనుగొండ మీదుగా తన రాజధానియైన రాజమహేంద్రవరమునకు పోవుచు వాసవిని చూచుట తటస్థించినది. వీక్షణ మాత్రమున నామె సౌందర్యమునకు ముగ్ధుడై యామెను పరిణయమాడ నాశించి ఆ మేరకు వైశ్యుల అనుమతి నర్థించుచు కబురంపెను. కాని కులక్రమాగత సంప్రదాయానురక్తులైన వైశ్యులకు ఏమియు పాలుపోలేదు. వారి వంశాచారము ననుసరించి తమ కన్యలకు మేనరికపు సంబంధములు చేయుట తప్పనిసరి. తత్కారణమున రాజు అభ్యర్థనను తిరస్కరించుట కన్న వారికి మార్గాంతరము లేక పోయినది. రాజాజ్ఞ కన్న కులధర్మ రక్షణే ముఖ్యమని భావింపబడినది. ఈ మేరకు చర్చించుటకై పదునెన్మిది మహానగరములలోని 714 గోత్రముల వైశ్యకుటుంబములలోని పెద్దలకు కబురు చేయబడి పెనుగొండలోని నగరేశ్వరస్వామి ఆలయ ప్రాంగణమున ఒక సమావేశ మేర్పాటు చేయబడినది. వివిధములగు అభిప్రాయములు వ్యక్త పరుపబడినను చివరకు కులధర్మమును పరిరక్షించుటకు నిశ్చయింపబడి అనంతరము ఎదురవబోవు రాజ దండనను గుర్తించి తామే ముందుగా ప్రాణ పరిత్యాగ మొనరింప నిర్ణయించుకొనిరి. వారి కుల గురువైన భాస్కరాచార్యులు కూడ వీరి కుల ధర్మరక్షణను ప్రోత్సహించిరి. కాని రాజు కోరిక కెదురు

నిల్చి కులాచారము నిల్పుటకై వాసవితో కలసి అగ్నిగుండముల పడుటకు 714 గోత్రములలోని వైశ్యులలో 102 గోత్రముల వారు మాత్రమే ముందునకు వచ్చిరి. మిగిలిన 612 గోత్రముల వారును వీరి తోడి సంబంధము తెగత్రెంపులు చేసుకొని యటనుండి వెళ్ళిపోయిరి. అగ్నిగుండముల దూకనున్న 102 మంది గోత్రీయుల పెద్దలకు భాస్కరాచార్యులు వీరతాంబూల మొసగి ఆశీర్వదించిరి. ఈ అనర్థమున కంతకు విష్ణువర్ధనుడు కారకుడగుటచే వాసవీకన్య తన ఆహుతి వార్త చెవుల సోకగనే నాతడు మరణించునట్లు శపించెను. నాటినుండి నేటి వరకు నామె వాసవీకన్యక యను పేరిట వైశ్యుల కుల దేవతగా ఆరాధింప బడుచున్నది. ఈ వృత్తాంత మంతయు తర్వాతి కాలమున పెనుగొండ వైశ్యుల కోరికపై గురు భాస్కరాచార్యుడు తెనుగున పురాణముగా రచించుట జరిగినది.

— కన్యకా పురాణమున పేర్కొనబడిన వృత్తాంత మిది. అయితే దీనిలోని చారిత్రికాంశాల్ని ఎంతవరకు విశ్వసించవచ్చునో తెలుసుకోవటానికి చాళుక్య రాజైన విష్ణువర్ధనుణ్ణి గుర్తించటం ముఖ్యం. ముందు పేర్కొనబడినట్లు దీనిలోని ఉదంతం చారిత్రికంగా సందేహాస్పదం కానిది కాదు. ఈ పురాణం కేవలం వైశ్యుల కుల ప్రాశస్త్యాన్ని ఉగ్గడించటానికి తరువాత కాలంలో వెలువరించబడిన గ్రంథం. సాలంకాయనుడు తొల్లి చెప్పిన మూల కథ ఆధారంగా యీ పురాణం వ్రాయబడినట్లు దీనిలో పేర్కొనబడింది. ఆ మూలకథ నాధారంగా పెనుగొండ వైశ్యుల ప్రాశస్త్యము వారికు త్తేజము కలుగునట్లు భాస్కరాచార్యులు దీనిని రూపుదిద్ది యుందురు. కొన్ని విషయాలలో యీ గ్రంథం అపూర్వమే అయినా చాలామంది చరిత్రకారులు దీనిలోని చారిత్రిక విషయాన్ని గురు భాస్కరాచార్యుని కల్పితంగా భావించి తీవ్రంగా ఖండించారు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి దృష్టిలో వైశ్యుల కులాధిక్యాన్ని ప్రస్తుతించటమే యీవిధంగా యిది వ్రాయబడటానికి కారణం.[4] శ్రీ. జి. ఆర్. వర్మగారి వాదనలో నేడు పెనుగొండలో కన్పడు వాసవీ కన్య విగ్రహం ఒక సంపూర్ణయౌవ్వనిది. కథలో చెప్పబడినట్లు ఏడు సంవత్సరముల బాలికదికాదు. అందువలన పై కథ నిరాధారమైంది.[5] పైగా వేర్వేరు ప్రతులలో వివిధములుగా నున్న వివరాల్ని బట్టి విష్ణువర్ధనుణ్ణి గుర్తించటం సాధ్యమయ్యే విషయం కాదు.

ఒక్క విషయం గమనింపదగినది. వాసవీ కన్యతో కలసి అగ్నిప్రవేశము చేసిన వైశ్యుల నూట రెండు గోత్రములు యీనాటికి పవిత్ర గోత్రములుగా భావింపబడుచున్నవి. అట్లే నేటికీ పెనుగొండలోని వాసవీ కన్యకయే వైశ్యవంశము లన్నింటికీ కుల దైవము. ఇంతబలముగా వేళ్ళూనిన ఆచార సంప్రదాయములకు మూలము పూర్తిగా భాస్కరాచార్యుని కల్పన కానోపదు. దీని యందలి మూలకథ 'మార్కండేయ పురాణము'నందున్నది. అందు పేర్కొనబడిన రాజు మాంధాత పురమునేలెడి శృంగ వంశమునకు చెందిన రాజేంద్రుడు. గౌరనకవి వ్రాసిన 'నవనాథ చరిత్ర'యందును నీ వృత్తాంతమట్లే యున్నది. కేవలము పొరపాటుననో, కాక పురాణమునకు ప్రాంతీయత నాపాదించు దృష్టిచేతనో భాస్కరాచార్యుడీ యుదంతమును రాజమహేంద్రవరపు చాళుక్య రాజులకు ముడిపెట్టెను. ఈ విధముగా సారంగధరుని కథవలెనే యీ పురాణ



పెనుగొండలోని శ్రీ వాసవ కన్యకా పరమేశ్వరి విగ్రహము

కథయు తెలుగుజాతి కీర్తికి పతాక నెత్తిన చాళుక్య ప్రభువుల గౌరవ ప్రతిష్ఠలకు కళంక మాపాదించుట దురదృష్టకరమైన విషయము. ఈ పురాణమందు పేర్కొనబడిన విష్ణువర్ధనుడు గుర్తింపబడనిదే యీ గ్రంథపు చారిత్రిక ప్రామాణికత నంగీకరింపలేము.

ఈ పురాణమునందలి విష్ణువర్ధనుడు యిప్పటివరకుగు_ర్తింప బడక పోయినను, చారిత్రకాంశములు ఎంత అనుమానాస్పదములై నను, గ్రంథమును పూ_ర్తిగా నిరాధారమని త్రోసిపుచ్చుట సరియగు నిర్ణయము కాదు. సమకాలీన రాజకీయ పరిస్థితులను, శాసనాది యితర చారిత్రికాధారములను క్షుణ్ణంగా పరిశీలి_స్తే యీ పురాణము నందు పేర్కొనబడిన విష్ణువర్ధనుని విషయము పూ_ర్తిగా నిర్ధారిం చడం వీలుకాకపోయినా కొంతవరకు గ్రహించటాన్కి అవకాశ మేర్పడుతోంది. ఉండవల్లిలోని క్రీ॥ శ॥ 16వ శతాబ్దికి చెందిన ఒక శాసనమున యీ పురాణ కథను స్ఫురణకు తెచ్చు ఆస_క్తికర మైన విషయము తెలుపబడినది.6 పెనుగొండ శాసనులని అభి వర్ణింపబడిన వైశ్యులు కొందరు ఉండవల్లిలో భాస్కరేశ్వరుని ప్రతిష్ఠించి నిత్య నైవేద్యాదులకు దానములు సమర్పించిరి. నామ సాదృశ్యాన్ని బట్టి వారీ ఆలయాన్ని తమ కుల గురువు పేరిట నిర్మించి వుండవచ్చుననుకోవటంలో తప్పులేదు. కనుక భాస్కరా చార్యుని గ్రంథాన్నిబట్టి, యీ శాసనాన్ని బట్టి యీకథ ఆకాలానికే ఎంత ప్రాచుర్యమందిందో గ్రహించుకోవచ్చు. ఈ పురాణ కథలో వైశ్యుల అగ్ని ప్రవేశ సందర్భమున తమ కుల గురువు భాస్కరా చార్యులకు పెనుగొండ దగ్గరలోనున్న 'తామరవాడ' అనుగ్రామము దానమొసంగబడిన తామ్రశాసన వివరమందు తెలుపబడి పురాణము నకు విశిష్టత కల్పించుచున్నది. ఈ శాసన వివరములు యిందలి చారిత్రకాంశములు గు_ర్తించుటకు చాల తోడ్పడుచున్నవి. అందు పేర్కొనబడిన 'తామరవాడ' నేటు పశ్చిమ గోదావరిజిల్లా, తణుకు దాపునగల 'తామరాడ'యే. ఆ శాసన పాఠము పూ_ర్తిగా కన్యకా పురాణము నందు పేర్కొనబడినది. దీనిలో శాసన ప్రద_త్తపరుప బడిన కాలాన్ని గూర్చి -

"కల్యాద్యబ్ది గణేష్టు నేత్ర రస దృక్సంఖ్యా గతే వత్సరే
ప్రాప్తేబ్దే ప్రభవే తపస్యపి సితే పక్షే ద్వితీయా గురౌ
అహ్వా భాస్కర పండితాది ధరణీ బృందారకేభ్యస్సనా
పీత్యాష్టాదశా పట్టనాధిపతిభిః ద_త్తం శుభం శాసనమ్."

అని చెప్పబడింది. ఇది వైశ్యముఖ్యుల ప్రాయోపవేశ సమయమున ద_త్త పరుపబడినదని చెప్పుటనుబట్టి తత్సమయము విష్ణువర్ధనుని కాలమును సూచించుననుట స్పష్టము.

మరియొక ముఖ్యమైన విషయమేమన, పైపురాణమున పేర్కొనబడిన తామరాడ శాసన సందర్భముననేకాక మరికొన్ని యితర శాసనములందుకూడ తత్కాలమున రాజమహేంద్రవర పాలకుడుగా నొక విష్ణువర్ధనుడున్నట్లు పేర్కొనబడుచున్నాడు. బాపట్ల తాలూకాలోని పెద చెఱుకూరు నందలి త్రివిక్రమస్వామి ఆలయమునందలి ఒక శిలాశాసనమునందు, ఇక్షుగ్రామ తామ్ర శాసనమునందు, యిదే సంవత్సరముననున్న రాజమహేంద్రవర పాలకుడైన విష్ణువర్ధనుని విషయము తెలుపబడినది. కవి సంవత్స రములు, సంవత్సరనామము, ఋతువు, పక్షము, వారము, తిథి మున్నగు అన్ని వివరములు మూడింట ఒకే విధముగా నుండుట గమనింప దగిన విషయము.

రాజమహేంద్రవరము రాజధానిగా పరిపాలించుచున్న ఒక విష్ణువర్ధనుని విషయము పెద చెఱుకూరు శిలాశాసనమున పేర్కొన బడినది.7 పూర్వ వైరమును పురస్కరించుకొని శత్రురాజ్యము లపై దాడిచేసి, విజయమునంది తిరిగి వచ్చుచు దారిలో చెఱుకూరు లోని త్రివిక్రమ స్వామికి దానము లొసంగిన వివరమందు ప్రస్తా వింపబడినది. ఇదివరలో శ్రీయుతులు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, కొమాండూరి వెంకటాచార్యులుగారు యీ విషయమై చర్చించుచు నిందలి విష్ణువర్ధనుని క్రీ॥ శ॥ 673-682 మధ్య పాలించిన వేంగీ చాళుక్యరాజైన రెండవ విష్ణువర్ధనునిగా గు_ర్తించిరి.8 కాని వారి నిర్ణయము కొన్ని అభ్యంతరములు కారణముగా త్రోసి పుచ్చుట జరిగినది.9 ఆ శాసనమునందుపయోగింపబడిన లిపి క్రీ॥ శ॥ 13, 14 శతాబ్దుల యందు వాడుకలో నున్న లిపి. పైగా రాజధానిగా రాజ మహేంద్రవరము ప్రస్తావింపబడినది. దాన గ్రామముల కొలతలలో 'కేసరిపాటిగడ' వుపయోగింపబడినది. కనుక యిందలి విష్ణువర్ధనుని 13,14 శతాబ్దులలో రాజమహేంద్రవరము ప్రాంతములను పాలించిన వానిగా గు_ర్తించుట జరిగినది.

పై విష్ణువర్ధనుడే "ఇక్షుగ్రామము"ను నారాయణ శర్మయను బ్రాహ్మణునికి దానమిచ్చిన వివరము ఇక్షుగ్రామ తామ్ర శాసన మందలి అంశము.10

వీనిని బట్టి కన్యకా పురాణము నందలి తామరాడ శాసనము, బాపట్ల తాలూకాలోని పెద చెఱుకూరు శిలాశాసనము, విష్ణువర్ధనుని ఇక్షుగ్రామ తామ్రశాసనములు ఒకే చాళుక్య రాజైన విష్ణువర్ధనుని

కాలానికి చెందినవని, రాజమహేంద్రవర మాతని రాజధానియని తెలుస్తోంది. మూడింటియందును కాల వివరములు కూడ పూర్తిగా ఒక్క మాదిరిగనే చెప్పబడినవి. కాని ఆసక్తికరమైన విషయమేమంటే యీ మూడింటి యందును ఒకే మాదిరిగా చెప్పబడిన కాల వివరాలు అసలు సరియైన కాలాన్ని సూచించకపోవటం. ఒకవేళ సూచిస్తుందని భావించినా ఆ వివరం పూర్తిగా తప్పుదారి పట్టిస్తుంది. ఈ శాసనాలన్నింటిలో కాలనిర్ణయం "కల్యాద్యబ్జి గణేష్టనేత్ర రస దృక్సంఖ్యా" అనే దాన్ని బట్టి సాధించవలసి వుంది. విషయం అస్పష్టంగా వుండటాన్నిబట్టి అష్ట, నేత్ర, రస, దృక్‌లను సంఖ్యగా భావిస్తే కలిసంవత్సరం 2628 అవుతుంది. అంటే క్రీ. పూ. 474. ఇది పూర్తిగా అసందర్భమైన విషయం. డా॥ మారేమండ రామారావుగారు దీనిని కలిసంవత్సరం 4728గా భావించారు.[1] శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, కొంమాండూరి వెంకటాచార్యులుగారు క్రీ. శ. 656గా గుర్తించారు.[12] డా॥ యశోదాదేవిగారు క్రీ. శ. 1316 గా పరిగణించారు.[13] ఈ విధంగా వేర్వేరు ధోరణులలో వేర్వేరు అభిప్రాయాల్ని వెలిబుచ్చటం జరిగింది. కాని యివేవీ నిరభ్యంతరముగా నామోదింపదగిన పరిగణనలుకావు. ఏ ఆధారంతో యీయీకాలాలు గుర్తింపబడ్డాయో తెల్పబడలేదు. పెద చెఱుకూరు శాసన లిపి క్రీ. శ. 13, 14 శతాబ్దులకు చెందినదగుటచే ఆ రెండు శతాబ్దులందు ఏ సంవత్సరమునందు శాసనమున పేర్కొనబడిన తిథి వార నక్షత్రములు సరిపడునో చూచినచో శ్రీ యల్. డి. స్వామి కణ్ణుపిళ్ళెగారి 'ఇండియన్ ఎఫిమరీస్' ననుసరించి క్రీ. శ. 1328 జనవరి, 14వ తారీకునకు పై వివరము సరియగుచున్నది. గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు ఇఖగ్రామ తామ్ర శాసనమునకై చేసిన పరిగణన కూడ పూర్తిగా దీనితో సరిపోయినది.[14] కనుక యీ వివరము తామరాడ శాసనమునకును నిరభ్యంతరముగా అన్వయించుకొనవచ్చును. ఈ శాసనము లందలి విషయములనుబట్టి యిందుదాహరింపబడిన చాళుక్య విష్ణువర్ధనుడు క్రీ. శ. 14వ శతాబ్దిలో మొదటి భాగమున రాజమహేంద్రవరము రాజధానిగా పాలించుచుండెనని భావింపవలసి వస్తోంది.

అయితే అలా భావించటానికి యితరత్రా అవకాశాలెంతవరకు వున్నాయో కూడ గుర్తించటం చాల ముఖ్యం. ఈ శతాబ్దంలో రాజమహేంద్రవరపు రాజకీయ పరిస్థితుల మాట అటుంచి, చాళుక్య విష్ణువర్ధనుడనే రాజు ఉనికి తెలుసుకొందాం. వేంగి చాళుక్యరాజ్య పతనానంతరం చిన్న చిన్న సామ్రాజ్యాలు స్థాపించుకొని తెలుగునాటి కోస్తా తీరప్రాంతమున పరిఢవిల్లిన చాళుక్య వంశములు మూడు మాత్రమే. అవి జననాథపుర, నిరవద్యపుర, ఎలమంచి చాళుక్య వంశాలు. వీనిలో జననాథపుర చాళుక్య వంశాన్నే పిఠాపుర చాళుక్య వంశంగా కొందరు చెబుతుంటారు. ఈ వంశస్థుల పాలన పదకొండవ శతాబ్ది చివరిభాగంలో ప్రారంభమై పదమూడవ శతాబ్ది మధ్యభాగం వరకు కొనసాగింది. కనుక తర్వాతి కాలానికి చెందిన ప్రస్తుత విష్ణువర్ధనునితో వీరికి సంబంధము లేదు. నిరవద్యపురాలు చాళుక్యుల పరిపాలన కూడా పదకొండవ శతాబ్ది చివరి దశల్లోనే ప్రారంభమై పదునాల్గవ శతాబ్ది ఆరంభం వరకు కొనసాగింది. కాని చివరి రాజులైన రుద్రదేవాదులు తురకల దాడినుండి కాకతీయాంధ్ర సామ్రాజ్యమును రక్షింప కంకణము కట్టుకొని తెలంగాణమునకు తరలిపోయి అందే స్థిరపడుటచే నీ విష్ణువర్ధనుని వీరి వానిగా కూడగుర్తింపలేము. ఇక మిగిలినవారైన ఎలమంచిలి చాళుక్యులు పదమూడవ శతాబ్ది ఆరంభం నుండి పదహారవ శతాబ్ద్యంతం వరకు పాలించిన వంశము. వీరి పాలన యే సందర్భమునందును రాజమహేంద్రవరము వరకును విస్తరిల్లక పోవుటనుబట్టి పై విష్ణువర్ధనునకు వీరి వంశముతోకూడ సంబంధము లేదు. ఈ చాళుక్యవంశములు కాక అక్కడక్కడ కొద్ది చాళుక్యకుటుంబములున్నను, విష్ణువర్ధనుడను పేరిట నొక చాళుక్యరాజు పదునాల్గవ శతాబ్ది ప్రథమ పాదమున రాజమహేంద్రవరమున నుండెననుటకు యితరాధారములు లేవు.

కనుక పై పెదచెఱుకూరు, ఇఖగ్రామ శాసనములందును, కన్యకాపురాణమునందును మాత్రము రాజమహేంద్రవరమున యీ కాలమున ఒక విష్ణువర్ధనుని ఉనికి తెలియుచున్నది. ఇతరాధారము తెచ్చుటను అట్టి సందర్భమును తెలుపలేదు. రెండు శాసనములు, ఒక ప్రాచీన గ్రంథము వెల్లడించిన యీ విషయమును సక్రమముగనే గ్రహించి విశ్వసించుటకు యితర అభ్యంతరములు కూడ వుండుటచే యీ విషయము సంశయగ్రస్తమగుచున్నది.

కన్యకా పురాణము నందలి పదునెన్మిది వైశ్యపట్టణములలో నొకటిగా పేర్కొనబడిన ఘంటసాలలోని శాసనములు పెక్కుచోట్ల 'పెనుగొండ శాసనుల'ని కీర్తింపబడిన వైశ్యులు ప్రస్తావింపబడినారు. ఒక క్రీ॥ శ॥ 1164 నాటిదైన శాసనమున 'నూటరెండు గోత్రముల వైశ్యుల'ని వర్ణింపబడినది.[15] ఈ నూటరెండు గోత్రముల ప్రాముఖ్యత వాసవీకన్యతోడి వారి అగ్నిప్రవేశము నుండి మాత్రమే నేర్పడినది. పై చారిత్రకాంశములు వాస్తవము

లయినచో క్రీ॥ శ॥ 1328 ప్రాంతమున జరిగెననుకొనుచున్న ఉదంతములోని నూటరెండు గోత్రములు సుమారు నాటికి రెండు శతాబ్దముల ముందు ఎట్లు ప్రస్తావనకు వచ్చుట సంభవించును ? కనుక పురాణస్థ విషయము ఆనాటిది కాదని ప్రాచీన విషయమే తత్కాలమున వైశ్యుల సాంఘిక కులాచారముల కట్టడిచేయు సందర్భమున పునః ప్రస్తావించిరని సరిపెట్టుకొనవలసి యుండును. అట్లైన యీ పురాణ కథతో నెట్టి సంబంధము లేని పెదచెఱుకూరు శిలాశాసన, ఇక్షుగ్రామ తామ్ర శాసనములందు యిదే కాలమునయున్నట్లు చెప్పబడిన విష్ణువర్ధనుని విషయమేమి। ఆ శాసనస్థ విషయములు కూడ త్రోసిపుచ్చ వలసినవా?॥

అసలీ కాలమున ఏ విష్ణువర్ధనుడు లేడని భావించినచో యిన్ని శాసనస్థ విషయముల నుపేక్షింప వలసి వచ్చును. అది జరుగరాని పని. ఉండెనని సమర్థించినచో కాలమును బట్టి అతడు విధిగా పురాణ కథతో ముడిపడి యుండుటచే దాని చారిత్రక ప్రామాణికత నంగీకరింపవలసి యుండును. అట్లంగీకరించుటకు పైన పేర్కొనిన ఘంటసాల శాసనము వంటి అభ్యంతరములు కొన్ని కలవు. కనుక కన్యకాపురాణమునందలి చాళుక్య విష్ణువర్ధనుడెవ్వరో గుర్తించుటకు ప్రస్తుతాధారములు చాలవు.

## అ ధ స్సూ చి క లు


1. శ్రీ వాసవ కన్యకా పురాణము, ఆర్యవైశ్య యువజనసంఘ ప్రచురణము (పెనుగొండ) 1951.
2. ఆంధ్ర కవుల చరిత్ర, పే. 221
3. ఆంధ్ర కవి తరంగిణి, తొమ్మిదవ సంపుటము, పే. 206
4. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక, పే. 143
5. భారతి, 1964, మే, పే. 29
6. ఎస్. ఐ. ఐ. వాల్యూమ్ X, నెం. 30737
7. ఎస్. ఐ. ఐ. వాల్యూమ్ VI, నెం. 202; ఎ. ఆర్. ఇ. నెం. 234 ఆఫ్ 1897; భారతి, 1972, సెప్టెంబరు, పే. 13
8. భారతి, 1972, సెప్టెంబరు, పే. 13
9. భారతి, 1930, అక్టోబరు, పే. 14
10. ఎ. ఆర్. ఇ. సి. పి. నెం. 13 ఆఫ్ 1961-62; సి. పి. నెం. 1 ఆఫ్ సువెల్ ఎ. ఆర్. ఇ. 1890, పు. 2
11. "ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రదేశ" వాల్యూమ్ II, పార్ట్ I, పే. 238
12. భారతి, 1972, సెప్టెంబరు, పే. 13
13. "హిస్టరీ ఆఫ్ ఆంధ్ర కంట్రీ - సబ్సిడియరీ డయినస్టీస్ ఎ. డి. 1000 - 1500", జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. వాల్యూమ్ XXI, పే. 77
14. ఎ. ఆర్. ఇ. సి. పి. నెం. 13 ఆఫ్ 1961-62
15. ఎ. ఆర్. ఇ. నెం. 851 ఆఫ్ 1917, పారా 84




డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి

# సుమతి శతకము

సుమతి శతకము సుప్రసిద్ధమైన శతకము. సూక్తిసుందరమైన సువర్ణ పథకము. ధారాశుద్ధికల పద్య స్తబకము. మారిన సమాజము నందును మననము చేయఁదగిన పద్యములు సమధికము. వీధిబడులు మొదలు విశ్వవిద్యాలయముల వఱకు సుమతి శతకము పఠనపాఠనము లందు కలదు. అంతేకాదు. ఆబాల గోపాలము కంఠస్థము చేయునది. ఉపరి, వేమన శతకము వలె సుమతి శతకము తెల్లదొరలను మురిపించినది. తమిళ కవులను చవులూరించినది. సంస్కృత పండితులను సమాకర్షించినది. 1832వ సంవత్సరము నందు సి. పి. బ్రౌనుగారి ఆంగ్లానువాదము సాగినది.[1] 1973వ సంవత్సరము నందు ప్రకటింపఁబడినది. 1904వ సంవత్సరము నందు సమరపురి మొదలియార్ తమిళానువాదము వెలువడినది.[2] 1928వ సంవత్సరమునకు పూర్వము సంస్కృతానువాదము కలదు.[3] మఱల 1963వ సంవత్సరమునందు యస్. టి. పి. వరదాచార్యులుగారి సంస్కృతానువాదము ముద్రింపఁబడినది.

సుమతి శతకము ప్రథమతః 1868వ సంవత్సరము నందు ప్రకటింపఁబడినదట![4] 1877వ సంవత్సరమునందు రంగనాయకులు, 1889వ సంవత్సరమునందు జి. బాలగురునాథయ్య, అదే సంవత్సరము నందు పి. శల్వరాజమొదలి, 1910వ సంవత్సరము నందు అజ్ఞాతవ్యక్తి, 1912వ సంవత్సరము నందు జి. వి. రామానుజులు నాయుడు, అజ్ఞాత సంవత్సరము నందు నరసింహులు శెట్టి ప్రకటించిన సుమతి శతకము[5] ప్రసిద్ధ సుమతి శతకమే అగును. 1928వ సంవత్సరము నందు వావిళ్ళ వారి ప్రచురణము వచ్చినది. అది మొదలు 1982వ సంవత్సరము వఱకు ముద్రితములైన, పునర్ముద్రితములైన సుమతి శతకములు పుష్కలముగ కలవు. అందు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రకటించిన సుమతి శతకమును కలదు. అయినను సుమతి శతకము కర్తృకాలములు, స్వరూప స్వభావములు సునిశ్చితము కాలేదు.

1924వ సంవత్సరమునకుముందు సుమతి శతకమును సుమతి అను జైనముని రచించెనని వంగూరి సుబ్బారావుగారు ప్రకటించుట, బండారు తమ్మయ్యగారు ఖండించుట, వంగూరి సుబ్బారావుగారు ఉపసంహరించుకొనుట జరిగినది.[6] 1928వ సంవత్సరమునకు ముందు సుమతి శతకము సుమతి అను జైనభిక్షువునకు అంకితమని కూడ అనుమానించిరట.[7] అది నిమిత్తముగ 1973వ సంవత్సరము నందు సుమతి శతకము జైనకవికృతము కావచ్చునని చల్లా రాధాకృష్ణశర్మగారి అభిప్రాయము. అందుకు వారు చూపిన ఉపపత్తు లివి :[8]

1. ముద్రిత సుమతిశతకములలోని 'శ్రీరాముని దయచేతను' అను గ్రంథాది పద్యము బ్రౌను ప్రతి యందు గాని, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులందు గాని, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని ప్రతులందుగాని లేదు. తెలుగు గ్రంథములు శతకములతోపాటు శ్రీకారముతోడి గ్రంథాది పద్యమును కలిగియుండును గావున, ముద్రిత సుమతిశతక ప్రథమ సంపాదకుడు 'శ్రీరాముని దయచేతను' అను పద్యమును బహుశః చేర్చియుండును.

2. రామకృష్ణకవి నీతిసార ముక్తావళిలో తత్కర్త బద్దెన విష్ణుభక్తుడని తెలిపెను. సుమతి శతక కర్త బద్దెన అయిన 'మఱునైన విష్ణునైనన్' అను పద్యమునందు విష్ణు ప్రసక్తి విడిచి పెట్టి యుండును, ఈ పద్యము ముద్రిత సుమతిశతకములందు లేదు.

3. సుమతిశతక కర్త శైవ, వైష్ణవమత సంబంధమైన పురాణగాథలను వదలి, ఎక్కువ ఉపమానములను జీవితము నుండి గ్రహించెను. ఇది జైనకవి ప్రత్యేక లక్షణముగ కనఁబడును. తమిళవేదముగ ప్రసిద్ధమైన తిరుక్కురల్ అను తమిళ గ్రంథము నందు మత సంబంధమైన ఉపమానములు తక్కువ. దైనందిన జీవితము నుండి గ్రహించిన ఉపమానములు ఎక్కువ. కురల్ గ్రంథకర్త తిరువళ్ళువార్ జైనుడని సామాన్యముగ విశ్వసింతురు.

ఇవి బలవత్తరములైన ఉపపత్తులు కావు.

1. సుమతి శతకము తాళపత్ర ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందు, తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయము నందు మాత్రమే గాక, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయము నందు, హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందును కలవు. హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని 78 వ సంఖ్య కల తాళపత్రి గ్రంథము నందు

'శ్రీరాముని దయచేతను' అను పద్యము గ్రంథాదిని కలదు. అంతే కాదు. శ్రీకారముతోడి గ్రంథారంభము సర్వాంధ్ర గ్రంథ సామాన్యలక్షణమైనను, భాస్కర రామాయణములోని గ్రంథాది పద్యము శ్రీకారములేని 'రాముని శుభచరితములు' అను పద్యమని అప్పకవీయము నందు కలదు (73 వచ. 4 ఆ.) అయినను శ్రీకారముతోడి గ్రంథాది పద్యము ముద్రిత భాస్కరరామాయణము లందు కలదు. భాస్కరరామాయణ తాళపత్ర గ్రంథములందును కొన్నిట కలదు. కొన్నిట లేదు. 'రాముని శుభచరితములు' అను పద్యము గ్రంథాది పద్యముగ కల భాస్కర రామాయణ తాళపత్ర గ్రంథములును కలవు కనుక శ్రీకారముతోడి గ్రంథాది పద్యము ప్రక్షిప్తమైనను, నిక్షిప్తమైనను, కొన్ని ప్రతులలోని తదభావమును బట్టి సుమతి శతకము జైనకవికృత మనుట సంగతము కాదు.

1. సుమతి శతకము బద్దెనకృత మగుట సునిశ్చితము కాదు. బద్దెనకృతమైనను, బద్దెన విష్ణుభక్తుడైనను, 'మరునైన విష్ణువైనన్' అను పద్యము నందు విష్ణుప్రసక్తి విడిచిపెట్టితీరవలసిన అవశ్యకము లేదు. అంతేకాదు. ముద్రిత సుమతి శతకము లందు లేని పద్యములు బ్రౌను ప్రతియందు మాత్రమే కాదు. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయము లోని అతి ప్రాచీనమైన తాళపత్ర గ్రంథము నందును కలవని 1953వ సంవత్సరము నందు బులుసు వేంకటేశ్వర్లు గారు సోదాహరణ వివరణము చేసిన విషయము కలదు. అది ముందు వివరింతును. సుమతి శతకము తాళపత్ర గ్రంథము లందు అగమ పాఠ్యములు, ఆదేశ కల్పములు అయిన పద్యములు కలవు. వేమన శతకము సహస్రాధికము, సుమతి శతకము శతాధికము. అధికపద్యములు ప్రక్షిప్తము లగుట సహజము. ఉపరి, సుమతి శతకము నందు 'అప్పిచ్చువాడు' అను పద్యము నందు 'ద్విజుండున్ జొప్పడిన యూర నుండుము' అని కలదు. కారణము పౌరోహిత్యము. అది జైనమత విరుద్ధము. కనుక సుమతిశతకము జైనకవి కృతము కాదనుటకు బ్రాహ్మణమతభక్తి నిర్ధారకసాధనము.

3. జీవితము నుండి ఎక్కువ ఉపమానములు గైకొనుట జైనకవికి మాత్రమే ప్రత్యేకలక్షణము కాదు. వేమనశతకము నందు, భర్తృహరి నీతిశతకము నందును దైనందిన జీవితములోని ఉపమానములు బహుళము. తిరుక్కురల్ కూడ నీతి విషయికము. తిరువల్లువార్‌ను అతనికాలమునుండి బౌద్ధులు బౌద్ధుడని, జైనులు జైనుడని, శైవులు శైవుడని, వైష్ణవులు వైష్ణవుడని వ్యవహరించుట కలదు.9 దైనందిన జీవితము నుండి ఉపమానములు గ్రహించుట మతపరము కాదు. నీతి నిష్ఠము. కనుక సుమతి శతకము జైనకవి కృత మనుటకు ఉపమాన సామగ్రి ఉపబలక సాధనము కాదు.

మొత్తముమీద సుమతిశతకము జైనకవి కృతము కాదు.

1910 వ సంవత్సరము నందలి మానవల్లి రామకృష్ణకవి గారి సమన్వయము నందు గమనింపవలసిన అంశములు అయిదు కలవు.10

1. నీతిశాస్త్ర ముక్తావళిలోని ప్రథమ పద్యము సుమతి శతకము బద్దెనకృత మనుటకు అవకాశము.

2. నీతిశాస్త్ర ముక్తావళిలోని ప్రథమ పద్యము కవిగారికి లభించిన అయిదు నీతిశాస్త్రముక్తావళి ప్రతులందును - ఒక్క నీతిశాస్త్రముక్తావళి ప్రతి యందు మాత్రమే కలదు.

3. సుమతి శతకము కర్త భీమకవి అని లోక ప్రవాదము కలదు.

4. సుమతి శతకము తాళపత్ర గ్రంథము లందు సుమతి శతకము భీమన రచించినట్లు కల పద్యము కలదు.

5. సుమతి శతకమునకు, నీతిశాస్త్రముక్తావళికి పాకభేదము, పలుకుబడి భేదము, శైలీభేదము కలదు.

1924వ సంవత్సరము నందలి వంగూరి సుబ్బారావు గారి అభిప్రాయము నందు గమనింపవలసిన అంశములు ఎనిమిది కలవు.11

1. సుమతిశతకము భీమకవి కృతమని కొన్ని లక్షణ గ్రంథము లందు కలదు.

2. ఒక లక్షణగ్రంథము నందు సుమతి శతకమునుండి ఉదాహరించిన పద్యము అప్పటి ముద్రిత సుమతిశతకములందు లేదు.

3. నీతిశాస్త్రముక్తావళి ప్రథమ పద్యము, ఆంధ్ర పరిశోధక మహామండలి వారు ప్రకటించిన నీతిసార ముక్తావళికి (నీతిశాస్త్ర ముక్తావళియే) మూలమగు మఱొక ప్రతి యందును లేదు.

4. సుమతి శతకము, నీతిశాస్త్రముక్తావళి భాష, పాకము, శైలి అనువానిని బట్టి ఎంతమాత్రమును ఏకకర్తృకములు కావు.

5. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయము లోని ఒక సుమతి శతకము తాళపత్ర గ్రంథము నందు ఒక పద్యమునకు 'బద్దెనరేంద్రా!' అను మకుటము కలదు.

6. బద్దెనకు 'భీమా!' అను బిరుదము కలదు.

7. సుమతి శతకము భీమనకృత మని కల పద్యము లిఖిత ప్రతి యందు కలదు.

8. వేములవాడ భీమకవి సుమతి శతకమునుండి కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహము నందు ఉదాహరించిన పద్యము సుమతి శతకము నందు కలదు.

1953వ సంవత్సరము నందలి బులుసు వేంకటేశ్వర్లుగారి అభిప్రాయము నందు గమనింపవలసిన అంశములు మూడు కలవు.12

1. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయములోని ఒక సుమతిశతక తాళపత్రి గ్రంథము నందు సుమతి శతకమున లేని పద్యములు కలవు. సుమతి శతక పద్యములు కొన్ని ఆ సుమతి శతక తాళపత్ర గ్రంథము నందు లేవు.

2. వేములవాడ భీమకవి గాని మఱియొక భీమకవి నామ ధేయుడు కాని, మఱియొక సుమతి శతకమును రచించెను.

3. నీతిసార ముక్తావళి ప్రథమ పద్యము మూడు ప్రతులు తిలకించినను కానరాలేదు. అందుచే 'నీతి శతకము'నకు బదులు 'సుమతి శతక' మనియు నుండవచ్చును.

1955వ సంవత్సరము నందలి చాగంటి శేషయ్య గారి చర్చాసారము నందు గమనింపవలసిన అంశములు కలవు.13

1. నీతిశాస్త్ర ముక్తావళిలోని ప్రథమ పద్యము శ్రీరామ విలాస గ్రంథమాల వారు ప్రకటించిన బద్దెన నీతులను (నీతిశాస్త్ర ముక్తావళియే) ముద్రిత గ్రంథము నందు లేదు.

2. సుమతి శతకము వేములవాడ భీమకవి కృతమని కూచి మంచి తిమ్మకవి ఉదాహరించిన పద్యము ప్రసిద్ధ సుమతి శతకము నందు కలదు.

3. సుమతి శతకములు రెండు కలవు. అందు ధారాశుద్ధి లేని పద్యములు బద్దెన సుమతి శతకములోనివి.

ఇంతకు మిక్కిలి ఇతరుల అభిప్రాయము లందు గమనింప వలసిన అంశములు లేవు. అవి పయి అంశముల ప్రతిధ్వనులే.

ఇంతకు సుమతి శతకము బద్దెన కృత మనుటకు గల అవకాశము లివి –

1. నీతిశాస్త్రముక్తావళిలోని ప్రథమ పద్యము.

2. ఒక సుమతి శతకము ప్రతిలోని ఒక పద్యమునకు గల బద్దెనరేంద్ర మకుటము.

3. బద్దెనకు గల భీమ బిరుదము.

4. ధారాశుద్ధి లేని పద్యములు.

ఇందు మొదటి అంశము మూలస్తంభము. అది సరియైన పునాదిలేని స్తంభమైనచో, సుమతి శతకము బద్దెనకృత మన భవనరాజమెల్ల కుప్పకూలిపోవును. నేల సపాట మగును.

1. మానవల్లి రామకృష్ణ కవి గారు 1910 వ సంవత్సరము నందు నీతిశాస్త్ర ముక్తావళి ప్రకటించుటకు ఆధారములైన ప్రతులు అయిదు. వారికి 'లభించిన ఐదు ప్రతులలో (నీతిశాస్త్రముక్తావళి ప్రథమ పద్యము) నొక్కదానిలో మాత్రమే యున్నది. రెండు ప్రతులలో నాద్యంతములు లేవు. ఒక్కటి యేకాశ్వాసరూపముగాను, జెన్నపురి భాండాగార ప్రతి యాశ్వాసత్రయ రూపముగా నున్నది' అని కవిగారి కంఠోక్తి.14 ఇందు నాలుగు ప్రతుల వివరములు కలవు. అయిదవ ప్రతి అనుబంధములోని ఆత్మకూరి ప్రతి. అది కవిగారికి 'అమరచింత సంస్థానాధీశ్వరులగు శ్రీమంతు రాజా ముక్కర సీతారామ భూపాల బహద్దరు వారు' ఇచ్చిన 'కాగితపు సంపుటము' లోని 'బద్దెన రాజనీతి'.15

కవిగారు నీతిశాస్త్రముక్తావళి ప్రకటించు నాటికి (1910) మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందు బద్దెన 'నీతి సారము' నకు రెండు తాళపత్ర గ్రంథములు కలవు. రెండును అసమగ్రములు. ఒకటి సటీకము. తంజాపూరు సరస్వతీ మహలు గ్రంథాలయము నందు బద్దెన 'రాజనీతి'కి రెండు తాళపత్ర గ్రంథములు కలవు. రెండును సమగ్రములు. ఒకటి దేవ నాగర లిపి లిఖితము. 1933 వ సంవత్సరమునకు పూర్వము శ్రీరామ విలాస గ్రంథమాల వారు ప్రకటించిన బద్దెన నీతులకు మూలము తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయములోని తాళపత్రి గ్రంథములు.16 ముద్రిత గ్రంథము నందు (బద్దెన నీతులు) నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము లేదు. అనగా తంజావూరుసరస్వతీ మహలు గ్రంథాలయములోని 'రాజనీతి' తాళ పత్రి గ్రంథము లందు నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము లేదని అవగాహన మగును. కవిగారు నీతిశాస్త్ర ముక్తావళి ప్రకటించిన పిదపరి '8-7-1913వ తేదీన శిథిల తాళపత్రి గ్రంథము నుండి పునర్లిఖితము' చేసిన మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండా గారములోని కాగితపు ప్రతి 'ప్రథమాశ్వాసము 48వ పద్యము

తుద మొదలుకొని యున్నది'.17 తన్మూలమైన అసమగ్ర 'నీతిసార' తాళపత్ర గ్రంథము లందు 'నీతిశాస్త్ర ముక్తావళి' ప్రథమ పద్యము ఉండుట నిరవకాశము. ఆత్మకూరి ప్రతి యందు అనగా అమరచింత సంస్థానాధిపతి కవిగారికి ఇచ్చిన కాగితపు సంపుటములోని 'బద్దెన రాజనీతి' యందును నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము లేదు. కవిగారికి అందుబాటులోని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'నీతిసార' ప్రతులు రెండిటియందు, తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయములోని 'రాజనీతి' ప్రతులు రెండిటి యందు, అమరచింత సంస్థానాధిపతి ఇచ్చిన కాగితపు సంపుటములోని 'రాజనీతి' ప్రతి యందు, మొత్తము అయిదు ప్రతు లందును మాత్రమేగాక, 1924వ సంవత్సరమునకు పూర్వము ఆంధ్ర పరిశోధక మహామండలి వారు ప్రకటించిన నీతిసార ముక్తావళికి మూలమైన ఆరవప్రతి యందును (బహుశః కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయములోని నీతిసంగ్రహము) లేని నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము కవిగారికి ఎక్కడ లభించినదో దురవగాహము. కవిగారు ప్రకటించిన ప్రతి గ్రంథము నందును వారి మాటలలోనే వారి 'కర కౌశలము'18 కలదు.

ఇంతకు నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్య మిది -

'శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరవళనోపలబ్ధజయలక్ష్మీ సం
భావితుఁడ సుమతి శతకముఁ
గావించిన ప్రోడఁ గావ్యకమలాసనుడన్'. 1

ఇట ఆత్మకూరి ప్రతిలోని పాఠభేదముని కవిగారు పృథక్కరించిన పద్యమిది -

'వరుసడి నాంధ్ర భాషగను బద్దెన నీతియు సంస్కృతంబుగా
పరగ ప్రతాపరుద్ర నరపాలునితో రచియింపబడ్డ యా
నరవరు నీతిసారము వినం జదువం గడు మంచిదంచు చె
ప్పెర కవి నీతి పద్ధతులు జేసె వినోదము బాలబోధకున్'

ఇది హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందు 1970వ సంవత్సరము నందు భద్రపఱిచిన, కవిగారి బద్దెన రాజనీతి, మడికి సింగన సకల నీతిసమ్మతము కలిసియున్న కాగితపు పుస్తకములోని పద్యము.

ఇందు 'సంస్కృతంబుగా' అనుచోట 'సంస్కృతంబుతో' అని, 'చెప్పెరకవి' అనుచోట 'చెప్పెరఁగ..' అని కవిగారి పరిష్కరణము.

హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని కాగితపు పుస్తకము నందు బద్దెన రాజనీతి మూడు అధికారములుగ కలదు. మూడవ అధికారమునకు మొదటి పద్య మిది -

'భానుకుల భూషణుండను
భూనుత విక్రముడ బద్దెభూపతి కవి స
న్మానితుడ లోకనీతుల
నూనోక్తి నొనర్తు నధిక నూత్నప్రౌఢిన్'

రెండవ అధికారమునకు మొదటి పద్య మిది -

'శ్రీతస్వీ చిత్తజరూ
పాతిశయోన్నతుఁడ బద్దెనాఖ్యుడ బుధసం
ప్రీతిమనస్కుడ సేవక
నీతులు రచియింతు సభ మనీషులు పొగడన్'

ఇట్లు మొదటి అధికారమునకు మొదటి పద్య మిది -

'రాజవరమకుటమణిగణ
పూజిత పదయుగుడ హేమభూభృద్ధైర్య
భ్రాజితుడ బద్దెనాఖ్యుడ
రాజోచిత నీతులొప్ప రచియింతు దగన్'

మొదటి అధికారము మొదటి పద్యమునకు ముందు పయి 'వరువడి' అను పద్యము. దానికి ముందు 'రాజనీతి యు నసద్రాజ లక్షణము' అను సీస పద్యము కలవు. అవి బద్దెన కృతములు కావలసిన ఆవశ్యకము లేదు. 'వరువడి' పద్యము లోని 'కవి' కృతములు కావచ్చును. అన్యకవి కృత మగు 'వరువడి' అను పద్యమునకు బదులు 'శ్రీవిభుఁడ' అను పద్యము కవిగారు ప్రకటించిన నీతిశాస్త్రముక్తావళి యందు మాత్రమే కలదు. అందుకు హేతువు కలదు. బద్దెన రాజనీతి అను గ్రంథములోని మొదటి అధికారమునకు మొదటి పద్యము 'రాజవరమకుట' అను పద్యము. అది శ్రీకారములేని పద్యము. శ్రీకారముకల పద్యము రెండవ అధికారమునకు మొదటి పద్యము. అది మొదటి అధికారమునకు మొదటి పద్యము చేయుట కుదురదు. అందు 'సేవకనీతులు' కలవు. ఇందు 'రాజనీతులు' కలవు. అయినను శ్రీకారముతోడి పద్యము గ్రంథాది పద్యమగుట అర్వాచీనకాలము నందు సర్వాంధ్రగ్రంథ సామాన్య లక్షణము. లేని గ్రంథములకు కల్పించుట కలదు. సుమతి శతకము నందు 'శ్రీరాముని దయచేతను' అను పద్యమువలె బద్దెన రాజనీతి యందు 'శ్రీవిభుఁడ' అను పద్యము కల్పింపవచ్చును. సుమతి శతకము తాళపత్ర గ్రంథము నందు 'శ్రీరాముని దయచేతను' అను పద్యము కలదు గావున అది ప్రాచీన ప్రక్షిప్తము.

బద్దెన రాజనీతి తాళపత్రగ్రంథము లందు మాత్రమే గాక కాగితపు పుస్తకము నందును(1901) 'శ్రీవిభుఁడ' అను పద్యములేదు గావున ఇది నవీన ప్రక్షిప్తము. అంతేకాదు. బద్దెన రాజనీతిలోని రెండవ అధికారమునకు మొదటి పద్యమైన 'భానుకుల' అను పద్యము ఏకాశ్వాసరూపముగ కవిగారు ప్రకటించిన నీతిశాస్త్ర ముక్తావళి యందు లేవు. కాని 'ఆత్మకూరి సంస్థానాధీశ్వరుల వారి ప్రతిలో నున్న యధిక పద్యములు. ఇవి మా నాలుగు ప్రతులలోను లేవు' అని ఉదాహరించిన పద్యములందు కలవు. (126, 128). కవిగారి నాలుగు ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము లోని రెండు ప్రతులు, తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయములోని రెండు ప్రతులు కాక, మఱొకటి అనుటకు మఱి ఆ మఱొక ప్రతి జాడ కానరాదు. కనుక కవిగారు ప్రకటించిన నీతి శాస్త్ర ముక్తావళిలోని ప్రథమ పద్యము కవిగారి కరకౌశలము కావచ్చును. కవిగారి కరకౌశలము కాక ప్రత్యంతర పేశలమైనను అందు 'నీతిశతకము గావించిన ప్రోడ' అని యుండవచ్చును. నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము సుమతి శతకము బద్దెనకృత మనుటకు పునాది కట్టుదిట్టములేని మూలస్తంభమే. కనుక, కవిగారు ప్రకటించిన నీతిశాస్త్ర ముక్తావళి ప్రథమ పద్యము సుమతిశతకము బద్దెనకృత మనుటను నిర్ధారక సాధనము కాదు.

2. సుమతి శతకము నందు ఒక పద్యము ఇట్లు కలదు.

'పతికడకుఁదన్నుఁ గూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురు కడకున్
సుతుకడకు రిత్త చేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ' - 70

ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయములోని సుమతి శతకము తాళపత్ర గ్రంథమునందు ఇట్లు కలదు.[19]

'సుతుకడకు తన్నుఁగూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురు కడకున్
మతియుతులు రిత్తచేతుల
పతికడకుంబోవఁజనదు బద్దెనరేంద్రా!'

ఇది హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని బద్దెన రాజనీతి యందు ఇట్లు కలదు.

'సుతుకడకును దనకూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
పతికడకు రిత్తచేతుల
మతిమంతుల కేగజనదు మహి బద్దెనృపా'

ఇందు సుమతి శతకములోని పద్యముకంటె, సుమతి శతక ప్రత్యంతరములోని పద్యముకంటె బద్దెన రాజనీతిలోని పద్యము సుబద్ధము. సందర్భశుద్ధము. సుతుని కడకు, సతికడకు, వేల్పుకడకు,గురువుకడకు, పతికడకు అనగా రాజుకడకు రిక్తహస్తములతో మతిమంతులకు ఏగుట చనదని హెచ్చరిక. కనుక బద్దెన రాజనీతిలోని పద్యము కాలాంతరమున సుమతి శతక పద్యముగ మాఱినట్లు, సుమతి శతక ప్రత్యంతరము నందు దూఱినట్లు కరతలామలకము.

ఇట్టి వింకను కలవు.

'నయమన్నఁ బాలుద్రావరు
భయమన్న నమేధ్యమైన భక్షింతురు నా
నయము భయంబులలోపల
భయమే నయమండ్రు బుధులు బద్దెనరేంద్రా!' - 112 ప.

ఇది కవిగారు ప్రకటించిన నీతిశాస్త్ర ముక్తావళిలోని పద్యము. మఱి, సుమతి శతకము నందు ఇట్లు కలదు.

'నయమున బాలుం ద్రావరు
భయమున విషమ్మునైన భక్షింతురుగా
నయమెంత దోసకారియొ
భయమే చూపంగవలయు బాగుగసుమతీ' - 64 ప.

ఇది బ్రౌను ప్రతి యందు ఇట్లు కలదు.

'నయమన్న పాలు ద్రావరు
భయమన్న నమేధ్యమైన భక్షింతురుగా
నయమెంత దోసకారియొ
భయమే చూపంగవలయు బ్రజలకు సుమతీ'

ఇందు 'నయమెంత దోసకారియొ భయమే చూపంగ వలయు' అను సుమతి శతక సూచనము కంటె, 'నయము భయంబులలోపల భయమే నయమండ్రు బుధులు' అను నీతిశాస్త్ర ముక్తావళి భావనము సమంజసము. కనుక బద్దెన రాజనీతి పద్యము మాఱినట్లు, సుమతిశతకము నందు, సుమతిశతక ప్రత్యంతరము లందు దూఱినట్లు కరబదరకము.

'రిపుపొత్తు పాముపొత్తును
గపటుండగు విప్రుపొత్తు గడుసరిపొత్తున్
విపరీత భార్య పొత్తును
నెపమునఁదావిడువకున్న నేరము వచ్చున్'

ఇది చెలికాని లచ్చారావు గారి 'బద్దినీతులు' అను పుస్తకము లోనిది.[20] మఱి ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయములోని సుమతిశతకము తాళపత్ర గ్రంథము నందు ఇట్లు కలదు.[21]

'రిపుపొత్తు పాముపొత్తును
గపటాత్ముని మిత్రపొత్తు గడునరి పొత్తున్
విపరీతి భార్యపొత్తును
ఆపదష్టము చేతవచ్చు నదిగో సుమతీ'

ఇందు 'బద్దినీతులు' లోని పద్యము సహజము. సుమతి శతక ప్రత్యంతరములోని పద్యము కృతకము. కనుక బద్దెన రాజనీతి పద్యము మాఱినట్లు, సుమతి శతక ప్రత్యంతరము నందు దూఱినట్లు సుస్పష్టము.

పయి మూడు సందర్భములను పరికించిన బద్దెన రాజనీతి పద్యములు సందర్భ శుద్ధిలేకుండ, సామంజస్యము లేకుండ, సహజత్వము లేకుండ అర్థరహితముగను మార్పుచెంది సుమతిశతక ప్రతులందు చేర్పబడినట్లు స్వయం వేద్యమగును. కనుక బద్దెన రాజనీతి, సుమతిశతకము ఎంతమాత్రమును ఏకకర్తృకము కాదు. మార్పులకు చేర్పులకు కారణము లేఖకపాఠకులు మాత్రమే కావలయును. కనుక సుమతిశతక ప్రత్యంతర పద్యమునకుగల బద్దె నరేంద్ర మకుటమును సుమతిశతకము బద్దెనకృత మనుటకు నిర్ధారకసాధనము కాదు. అంతేకాదు. సుమతిశతక లేఖక పాఠక భ్రమ ప్రమాదములుసుమతిశతకము బద్దెనకృతముకాదనుటకు సాధనము.

3. కవిగారు ప్రకటించిన నీతిశాస్త్రముక్తావళి మొత్తము మీద నాలుగు పద్యములకు మాత్రము 'కొమరురభీమ' అను మకుటము కలదు (50, 60, 77, 135). అది మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని కాగితపు ప్రతియందు ఒక పద్యమునకు 'కొమరున భీమ' అని కలదు.[22] 'కొమరున' అను పద్యమునకు అర్థము కలదు గాని పద్యము లందు గణమాత్ర ప్రయోజని అగును. 'మూరురాయరగండ' అను బిరుదము వలె 'కొమరురభీమ' అనునది కూడ బిరుదము. అది బద్దెన స్వార్జితము కాదు. పితృపితామహార్జితమైన ప్రాచీనబిరుదము. అందలి భీమ శబ్దమునుబట్టి, అది నాలుగు పద్యములందు కల రాజనీతి విషయమున భీమకవి కృతమను వ్యవహారము కలుగలేదు. సుమతి శతక విషయమున కలుగుననుట సుసంగతము కాదు. కనుక బద్దెనకు గల 'కొమరురభీమ' అనుబిరుదముకూడ సుమతి శతకము బద్దెనకృత మనుటకు నిర్ధారకసాధనము కాదు.

4. సుమతి శతకము నందు లేని పద్యములు కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయములోని తాళపత్రగ్రంథము నందు అధికముగ కలవు. అవి కొన్ని, అందును లేనివి బహుశః మఱికొన్ని మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములోని బ్రౌను ప్రతియందు కలవు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందు సుమతి శతకము తాళపత్ర గ్రంథములు పది కలవు.[23] అవి బ్రౌను ప్రతికి ఆధారములు. బ్రౌనుప్రతి యందు మొత్తము 150 పద్యములు కలవు. అందు 46 పద్యములు సుమతి శతకము నందు లేవు. లేని పద్యములు చాలవరకు ధారాశుద్ధిలేని పద్యములు. కనుక రెండు సుమతి శతకములు కలవనుటకు, ధారాశుద్ధిలేని పద్యములు కల సుమతి శతకము బద్దెనకృతమనుటకు అవకాశము కలిగినది. కాని రెండు భిన్నములైన సుమతిశతకములు లేవు. భిన్నములైన పద్యములు మాత్రమే కలవు. అంతేకాదు. బద్దెన రాజనీతి పద్యములు ధారాశుద్ధిలేనివి కావు. సుమతిశతక పద్యముల ధారాశుద్ధి వంటి ధారాశుద్ధి కల పద్యములు తక్కువ. ఎక్కువ పద్యములు తద్భిన్నమైన ధారాశుద్ధి కలవే. కనుక ధారాశుద్ధిలేని పద్యములు కల సుమతిశతకము బద్దెన కృతమనుట భావ్యము కాదు. అంతేకాదు. అసలు రెండు సుమతి శతకములు ఉండవలసిన అవశ్యకము లేదు. ధారాశుద్ధిలేని పద్యములు, సందర్భశుద్ధిలేని పద్యములు కాలక్రమము నందు కల్పితములు కావచ్చును. అవి సుమతిశతక ప్రత్యంతరము లందు ఆగమ ప్రాయములు, ఆదేశ కల్పములు కావచ్చును. ఆ పద్యములకు కర్త ఒక్కడే కావలసిన అవశ్యకము లేదు. ఎందఱో మహానుభావులు కావచ్చును. అందఱును అజ్ఞాత మహాకవులు! కనుక ధారాశుద్ధిలేని పద్యములును సుమతి శతకము బద్దెన కృతమనుటకు నిర్ధారక సాధనము కాదు.

మొత్తము మీద సుమతిశతకము బద్దెన కృతమనుటకు నిర్ధారక సాధనము లేదు. అంతేకాదు. సుమతిశతకము, బద్దెన రాజనీతి (నీతిశాస్త్ర ముక్తావళి, నీతిసార ముక్తావళి, బద్దెన నీతులు) తారతమ్య పరిశీలనము చేసిన, సాదృశ్యము రేఖామాత్రముగ, భేదము శాఖాప్రాయముగ స్వయం వేద్యమగును. పాకభేదము, శైలీభేదము, భాషాభేదము మాత్రమేగాక, పూర్వోక్తమైన పద్యభేదమును సుమతిశతకము బద్దెన కృతము కాదనుటకు నిర్ధారక సాధనములు. కనుక సుమతి శతకము బద్దెనకృతము కాదు.

ఇక సుమతి శతకము వేములవాడ భీమకవి కృతమనుటకు గల ఆధారములివి :

1. జనశ్రుతి

2. లాక్షణికోదాహృతి

3. సుమతి శతకము భీమన కృతమని కల పద్యము.

1. ఇందు జనశ్రుతి స్వతఃప్రమాణము కాదు. ప్రమాణాంతర సంవాదము లేనిచో పరిత్యాజ్యము. ప్రమాణాంతరసంవాదము కలదేని పరిగ్రాహ్యము.

2. ఇక లాక్షణికోదాహృతి. ఇదికూడ స్వతః ప్రమాణము కాదు. జనశ్రుతి కంటె బలీయము. అంతేకాదు. ప్రమాణాంతర సంవాదము కలదేని ప్రామాణికము. ఉపరి, అన్యథా బాధకము కానిచో సాధకము.

సుమతిశతకము నందు లేదను లాక్షణికోదాహృతమైన పద్య మిది :24

'కాదన్నవాఁడె కరణము
వాదడచినవాఁడె పేడి వసుధేశుకడన్
లేదన్నవాఁడె చనవరి
గాథలు పెక్కాడువాఁడె కావ్యఁడుసుమతీ'

ఇది బ్రౌను ప్రతియందు ఇట్లు కలదు.

'కాదన్నవాడె కరణము
వాదడచినవాడె రెడ్డి వసుధేశుకడన్
లేదన్నవాడె చనవరి
గాథలు పెక్కాడువాడె కావ్యుడు సుమతీ' .29

ఇందు లక్షణ గ్రంథములోని 'వాదడచినవాఁడె పేడి' అను పాఠము కంటె, బ్రౌను ప్రతిలోని 'వాదడచినవాఁడె రెడ్డి' అను పాఠము అర్థవంతము. 'హి హు సెటిల్స్ ది డిస్ప్యూట్ ఈస్ ది జస్టిస్' అని బ్రౌను ఆంగ్లానువాదము కాని, రెడ్డి అనగా గ్రామాధికారి. మొదటిపాదములోని 'కరణము' నకు, రెండవ పాదములోని 'రెడ్డి' సయిదోడు. ఇప్పటి మున్సబు. ఇతర పద్యము లందు సుమతి శతకమున 'మున్సబు' అనుటకు 'కాపు' అని బహుధా కలదు. కనుక 'వాదడచినవాఁడె కాపు' అని కవిపాఠము కావలయును.అది ప్రత్యంతరములందు కలదేమో అన్వేషణీయము. అంతేకాదు. పద్యము నందు'దథ' ప్రాసము కలదు. అందుకే లాక్షణికోదాహరణము. అది కూడ కవి పాఠము అగునోకాదో ప్రత్యంతరము లందు అన్వేషణీయము. ఇంతకు లాక్షణికోదాహృతమైన పద్యము 1924వ సంవత్సరమునాటి సుమతి శతకము ముద్రిత గ్రంథము లందు లేకపోయినను 1832 వ సంవత్సరమునాటి లిఖిత గ్రంథము నందు కలదు. అనగా ప్రత్యంతరము లందు కలదని అర్థము. కనుక సుమతి శతకము భీమకవికృతము.

మఱి 1927 వ సంవత్సరము నందు నందిరాజు చలపతి రావు గారు ప్రకటించిన కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సార సంగ్రహము నందు ఇట్లు కలదు.

'ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోసముసుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ' - 162

'భీమకవి సుమతి శతకము'

ఇది సుమతి శతకము భీమకవికృత మనుటకు మూదల. ఆ భీమకవి చెదలువాడ భీమకవియా? అను సందేహము, మఱొక భీమకవి అను ఊహాగానమును అనావశ్యకము. వేములవాడ భీమకవియే అనుటకు నిదర్శనము కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము నందే కలదు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహము నందు 'భీమకవి చాటుధార' అని మఱొక రెండు పద్యములు ఉదాహరింపఁబడినవి. అవి వేములవాడ భీమకవి చాటుపద్యములని అన్యగ్రంథములకు సంవదించునవి. అంతేకాదు. ఒక పద్యము వేములవాడ భీమకవి శాపానుగ్రహ కథలోని యాథార్థ్యమును ప్రకటించునది. ఆ పద్యములివి:

నవ్వవిలాసరమ్య నలినంబని బాలముఖాబ్జసౌర భా
భివ్యసనంబునంబరచు భృంగకులోత్తమ తద్వియోగతా
పవ్యథఁ బ్రాణినిల్వదు కృపాగుణ మేర్పడ బ్రాహ్మణోనహం
'తవ్యయనంగ'నొప్పువచనస్థితికుంద కెఱుంగజేయుమా_78

'భీమకవి చాటుధార'

వేయి గజంబులుండఁ బదివేలు తురంగములుండ నాజిలో
రాయలఁగెల్చి సజ్జనగణంబునఁ బట్టముగట్టినట్టి యా
రాయకళింగగంగు నరిరాయ భయంకరుఁజూడ వేడ్క నే
బోయెద మీనమాసమున పున్నమఁబోయిన షష్టినాటికిన్_114

'భీమకవి చాటుధార'

ఇందు రెండవ పద్యము నందు రెండవ పాదమున 'పట్టము గట్టుకో వడిన్' అని, మూడు నాల్గుపాదము లందు 'కవిరాజ భయంకరమూర్తి చూడదాఁబోయెను' అని కల గురజాడ శ్రీ రామమూర్తిగారి పాఠము25 కంటె, మూడు నాల్గు పాదము లందు 'చూడఁగాఁబోయెను' అను వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణము కంటె26 'తిట్టుదాఁబోయెన' అను ఆరుద్రగారి దిద్దుబాటు27 కంటె 'పట్టముగట్టినట్టి యా రాయకళింగగంగు నరిరాయభయంకరుఁ జూడవేడ్కనేఁబోయెద' అను కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహములోని పాఠము అర్థవంతమైన కవిపాఠము. ఇందు అనుగ్రహము లేదు. అందు శాపములేదు. అది తిట్టు ఇదికోరిక. శాపానుగ్రహకథ కావలి వేంకటరామస్వామిగారి నాటికీ (1829) కల్పితము కావచ్చును. ఇంతకు 'భీమకవి చాటుధార'లని కూచిమంచి తిమ్మకవి ఉదాహరించిన పయి రెండు పద్యములును వేములవాడ భీమకవి చాటుపద్యములయినపుడు, ఆ కూచిమంచి తిమ్మకవియే 'భీమకవి సుమతిశతకము' అని ఉదాహరించిన 'ఏటికుమీ కసుగాయలు' అను పద్యము కల సుమతిశతకము వేములవాడ భీమకవి కృతమగుట నిరాఘాటము. కనుక సుమతిశతకము వేములవాడ భీమకవి కృతమగుటకు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహోదాహరణ పద్యత్రయము నిర్ధారక సాధనము.

గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరము నందు ఇట్లు కలదు –

'త్రాసును ధరలోఁ బడిసే
పేశయు నిది యొక్క రూప వివరింపంగా
పీసం బధికంబైనను
యోరమై యొక్కవంక నొరగును సుమతీ'

ఇది బ్రౌను ప్రతియందు ఇట్లు కలదు.

'త్రాసును వేశ్యయు నొక సమ
మౌ, సందేహింపవలవ, దవనీస్థలిలో
పీసం బధికం బెచ్చట
నోసరిగాకందు మొగ్గుచుండును సుమతీ'

ఇందు పద్య స్వరూపము మాఱిపోయినది. వేంకటకవి ఉదాహరణము 'శసప్రాసము'నకు లక్ష్యము. ప్రయోగరత్నాకరము కాలము పదునెన్మిదవ శతాబ్ది పూర్వార్ధము. బ్రౌనుప్రతి కాలము పందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధము. ఒక్క శతాబ్దికాలము నందు పద్యస్వరూపము మాఱిపోయినది. ఇంతకు ప్రయోగరత్నాకరము లోని పద్యముకాని, బ్రౌనుప్రతిలోని పద్యముకాని సుమతిశతకము నందు లేదు. కనుక ప్రక్షిప్తము కావలయును. అనగా సుమతి శతకము నందు గణపవరపు వేంకటకవి కాలము నాటికే ప్రక్షిప్తములు చేరినవని అవగాహనమగును. పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము లోని సుమతిశతకము పదునెన్మిదవశతాబ్ది పూర్వార్ధమునకు ప్రక్షిప్త బహుళమగుట, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమునకు పాఠాంతరసహస్ర మగుట సంభవమే.

3. సుమతి శతకము భీమనకృతమని సుమతిశతక ప్రతు లందు కల పద్యమిది :

శ్రీకరముగ భీమన మును
లోకమునకుఁ బొగడగా విలోకించి మదిన్
బ్రాకటముగ సుమతికి మతి
చేకూడఁగ సుమతినీతి చెప్పఁదొడంగెన్ – 111

ఇందు సుమతి శతక పద్యముల ధారాశుద్ధి ఇంచుకంతయును లేదు. ఇంతకంటె 'శ్రీరాముని దయచేతను' అను పద్యము నందు ధారాశుద్ధి కలదు. అది ప్రాచీన ప్రక్షిప్తమైనట్లు ఇదికూడ ప్రాచీనప్రక్షిప్తము కావలయును. ఎంత ప్రక్షిప్తమైనను కొంత నిజముండును. బహుళః జనశ్రుతినిబట్టి పయి పద్యము ప్రక్షిప్తము కావచ్చును. అనగా సుమతి శతకము భీమనకృత మను జనశ్రుతి ప్రాచీనకాలము నందు ప్రబలముగ కలదని అవగాహన మగును. అది నిర్నిమిత్తము కాఁజాలదు కదా! అంతేకాదు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహోదాహరణ పద్యత్రయము నిర్బాధకమైన నిర్ధారక సాధనము కనుక జనశ్రుతి నిరాధారము కాదు. ప్రక్షిప్త పద్యము ప్రామాదికము కాదు. జనశ్రుతిని బట్టి లాక్షణికోదాహృతి, లాక్షణికోదాహృతిని బట్టి ప్రక్షిప్తపద్యము ప్రత్యక్షమైనదనిన సుమతిశతకము భీమకవికృతము కాదనుటకు, మఱొక కవికృత మనుటకు మఱొక నిర్ధారక సాధనము కావలయును. అట్టిది మృగ్యము. కనుక సుమతి శతక ప్రత్యంతర కర్తృత్వ పద్యము సుమతి శతకము భీమకవికృత మనుటకు ఉపబలక సాధనము.

శతకము లందు అవతారికలు, ఆశ్వాసాంతగద్య పద్యములును ఉండవు. ఆద్యంత పద్యములే సర్వశతకముల కర్తృకాల నిర్ణయములకును ఆధారములు. ఆద్యంత పద్యములు సర్వప్రతు లందును సాధారణము కాదు. ఏవంవిధమైన శతక లక్షణమును బట్టి పరస్పరోప బలకములైన జనశ్రుతిని, లాక్షణికోదాహృతిని, కర్తృత్వ పద్యమును కాలదన్నుట మూలచ్ఛేది పాండిత్య ప్రకర్ష మాత్రమే కాఁగలదు. ఉపలబ్ధమైన సాధనములను బట్టి శతక కర్తృత్వ నిర్ణయము సేయుట అగతికము.

భీమన, భీమకవి - వేములవాడ మకవియే. ' మన ఛందము' అని, 'భీమన చెప్పె' నని లాక్షణికులు పేర్కొన్న కవి జనాశ్రయమును మల్లియరేచన రచించినట్లు వేములవాడ భీమ కవి రచించెనని పూర్వోక్తము.28 కనుక సుమతి శతక కర్తృత్వ పద్యములోని భీమన, సర్వలక్షణసారసంగ్రహ పద్య త్రయములోని భీమకవి వేములవాడ భీమకవియే. మఱొక భీమకవి అనుట ఊహాగానము. అది చరిత్ర కాదు. అనగా యథార్థముకాదు. అంతే కాదు. సుమతి శతకము బద్దెనకృతమా? వేములవాడ భీమ కవి కృతమా? అన్నదే సమస్య. బద్దెనకృతము కాదు. కనుకను, వేములవాడ భీమకవికృతము. ఇందుకు తదుభయుల కాలమును ప్రోద్బలకము. కవిత్వము సరే.

బద్దెన కాలము 1050వ సంవత్సర ప్రాంతమని మానవల్లి రామకృష్ణకవిగారి ఊహ.29 1240_1250 సంవత్సర ప్రాంతమని కందుకూరి వీరేశలింగముగారి సమన్వయము.30 1261వ సంవత్సర మని జయంతి రామయ్యపంతులుగారి అభిప్రాయము.31 పద మూడవశతాబ్ది మధ్యభాగమని వాగంటి శేషయ్యగారినిశ్చయము.32 ఇవి బద్దెనను బట్టి చేసిన నిర్ణయములు. బద్దెన రాజనీతిగ్రంథమును బట్టి చూచిన, అది తిక్కన భారతమునకు పూర్వగ్రంథమని భాసించును. తిక్కన భారతము నందు కైపు, త్రాసు మొదలగు అన్యదేశ్యములు కలవు. అది మొదలు కవుల గ్రంథము లందును అన్యదేశ్యములు ఒకటి, అర అయినను ప్రవేశించినవి. తిక్కనకు పూర్వము అన్యదేశ్య పదప్రయోగము లేదు. తదవకాశమును లేదు. అన్యదేశ్య ప్రయోగము చారిత్రికముగ పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము నుండి మాత్రమే సుసంభవము. మఱి బద్దెన రాజనీతి పద్యము లందు మచ్చునకైన అన్యదేశ్యములేదు. కనుక బద్దెన రాజనీతి రచనా కాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కంటె పూర్వము. పదమూడవ శతాబ్ది పూర్వార్ధము కావచ్చును. తిక్కన ప్రారంభించిన అన్యదేశ్య పదప్రయోగము పదునాల్గవ శతాబ్ది కవుల గ్రంథము లందు ప్రసిద్ధము. వేములవాడ భీమకవి మైలమ భీమన మీద చెప్పిన చాటుపద్యము నందు 'పట్టుకార్లు' అను పద్యము అన్యదేశ్య మని పూర్వోక్తము.33 మఱి సుమతిశతకము నందు బహుప్రతి బాహటమైన, ధారాశుద్ధి ధారాళమైన పద్యము నందు 'పట్టుకార్లు' కంటె స్పష్టమైన అన్యదేశ్య పదము కలదు.

'మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ' - 91

ఇందు 'చీటి' అను పదము ప్రాసఘటితము. అంతేకాదు. యతిమైత్రి ఖచితము. తదుభయకుశలమైన పర్యాయపదము మృగ్యము. కనుక నిర్ధారక ప్రయోగము. 'చీటి' అను పదము శుద్ధదేశ్యము కాదు. అన్యదేశ్యము. చిఠి లేక చిఠ్ఠీ అను ఉరుదూ పదము తెలుగుభాషలో చీటీ, చీటి అను పదములయినది. ఇది ప్రయోగించిన గ్రంథము పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము కంటె పూర్వము కాదు. పరము కావచ్చును. కనుక సుమతిశతకము రచనా కాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కంటె తదనంతరకాలిక మగుట తథ్యము. అది పదునాల్గవశతాబ్ది పూర్వార్ధము కావచ్చును. పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమును కావచ్చును. బద్దెన కాలము పద మూడవ శతాబ్ది పూర్వార్ధము కంటె అనంతరము కాదు. వేముల వాడ భీమకవికాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమని (1327_1400) పూర్వోక్తము.34 కనుక సుమతిశతకము బద్దెనకృతము కాదు. వేములవాడ భీమకవి కృతమే.

సుమతిశతకము వేములవాడ భీమకవి కృతమనుటకు 'చీటికి వ్రాలు'వలె, సుమతిశతకమునకు 'చీటి' అను నిర్ధారకప్రయోగము ప్రాణము.

సుమతిశతకము నందు బహుప్రతి బాహటమైన, ధారాశుద్ధి ధారాళమైన మఱొక పద్యము కలదు.

'నరపతులు మేరదప్పినఁ
దిర మొప్పఁగ విధవ యింటఁ దీర్పరియైనం
గరణము వైదికుఁడైనను
మరణాంతకమౌనుగాని మానదు సుమతీ' - 65

ఇందు కరణము వైదికుడైన, మరణాంతక మగునని ఇద మిత్థముగ కలదు. అనగా కరణము నియోగి కావలయునని అంతర్యము. అసలు కరణములు విశ్వబ్రాహ్మణులని, గోపరాజు రామప్రధాని కాలము నుండి నియోగి బ్రాహ్మణులు కరణములయి రని ఐతిహ్యము కలదు. 'ప్రాచీన లేఖనము లందీ శ్లోకము లగ పడుచున్న'వని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉదాహరించిన శ్లోకము లివి35_

'శ్రీమాన్ గణపతిర్భూపో గజపత్యన్వయోద్భవః
అస్మిన్ భూమండలే తస్య బహవస్సంతి మంత్రిణః
గోపరాజాన్వయో మాత్యో రామాఖ్యో గణకాగ్రణీః
గణకానాం హితార్థాయ సద్యశస్థానాయచ
తిష్ఠతశ్శశిమార్తాండౌ యావత్తావ ....

గోత్రశాస్త్రింబ రేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే
రక్తాక్ష్యబ్దే భాద్రదర్శే అర్క గ్రహణకాలికే
తేన రాజ్ఞాగ్రహోద్దానం కృష్ణవేణ్ణాతటే తథా
ధర్మమేతత్కలౌ యేన చాక్షిప్తం చ దురాత్మనా
షష్టివర్ష సాహస్రాణి జాయతే ఖరయోనిషు'

ఇది శాసనమువలె కలదు. ఇందు మొదటి శ్లోకము నందు గణపతి భూపుడు గజపతి వంశోద్భవుడని కలదు. అతని మంత్రి గణకాగ్రణి, గోపరాజు రామప్రధాని. రెండవ శ్లోకము నందు గోత్రశాస్త్రింబరేందు సంఖ్య కల శాలివాహన శతకము నందు రక్తాక్షి సంవత్సరమని కలదు. కనుక గోపరాజు కాలము 1067 + 78=1145 సంవత్సర ప్రాంతము కావలయును. కాని అప్పటికి గజపతి వంశోద్భవులు ఆంధ్రదేశము నందు పాలకులు కారు. అంతేకాదు. 1145వ సంవత్సరము రక్తాక్షి సంవత్సరము కాదు. సర్వధారి సంవత్సరము. రక్తాక్షి సంవత్సరము 1181వసంవత్సరము. మఱల 1241వ సంవత్సరము. అనగా పదమూడవశతాబ్ది మధ్య కాలము. పదమూడవశతాబ్ది మధ్యకాలము నుండి కళింగదేశాధి పతులయిన గాంగవంశ రాజులకు గజపతులను వ్యవహారము వచ్చినది.36 కాని గజపతులనబడిన గాంగవంశరాజు లందు గణపతి భూపుడు కానరాడు. అయినను, ఆ కాలమునందు కళింగదేశములోని 'పాకప్రసామంతు' లందు37 గజపతి వంశోద్భవుడైన గణపతి భూపుడు ఉండవచ్చును. అతనికి గోపరాజు రామప్రధాని గణకాగ్రణి కావచ్చును. కనుక గోపరాజు రామప్రధాని కాలము 1241వ సంవత్సరము కావలయును. అతని విషయము పయి శ్లోకము లందు మాత్రమేగాక, ప్రత్యేక మొక పద్యకావ్యము కలదు. దాని పేరు కరణీకోత్పవ మంజరి. కర్త ఊరె వీరభద్రకవి. అందలి పద్య మిది38_

దీనిధి గోపరాజు కులదీపకుఁడై తగు రామమంత్రి పాం
చానసులందు విశ్చలత నానిన యీ కరణీకధర్మముల్
పూనికఁ జేసి తీసి ద్విజపుంగవులం బిలిపించి యిచ్చెనౌ
నౌనని సంతసించిరి నిరంతరసౌఖ్యము నొందిరందఱున్.

ఊరె వీరభద్రకవి రచించిన కరణీకోత్పవమంజరిలోని కథ 'గజపతివంశ్యు డగు గణపతి భూపాలుని వలన గోపరాజు రామ ప్రధానుడు, విశ్వబ్రాహ్మణ వశమున నున్న కరణికములను నియోగి బ్రాహ్మణుల కిప్పించిన కథ' యే.39 ఇందును గణపతి భూపాలుడు గజపతి వంశ్యు డనియే కలదు. కనుక 'గజపత్యన్వయోద్భవః' అనునెడ శ్లోకము నందు 'గణపత్యన్వయోద్భవః' అగునేమో అను వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సంశయము 40 అనావశ్యకము. కనుక గజపతివంశోద్భవుడైన గణపతి భూపాలుని మంత్రి, గణకాగ్రణి అయిన గోపరాజు రామప్రధాని నియోగిబ్రాహ్మణులను కరణములుగ నియోగించిన కాలము పదమూడవ శతాబ్ది మధ్య భాగము కావలయును. అయిన వైదికులు కరణము లగుటకు మిఱికొంతకాలము పట్టును. కరణము లయిన వైదికుల వలన అనర్థకము వచ్చుటకు మఱికొంతకాలము పట్టును. అప్పుడు గాని 'కరణము వైదికుఁడైనను మరణాంతకము' అను ప్రతిపాదనమునకు అవకాశము గలుగదు. కలిగిన సుమతి శతకము రచనాకాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్థమగుట సంగతము'

మొత్తముమీద సుమతి శతకము వేములవాడ భీమకవి కృతము.

సుమతిశతకము రచనాకాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్థము.

పయి విచారణకు ఫలితాంశము లివి :

1. సుమతి శతకము జైనకవి కృతము కాదు.
2. సుమతి శతకము బద్దెనకృతము కాదు.
3. సుమతి శతకము వేములవాడ భీమకవి కృతము
4. సుమతి శతకము రచనాకాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము.

పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము రచనాకాలమైన సుమతిశతకము నందు పదమూడవశతాబ్ది పూర్వార్థము రచనాకాలమగు బద్దెన రాజనీతిలోని పద్యములు నిక్షిప్తములయినవి. అంతేకాదు. సుమతిశతకము ప్రత్యంతరములందు అజ్ఞాతకవుల అనుకరణ పద్యములు ప్రక్షిప్తములయినవి. ఉపరి, సుమతిశతక పద్యములు వేమన పద్యములందు (బ్రౌన్ప్రతి) నిక్షిప్తములయినవి. సుమతి శతకము ప్రభావము చేమకూర వేంకటకవి విజయవిలాసమునందు, ముద్దుపళని రాధికా సాంత్వనము నందును కలదు. ఇంత విశిష్టమైన, అంత ప్రసిద్ధమైన సుమతిశతకమునకు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందు పది, తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమునందు నాలుగు, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయము నందు అయిదు, హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునందు నాలుగు తాళపత్ర గ్రంథములు కలవు. అవి యెల్ల పరిశీలించి సుమతిశతకమునకు సంశోధిత ముద్రణమును ప్రకటించుకొనుట సాపేక్ష్యము.

సూ చి క లు

1. సుమతి శతకము, ప్రిఫేస్, పు. 7
2. అదే, పు. 11
3. నీతి శతక సంపుటము, 1, పు. 3
4. సుమతి శతకము, ప్రిఫేస్, పు.8
5. ఆంధ్ర వాఙ్మయసూచిక, పు. 231
6. శతక కవుల చరిత్రము, పుటలు 36, 45

7. నీతి శతక సంపుటము 1, పు. 1
8. సుమతీ శతకము, ప్రిఫేస్, పుటలు 9-10
9. ఎ హిస్టరీ ఆఫ్ తమిళ్ లిటరేచర్, పు. 66
10. నీతి శాస్త్రముక్తావళి, పీఠిక, పుటలు 5-6
11. శతక కవుల చరిత్రము, పుటలు 35-37, 41-42, 47
12. భారతీ వ్యాసములు, పుటలు 185-96
13. ఆంధ్ర కవితరంగిణి, మూడవ సంపుటము, పుటలు 11-18
14. నీతి శాస్త్రముక్తావళి, పీఠిక, పు. 5
15. సకల నీతిసమ్మతము, ద్వితీయముద్రణ, ఉపోద్ఘాతము, పు. 92
16. ఎ డెస్క్రిప్టివ్ కేటలాగ్ ఆఫ్ ది తెలుగు మాన్యుస్క్రిప్ట్స్ ఇన్ ది తాంజూర్ మహారాజా సెర్ఫోజీస్ సరస్వతీ మహల్ లైబ్రరీ, పు. 310
17. ట్రైనియల్ కేటలాగ్ ఆఫ్ ది తెలుగు మాన్యుస్క్రిప్ట్స్ ఇన్ ది గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాసు, సంపుటము 2, భాగము 3, పు. 610
18. మానవల్లి కవి రచనలు, పు. 76
19. శతక కవుల చరిత్రము, పుటలు 40-1
20. నీతిశాస్త్రముక్తావళి, పుటలు 48-9
21. భారతీవ్యాసములు, పు. 190
22. 17 వలె, పు. 609
23. యాన్ ఆల్ఫాబెటికల్ ఇన్‌డెక్స్ ఆఫ్ తెలుగు మాన్యుస్క్రిప్ట్స్ ఇన్ ది గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాసు, పు. 169
24. శతక కవుల చరిత్రము, పు. 35
25. కవి జీవితములు, పు. 12
26. చాటుపద్య మణిమంజరి, ప్రథమభాగము, పు. 77
27. సమగ్ర ఆంధ్రసాహిత్య, మొదటి సంపుటం, పు. 193
28. కవి జనాశ్రయము, కర్తృకాలములు
29. నీతిశాస్త్రముక్తావళి, పీఠిక, పు. 2
30. ఆంధ్రకవుల చరిత్ర, ప్రథమభాగము, పు. 245
31. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, రక్తాక్షి, పు. 273
32. ఆంధ్ర కవితరంగిణి, మూడవ సంపుటము, పు. 24
33. కవి జనాశ్రయము - కర్తృకాలములు, 34. అదే
35. చాటు పద్య మణిమంజరి, ప్రథమభాగము, పు. 62
36. హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పు. 36
37. అదే, పుటలు 151-2
38. 17 వలె, సంపుటము 13, పు. 2856
39. అదే.
40. చాటు పద్య మణిమంజరి, ప్రథమభాగము, పు. 62

## అనంతపురం జిల్లాలో మాల పున్నం పండుగ

భారతదేశం ఆర్ష సంస్కృతికి పుట్టినిల్లు. ప్రపంచంలోని సంస్కృతి అంతా భారతదేశము నుంచి వచ్చిందని చెప్పుతున్నారు. ఏలాగైతేనేమి ఏదేశ సంస్కృతి ఆ దేశానికి ఉన్నది. ఏ దేశ సంపద ఆ దేశ గొప్పతనాన్ని చాటుతుంది. తెలుపుతుంది.

సాధారణంగా ఒక జాతి జాతీయతకు పండుగలు ప్రతీకలు. అందుకే ఏ పండుగ - పబ్బం లేని దేశంకానీ, రాష్ట్రంకానీ, జాతికానీ, మతంకానీ అంటే అతిశయోక్తి కాదు. ప్రాచీన కాలంలో మన పండుగల స్వరూపంఎట్లా ఉండేదో తెలియదు. కానీ పండువు→పండుగు→పండుగ అనే పదానికి వ్యుత్పత్తిని ఆలోచించినపుడు పండు+అగు→ ఫలించు, పరిపూర్ణమగు, అనుభవ యోగ్యమగు అనే అర్థం తోస్తుంది. ఫలించుట కోరికల సాఫల్యానికి, ప్రగతికీ, సుఖానుభూతికీ చిహ్నం. అందుకే "పండుగ" అంటే కోరికలు ఫలించినవేళ, శుభవేళ, ఉత్సవవేళ అని మనం గ్రహించవచ్చు. (తెలుగువారి పండుగలు - పబ్బాలు: శ్రీమతి యశోదారెడ్డి, ప్రపంచ తెలుగు మహాసభలు 1981 ప్రత్యేక సంచిక.)

మాలపున్నమి లేక మహాలయ పౌర్ణమి పండుగను పల్లెప్రజలు 'మాల పున్నం' అంటారు. చదువుకొన్నవాళ్ళు "మహాలయ పౌర్ణమి" అంటారు. మాల పున్నానికి గాలి అంతా మడుగులో పడి పోతుందని ఒక సామెత కలదు. ఈ పండుగ అనంతపురంజిల్లాలో కొన్ని చోట్ల వుంది. కొన్ని చోట్ల లేదు. అసలు రాయలసీమ ప్రాంతంలో ఈ పండుగ ఎక్కడ కనిపించదని చెప్పుతారు కనిపించేదల్లా అనంతపురం జిల్లాలో కొన్నిచోట్ల మాత్రమే !

మాల పున్నమి తెలుగునెల ప్రకారం అశ్వయుజ మాసంలో వస్తుంది. అంటే ఇంగ్లీషునెల ప్రకారం అగష్టు కడపటి వారంలోగాని, సెప్టెంబరు మొదటి వారంలో గాని వస్తుంది. మాలపున్నం నగరాలలో అంతగా కనిపించదు. పల్లెటూళ్ళలో ప్రత్యేకంగా కనిపిస్తుంది. మాల పున్నెం పండుగ వచ్చేనాటికి పొలాలలో విత్తనాలు వేయబడి వుంటాయి. సమయానుకూలంగా వర్షాలు వస్తే పంటలు చూచుటకు చాలా ఆనందముగా వుంటాయి.

మాలపున్నం అనంతపురం జిల్లాలో చెన్నెకొత్తపల్లి తాలూకాలో బ్రహ్మాండంగా జరుపుకుంటారు. ఇక్కడ ప్రత్యేకంగా హరిజనులు గొప్ప పండుగగా భావించుతారు. మాల, మాదిగవాండ్లు జరుపుకొనే పండుగ కాబట్టి వీటికి 'మాలపున్నం' అని పేరు వచ్చిందని చెప్పుతారు. మరి కొందరు ఈ పండుగను గురించి ఎన్నో కట్టు కథలు చెప్పుతారు. ఇక్కడ హరిజనులు పండుగనాడు ఉపవాసంతో వుండి, ఇల్లు-బయట, లోపల పరిశుభ్రంగావుంచి పండుగ జరుపుకుంటారని తెలుస్తుంది. ఎవరి ఆచారాలువారివి. ఎవరి కట్టుబాట్లు వాళ్ళవి. ఇక్కడ హరిజనులు ఆ పండుగనాడు తీపి ప్రధాన వస్తువుగా భావించుతారు.

మాలపున్నమి అనంతపురం జిల్లాలో కొన్ని గ్రామాలలో చాలా అద్భుతంగా చేసికొంటారు. పండుగ రేపు అనగానే రాత్రి పది గంటలనుంచి పొలాలు దగ్గ వేటలు (పొట్టెలు, మేకపోతులు, కోళ్లు) కొట్టు జరుగుతుంది. అలా పొలాల దగ్గర వేటలు కొట్టుటవల పైరు తల్లికి పోషణబలం, ఏమైనా రోగాలు వుంటె పోత యని రైతుల నమ్మకం. కొందరు పండుగ ఉదయాన్నే వేటలు కొట్టుతారు. వేటలు కొట్టలేనివాళ్ళు గొ బొచ్చు (ఉన్ని) తీసికొనిపోయి పొలాల దగ్గర కవు పెట్టుతారు.

పండుగ నాడు సాయంత్రం పూట కోలాట వేషాలు, కోళ్ళ పందాలు కాలక్షేపం కోసం సరదా ఆడుతారు. కోడి పందాలు వాటి వలన కొన్ని చో కొట్లాటలు, ఖూనీలు జరుగుతుంటాయి. పల్లెలలో

పండుగ కోసం పిల్లలు, పెద్దలు అత్యంత శ్రద్ధతో ఎదురు చూస్తారు.

ఈ పండుగ ఎక్కడలేదు. ఉందల్లా అనంతపురం జిల్లాలోనే. అందుకే మాల పున్నం పండుగ చూస్తే అనంతపురం జిల్లాలోనే చూడాలంటారు. ఈ పండుగ కొత్తగా పెండ్లియైన వారికి చాలా సరదాగా వుంటుంది.

**శ్రీ జానగాని కాటమయ్య**

# ఇక్క - టెంకి

1978 అక్టోబరు భారతిలో ఒక జిజ్ఞాసువుగారు వేళంగి, మున్నంగి మున్నగు కొన్ని గ్రామ నామము లను సూచించి వానిలోని ద్వితీయావయవములను గురించి యడిగిరి. సాధారణముగా ఏదో ఒక స్థల వాచకములేని గ్రామనామముండదు. కాని ఇక్క, టెంకి, పట్టు, పాడు, కుట్టు, కోండ్ర మున్నగు స్థల వాచకము లెన్నియో తర తరములనుండి జనుల నోళ్ళలో నలిగి అవియేనా అన్నంతగా గుర్తించరాని రూపములు పొంది నవి గావున

అద్దంకి, వెల్లంకి, మడికి, యాడకి, నూతక్కి, కోసిగి, ముత్తిగి, మున్నగు పేర్లలోని ద్వితీయావయవములుగా భాసించునవి తెలుగులేగాని సంస్కృతములు గాక పోవచ్చును.

ద్రావిడ రూపాలైన ఎరండు రెండుగా, ఎఱుక ఱెక్కగా, ఎరనాడు రేనాడుగా ఎల, లేత శబ్దములోని ప్రథమావయవముగా తెలుగున నిలిచినవి. వీనిలో మనకు వర్ణప్లుతి అనగా అద్యచ్చు అనంతరమైన హల్లుతో సంధి యగుట కనిపించును. చూడుడు.

ఎరండు (రె+ఎ) > రెండు

ఎఱుక (ఱ+ఎ) > ఱెక్క

ఎరనాడు (ర+ఎ) > రేనాడు

ఎలమావి (ల+ఎ) > లేమావి

ఈ కోవలో చేరినదే ఇక్క. అది వర్ణప్లుతిచే (క్క+ఇ) > క్కి అను రూపమంది "నూతక్కి"లో గనిపించును.

దేశ్యమైన టెంకికి తెంకియను మరియొక రూప మున్నది. అది అద్దంకిలో గనిపించును. ప్రాచీనమైన తెలుగున హల్లులపైగల అకారేకారములు తరుచుగా తారు మారగు చుండును. ఉదా : స్వామివారు వేంచాయగా, వార్కి మన్విచాయగా, అని "చేయ చాయగా", కొత్త ప్యాటు, నారాయణ ప్యాట అని పేట 'ప్యాట'గా పూర్వులు వాడుచుండిరి. కనుక 'తెంకి' 'తంకి'గా అగు టలో వింతలేదు.

అవంచ, ఆలేరు అను గ్రామములు నేడున్నవి. ఆవంచలో పూర్వావయవము అవులు అను బహువచనము యొక్క ఆద్యక్షర శేషము గావున అ+తెంకి, ఆదెంకి, త్రిక రూపా భాసమున అద్దెంకి, అద్దంకి అని మారుటకు నవకాశమున్నది. ఇటులే జల + తెంకి, జలదంకి గావచ్చును.

మన భాషలో ప్రాతాది సంధిలో అద్యక్షర శేష మున్నది. అటులే గ్రామనామములలో కొన్నింటు అంత్యాక్షర శేషము గనిపించును. అట్టివానికి బెజ్జంకి, వెల్లంకి వంటివి ఉదాహరణములగును. బెజ్జని తెంకి, వెల్లని తెంకి అని వానికి విగ్రహము చెప్పవలెను.

మన ఊర్ల చివర కనిపించు అంగి సంస్కృత శబ్దము గాకపోవచ్చును. అది తెలుగున స్థావర జంగమ వాచకములకు గూడ కనిపించును. ఉదా : వృక్ష వాచకములు ఉల్లంగి, సంపంగి, ముల్లంగి, చిన్నంగి, పక్షివాచకములు చెన్నంగి పిట్ట, జొన్నంగి పిట్ట.

ఇదిగాక సంస్కృత మందలి ఆపణము, హట్టము అని వానికి సమానార్థకముగా తెలుగున 'అంగడి' పద మున్నది. దానికి వీధి యని సామాన్యార్థము. అంగడి, గొంగడి, సంగడి మున్నగు దానియందుగల 'డి' పదాం శముగా కనిపించును గనుక ఇచట అది లోపించి నిలిచిన రూపము "అంగి" అని భావింపవలెను. అపుడు వానికి

వేల + అంగి = వేలంగి, వేల = పొలిమేర

మున్ను + అంగి = మున్నంగి. మున్ను = వరుస

పొలిమేర వరకు వీధిగల ఊరు, వరుసలుగా వీధులుగల ఊరు అని అర్థము గుదురును. ఇది మాకు పీనికి దోచిన సమన్వయము గనుక ఇచట జూపితిమి. విజ్ఞులు ఇంకను పరిశీలింప గోరెదము.

**శ్రీయుతులు కే. కిశోరుబాబు, కే. అశోకుబాబు**

# కళింగ రాజరాజు దేవేంద్రవర్మ భార్య (రాజసుందరి) కుళోత్తుంగచోళుని కుమార్తెయా ?

1982వ సం॥ రం జూలై నెల "భారతి"లో నేను ప్రచురించిన "సోమలదేవి – దాక్షారామ శాసన"మను వ్యాసమును విమర్శింపుమ శ్రీ రవికుమార్‌గారు 1982వ సం॥రం అక్టోబరు నెల "భారతి"లో ఒక ప్రతివ్యాసమును ప్రచురించినారు. ఆ వ్యాసములో ప్రస్తావింపబడిన విషయములలో నొక నూత్నాంశము వెలుగు జూచినది ! అది కళింగ రాజరాజగు దేవేంద్రవర్మ భార్య రాజసుందరి చాళుక్య రాజ రాజ నరేంద్రుని మనుమరాలును, కుళోత్తుంగ చోళుని కుమార్తెయు నన్న ఉట్టంకింపే ! ఈ ఉట్టంకింపు యెంతటి చారిత్రిక సత్యమో పరిశీలించుట కుద్దేశింపబడినదే ఈ నావ్యాసము. వారి ప్రతి వ్యాసములో చెప్పబడిన ఇతర విషయముల గూర్చి ముందు ముందు ప్రస్తావింతును.

కళింగ రాజ రాజు దేవేంద్రవర్మ కుళోత్తుంగ చోళుని కుమార్తె రాజసుందరీదేవిని పరిణయమాడెనని చెప్పుటకు శ్రీ సుందరంగారి వ్రాతలను, శ్రీ ఖండవల్లివారి వ్రాతలను ఆధారముగా గొన్నారుగాని ఆ వ్రాతలలో యెంతటి చారిత్రిక సత్యమున్నదో, వాని కేయే యాధారములున్నవో శ్రీ రవికుమార్‌గారు తెలిసికొనలేదు! శ్రీ సుందరంగారు తమ "ది సింహాచలంటెంపిల్" అను గ్రంథములో వ్రాసినారని తెలుపుచు, తమ వాదన నిట్లు వినిపించినారు.

"కళింగ గంగ రాజైన దేవేంద్రవర్మ భార్య రాజసుందరి. ఈమె "చోడ మహీభుజాత్మజ" అని శాసనాలలో చెప్పబడింది. ఈ చోడ రాజు ఎవరు? గంగై కొండ చోడుడని "కళింగదేశ చరిత్రలో కలదని శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాశారు. చాళుక్య రాజ రాజ నరేంద్రుని కుమారుడైన కుళోత్తుంగ చోడుడను రాజేంద్ర చోళుడ"ని శ్రీ సుందరంగారు వ్రాసిన దానిని నేనుపేర్కొన్నానని శ్రీ రవికుమార్‌గారు తమ వాదన కవలంబనగా శ్రీ సుందరంగారి వ్రాతను గైకొన్నారు. శ్రీ సుందరంగారట్లు నిర్ధరించుట కే ఉపపత్తుల జూపిరో, యే ఆధారములపై నట్టి నిర్ణయమునకు వచ్చిరో మనకు తెలియదు. శాసనాలలో ఈమె "చోడ మహీభుజాత్మజ" అని మాత్రమే చెప్పబడినది. ఆ శాసన పాఠమిది:-

సరాజరాజః ప్రథమం జయశ్రియః పతిర్బభూవ ద్రవిళాహవోత్సవే
విరాజమానా మథ రాజ సుందరీ ముదూద్వహం చోడ మహీభుజాత్మజాం ॥

ఈ శ్లోకార్థ మిట్లు చెప్పనగుచున్నది. "రాజ రాజు మొదట ద్రమిలాహవోత్సవములో జయలక్ష్మికి భర్తయై, పిమ్మట చోడ రాజు కుమార్తెయగు రాజ సుందరిని పెండ్లియాడెను."

ఈ చోడ రాజేంద్రుడెవరో గుర్తించుటలోనే కొంత విచికిత్సకులోను గావలసి వచ్చుచున్నది. పూర్వ చరిత్రకారులెల్ల ఈ చోడరాజేంద్రుడు చోళరాజగు రాజరాజ సుతుడు గంగై కొండ చోళబిరుదాంకితుడగు రాజేంద్ర చోళుడన, శ్రీ సుందరం ప్రభృతులాతడు చాళుక్య రాజ రాజ సుతుడు రాజేంద్ర చోళుడు (కుళోత్తుంగ చోళుడు) అని వివదించుచున్నారు. ఈ వాదమునే శ్రీ రవి కుమార్ గారనుసరించి తమ రచనను సాగించినారు. అయితే రాజ సుందరి తండ్రి ఈ ఇరువురిలో నెవ్వరన్నదే ప్రశ్న.

కళింగదేశ చరిత్రలో శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారిట్లు వ్రాయుచున్నారు :- "చోళరాజగు రాజరాజునకు రాజేంద్ర చోళుడను కుమారుడొకడుండెను. ఈతనికి 'గంగయకొండచోళ' యను బిరుదము గలదు. ఈతడు గంగవరకు దిగ్విజయము చేయుటచేత నీ బిరుదు వచ్చెను .... ఈ దండయాత్రకై అతడు కళింగమునకు వచ్చి, తన కూతురగు రాజసుందరిని (ఈతనికి

అమ్మంగ దేవియను మఱియొక కుమార్తె గలదు) రాజరాజునకిచ్చి పెండ్లిచేసి యుండెను. ఈతని రెండవకూతురైన అమ్మంగదేవి చాళుక్యరాజగు రాజరాజనరేంద్రుని భార్య. కాబట్టి చాళుక్యరాజరాజు, కళింగ రాజరాజు–ఇరువురు కూడ గంగయకొండ చోళుని అల్లుళ్ళే యన్నమాట." ఈవ్రాత శ్రీ రవికుమార్ గారికి రుచింపలేదు. శ్రీ సుందరంగారి వ్రాతయే వారికి ప్రమాణముగా తోచి "కళింగ దేశ చరిత్ర" లో ఉదాహరించిన వ్రాతను కొట్టివేసినారు. అందులకు తగు ఆధారమును వారు చూపలేదు. శ్రీ సుందరంగారి వ్రాత "గాంగరాజు సేనలు చోళసేనలను వేంగివద్ద జయించినట్లు తోస్తుంది. ఆతర్వాత 7 వ విజయాదిత్యుడిని వేంగిసింహాసనమందు కూర్చుండబెట్టి ఉంటారు. కులోత్తుంగుడు తనకుమార్తె రాజసుందరిని ఆతనికిచ్చి వివాహంచేసి సంధిచేసుకుని ఉంటారు" (ది సింహాచలం టెంపుల్. పు 19)అనే ఊహాగానానికి శ్రీ రవికుమార్ గారు శృతికలిపి, విచిత్రసంగతులతో ప్రస్తారం గావించినారు.

వీరవిజయాదిత్యుడు వేంగిసింహాసన మాక్రమింప రెండు మారులు ప్రయత్నించినాడు. మొదటిసారి క్రీ॥శ॥ 1030–31లోను, రెండవసారి క్రీ॥ శ॥ 1060–1061లోను. క్రీ॥ శ॥ 1030–31 నాటి ప్రయత్నంలో గంగరాజగు మధుకామార్ణవుడు III (క్రీ.శ. 1019–1038) పశ్చిమ చాళుక్య ప్రభువు జగదేకమల్లుడు (క్రీ. శ. 1014–1044) వీర విజయాదిత్యునిలోని రాజ్య కాంక్షను రెచ్చగొట్టి, రాజరాజనరేంద్రుడు తన బావమఱది రాజాధిరాజు I దక్షిణమున జగదేకమల్లునితో చేయు యుద్ధమున సాహాయ్య మొనరింప యేగిన తఱిని, అగ్రజునకు ద్రోహము తనపెట్టి వేంగి సింహాసన మాక్రమింప ప్రోత్సహించిరి. ఇందు గాంగ రాజగు దేవేంద్రవర్మ ప్రసక్తిగాని, చోడులతో నాతనికి ప్రవర్తిల్లిన యుద్ధ వ్యాపారము గాని, ఆతడు వీర విజయాదిత్యుని పక్షము వహించి, కుళోత్తుంగ చోళు నెదిరించి, విజయముగాంచి వేంగి సింహాసనమున విజయాదిత్యుని కూర్చుండ బెట్టుటగాని జరుగలేదు. అట్టి యుద్ధమే జరిగి యుండనపు డందు కుళోత్తుంగ చోడుట గాని తన కూతురును దేవేంద్రవర్మ కిచ్చి పెండ్లిచేసి, సంధి యొనర్చుకొనుట గాని సంభవించి యుండదు.

ఇక రెండవ తూరి వీర విజయాదిత్యుడు వేంగి నాక్రమించుకొన్నది క్రీ॥ శ॥ 1060–61వ సంవత్సరమున. ఆనాటి పరిస్థితు లిట్లున్నవి :–

చోళ సంబంధియగుటచే చాళుక్య రాజ రాజ నరేంద్రునిపై పశ్చిమ చాళుక్యులు వైరము పాటించి, యెటులైనను వేంగిని జయించి, తమకు పాదాక్రాంతమగునట్లు జేసికొన పన్నాగముల పన్నుచు, వారి సామంతులలో విప్లవ బీజములనాటి, తిరుగుబాటునకు ప్రోత్సహించి, స్వాతంత్ర్య ప్రకటనల గావించుకొన నుత్తేజపరచి, పరోక్షమున వారికి సాహాయ్య మందించుచు రాజ రాజ నరేంద్రుని సిలుగుల బెట్టుచు, వేంగి రాజ్యమున శాంతి లేకుండ జేసిరి. వీర విజయాదిత్యున కాసగొల్పి వేంగి సింహాసన మాక్రమింప ప్రోత్సహించిరి. ఆ సమయమున రాజరాజ నరేంద్రుడు తన మేనమఱదియు, వియ్యంకుడునగు రాజేంద్ర దేవునకు సాహాయ్యము చేయుటకు, ఆ విధమున పశ్చిమ చాళుక్య త్రైలోక్యమల్లుని శిక్షించుటకు, తన ఆంధ్ర సైన్యముల చోళ దేశమునకు బంపెను. సమయము నెఱిగి వేంగి రాజ్య సామంతుడగు చక్రకూట మండలాధిపతి రాజ రాజుపై విప్లవమురేపి, స్వాతంత్ర్యం ప్రకటించి, కప్పము కట్టుట మానెను. కర్ణాట ప్రభువు అపార సేనా వాహినుల వేంగిరాజ్యముపై దండయాత్ర కంపిరి. ఇట్టి క్లిష్ట సమయములో రాజరాజ నరేంద్రుడు ధృతి చెడక, చక్రకొట్యమండలాధిపతి ధారావర్షుని శిక్షింప దన కుమారుని రాజేంద్ర చోడుని నియమించి, తాను కర్ణాట సేనలతో తలపడ నుద్యుక్తుడాయెను. ఈ అదనున వీరవిజయాదిత్యుడు అన్నకు ద్రోహము తలపెట్టి వేంగి సింహాసనమాక్రమించి, తనకుమారుడు ఇమ్మడి శక్తి వర్మను వేంగీశ్వరునిజేసెను. చక్రకొట్య మండలమున తిరుగుబాటు నణచి, విజయ పరంపరల చూరగొనుచున్న కుళోత్తుంగు డీ వృత్తాంతముల వినియు, తాను పూర్తిచేయదలచిన విజయయాత్ర పరిసమాప్తి యగు వరకు అన్యచింతల మదిలోనికి రానీక జైత్రయాత్రా సంరంభియై విక్రమించుచు నుత్తరమునకే యు డిపోయెను. కర్ణాట సేనలతో యుద్ధము చేయ నేగిన రాజరాజ నరేంద్రుడు దురదృష్ట వశమున శత్రువుల చేతిలో మరణించి వీర స్వర్గమలంకరించెను. విజిగీషుడై తిరిగి వచ్చిన కుళోత్తుంగ చోళుడు నాటి వేంగిరాజ్య పరిస్థితుల సాకల్యముగ నాకళించుకొని, చోళ దేశమున తన మామ చోళరాజేంద్రుడు మరణించుటచే నారాజ్య రక్షణభారము వహించు నవసరమేర్పడి, వేంగిని తన పిన తండ్రికి సుహృద్భావ పూర్వకముగ నిచ్చివేసి, తాను తమిళ దేశమున కరిగెను. ఇప్పట్టున గూడ కుళోత్తుంగ చోళుడు గాంగ రాజరాజ దేవేంద్రవర్మను యుద్ధములో నెదుర్కొనుట గాని, పరాభవము పొందుటగాని జరుగలేదు. అట్టి యెడ విజయాదిత్యుని పక్షము వహించి, కుళోత్తుంగ చోళునితో యుద్ధ మొనర్చి దేవేంద్రవర్మ జయశ్రీ నంది కొన్నది లేదు. కుళోత్తుంగుని కుమార్తె నుద్వాహమైనది లేదు. దీనికి భిన్నముగా శ్రీ సుందరంగారు వ్రాసిన వ్రాతలన్నియు సత్యదూరములు, చరిత్ర విరుద్ధములు, హాస్యాస్పదములు నగుచున్నవి. అదియునుగాక క్రీ॥ శ॥ 1060–61 లో

విజయాదిత్యుడు వేంగీ సింహాసనమును ద్రోహబుద్ధితో నాక్రమించి, ఇమ్మడిశక్తివర్మ నభిషిక్తుని చేయుటలో నెట్టి ప్రతిఘటనను యెదు ర్కొనలేదని, చక్రకూట యుద్ధానంతరము వేంగికి మరలివచ్చిన కుళోత్తుంగ చోళుడు ప్రేమ పూర్వకముగనే వేంగీరాజ్యమును తన పినతండ్రి పరము గావించెననియు చరిత్రయుద్ఘోషించుచున్నది. దీనికి విరుద్ధముగా యెవరెన్ని వ్రాతలు వ్రాసినను అవి ఆధార రహితములు, సత్యదూరములు, ఊహాజనిత నిర్ణయములని చెప్పక తప్పదు.

శ్రీ సుందరంగారి వ్రాతను మించిన వ్రాతతో శ్రీ ఖండ వల్లి వారు తమ "ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి" అన్న గ్రంథ ములో (పే. 216) ఈ విషయమై ఇంకను కొన్ని విచిత్రాంశముల జోడించి, రచించి శ్రీ రవికుమార్‌గారి వాదనకు దన్నుగా నిల్చి నారు. నాకు లభ్యమైన ప్రతిలో (1951వ సం॥ రం ప్రచురణ) అట్టి రచన యెక్కడను కానుపించలేదు. కానుపించకపోయినను శ్రీ రవికుమార్‌గారి వ్రాతపై నమ్మకముంచి ఆ వ్రాతలోని విషయ పరిశీలనకు గడంగెదను.

శ్రీ ఖండవల్లివారు "రాజ రాజ నరేంద్రుని కుమారుడైన కుళోత్తుంగ చోళుడు పినతండ్రియగు విజయాదిత్యుని వేంగినుండి పారదోలినాడు. ఇంతలో వీర రాజేంద్రుడైన పశ్చిమ చాళుక్య ఆరవ విక్రమాదిత్యుడు తన భార్య సోదరుని అధి రాజేంద్రుని చోళ సింహాసనముపై కూర్చుండబెట్టెను. రాజ రాజ నరేంద్రు కుమారుడే కల్లోలసమయమున గొప్పసైన్యముతో చోళరాజ్యము పై దండు వెడలిపోయెను. రాజేంద్రుడిట్లు చోళ సామ్రాజ్యము నాక్రమించుటకు బోవుటను చూచి కళింగాధిపతి పూర్వగాంగ రాజ రాజ దేవేంద్రవర్మయు చేదిరాజు యశఃకర్ణ దేవుడును విజయా దిత్యుని పక్షము వహించి, వేంగిపై దండెత్తివచ్చి, యచ్చట గాపుండిన రాజేంద్రుని సైన్యము నోడించిరి. రాజేంద్రునకువారితో దీర్ఘముగ యుద్ధముచేయ వలనుగాకపోయెను. కావున నతడు రాజ రాజు దేవేంద్రవర్మకు తన కూతురు రాజసుందరినిచ్చి వివాహము చేసి, విజయాదిత్యుని కామరణ పర్యంతమును వేంగీ రాజ్యాధి పత్యము నిచ్చుటకు ఒడబడి సంధి చేసికొనెను" అని నూత్నచరి త్రాంశమును వెల్లడించినారు.

శ్రీ సుందరంగారి నిశిత దృష్టికందనివిషయముల పెక్కిం టిని శ్రీ ఖండవల్లివారు వారి గ్రంథమున కెక్కించినారు. మొద టిది :- రాజ రాజ నరేంద్రుని కుమారుడైన కుళోత్తుంగ చోళుడు తన పినతండ్రియగు విజయాదిత్యుని వేంగి నుండి పారద్రోలి నాడన్న విషయము. రాజ రాజ నరేంద్రుని జీవితకాలములో నాతని సవతి సోదరుడు విజయాదిత్యుడు ద్రోహముతలపెట్టి పలుమారులు యెత్తివచ్చినను అతడే వానినెల్ల సమర్థించుకొని, విజయాదిత్యుని పారద్రోలెనుగాని కుళోత్తుంగ చోళుడట్లుచేసియున్నట్లు ఆధారములు కానుపింపవు. ఒకవేళ రాజ రాజు పనుపునట్టిది సంభవించి యుండి యుండెనన్న రాజరాజు రాజ్యకాలంలో (క్రీ. శ. 1020-1061) దేవేంద్రవర్మ యశఃకర్ణ దేవులు వేంగిపై నెత్తి వచ్చిన జాడ లెక్కడను గానుపింపవు. రాజేంద్ర చోళుడు చోళ సామ్రాజ్యము నాక్రామింప వెడలిన కాలములో వీరవిజయాదిత్యుడు వేంగీ సింహా సన మాక్రమించుకొని యుండెను. గాన దేవేంద్రవర్మ యశఃకర్ణ దేవులు విజయాదిత్యుని పక్షమున రాజేంద్ర చోళునితో యుద్ధ మొనరింపవలసిన అవసరము గానుపింపదు. అదియునుగాక దేవేంద్రవర్మ యశఃకర్ణ దేవులిద్దరు యేకస్థులై వేంగీరాజ్యముపై నెత్తిరాలేదు. యశఃకర్ణ దేవుడు ఆంధ్రదేశముపై నెత్తి వచ్చుటకు కారణము కానుపింపదు. కాని - అతని ఖైరా తామ్రశాసనములోని

శ్లో॥ ఆంధ్రా ధీశమరంధ్ర దోర్విలసితం స్వచ్ఛంద ముచ్ఛిందతా  
యేనాభ్యర్చ్యత భూరిభిః సభగవా న్భీమేశ్వరో భూషణైః  
యస్యావర్ణయదాత్త నృత్యలహరీ భ్రూవల్లి గోదావరీ  
గాయంత్యున్మద హంసనాదమధురైః స్రోతస్వరైః సప్తభిః

అన్న వక్కాణము యదార్థము కాదనలేము. ఈ దండయాత్ర విజయాదిత్యుని కుమారుడు ఇమ్మడి శక్తివర్మ వేంగీ సింహాసనము పై నుండగా జరిగెను. ఆ యుద్ధములో ఇమ్మడిశక్తి యేకాకియై పోరి, రణరంగమున మడిసెను. ఆసమయమున విజయాదిత్యుడు దూరస్థలమున చాముండరాజు (కర్నాటసేనాని) తో పోరుచు శక్తి వర్మకు సహాయ పడజాలక పోయెను.

ఈ విధిని కూడ దేవేంద్రవర్మ, యశః కర్ణదేవులు వీర విజయాదిత్యుని పక్షమున చోళసేనలతో పోరి జయించి, వేంగీ రాజ్యమును విజయాదిత్యుని కొసంగలేదు సరికదా! అతని పుత్రుని జంపి, విజయాదిత్యుని వంశాంకురమును నిర్మూలించిరి. కావున శ్రీ ఖండవల్లివారి వ్రాతల ప్రామాణ్యత గురించి సందేహింపవలసి వచ్చుచున్నది. వారి వ్రాతల నమ్మి శ్రీ రవికుమార్‌గారు వాద ప్రతి వాదములకు దిగుట ఆరోగ్య ప్రదము గాదు! వీరే "రాజ రాజ నరేంద్రునకు రేవలదేవి యను మరొక రాణి యుండెను. ఈమె కుమార్తె సోమలదేవిద్రాక్షా రామములో నొక చిన్న శాస నము వేయుంచెను". అని వ్రాసి, చారిత్రకులను తలపట్లు పట్టించి విడిచినారు!

దేవేంద్రవర్మ వీర విజయాదిత్యునకు సాహాయ్యపడి, వేంగీసింహాసనమున నిల్పినది యదార్థమే! అది శ్రీ సుందరంగారు

శ్రీ **ఖండవల్లి**వారుట్టంకించినరీతినిగాదు. ఆ సమయమున దేవేంద్ర వర్మ చోళ సైన్యములతోపోరి జయలక్ష్మిని వరించిన మాటయు నిజమే! అయితే ఆచోళ సైన్యములు కుళోత్తుంగ చోళునివిగాక చోళవీరరాజేంద్రునివై యున్నవి. ఆ సంఘటన వివరములివి :-

కులోత్తుంగుడు తన పినతండ్రి విజయాదిత్యునకు వేంగి రాజ్య మొసగి, తన మాతామహుని చోళ రాజ్యాభిషిక్తుడగుటకు యత్నించుటలో తన మామయగు రెండవ రాజేంద్రచోడుని (క్రీ.శ.1052-1062) దాయాది వీరరాజేంద్రుడనువాడు చోళరాజ్యము నాక్రమించుకొని, వేంగిపై దండయాత్ర కూడా సాగించెను. వీర రాజేంద్రుడు పశ్చిమ చాళుక్యులతో సఖ్యత సంపాదింపదలచి, ఆరవ విక్రమాదిత్యునకు తన కుమార్తె నిచ్చి పెండ్లి చేసెను.

ఈ బాంధవ్య బంధనము నాసరాజేసికొని వీరరాజేంద్రుడు వేంగియందు కుమార రాజేంద్ర చోడుని, ఆతని పితృవ్యుడగు విజయాదిత్యుని శిక్షింపను, వేంగి మహారాజ్యమును తన సామ్రాజ్యమున కలుపుకొనదలచి నిశ్శంకతో వేంగిమీదికి నడచెను. చోళరాజ్య సీమలందు మలయుచున్న కుమార రాజేంద్ర చోడుని దృష్టిని మరల్చి వేంగీశ్వరుని, వేంగి యువరాజును గూడ వేంగి దేశమునందోడింప సంకల్పించెను.

ఈ యుద్ధ సంకల్పము విని కుమార రాజేంద్రచోడుడు చోళ సైన్యముల నెదుర్కొనుటకు ముప్వురు దండనాధులను, చక్రకూటాధీశ్వరుడైన జననాథుని, దండనాయక రాజమయ్య గజసాహిణిని, చమూపతి ముప్పరసును బంపెను. ఆంధ్ర ద్రావిడాధీశుల సేనలకు **విజయవాడ**చటిని ఘోరయుద్ధము ప్రవర్తిల్లెను. అందు వేంగియువ **రాజు** సేనలు హతమయ్యెను. శేషించిన బలములు అడవులదారి బట్టెను. ఇది క్రీ. శ. 1066వ సం॥ జరిగెను. విజయ హర్షాతిరేకమున వీరరాజేంద్రుడు రాజమహేంద్రవరము మీదికి నడచెను. **గోదావరి**ని దాటెను. రాజేంద్రచోళుని సైన్యము పరాజయ మొందుట గాంచి, రాజమహేంద్రవరమును రక్షించుకొను బలము లేక విజయాదిత్యుడు కళింగ రాజరాజు దేవేంద్రవర్మ సాహాయ్యమునువేడెను. ఆపన్నుడై వచ్చిన శరణార్థి కభయమొసంగి కళింగ రాజరాజు మండలిక బణపతిని సేనాధిపతిగజేసి, వీరరాజేంద్రు నెదుర్కొనుటకు పడమటి దిక్కుగా నున్న వేంగి రాజ్యమున కంపెను. రాజరాజు, విజయాదిత్యులు ఘోర సంగ్రామ రంగమున చోళ భూపతి నెదుర్కొని పోరాడిరి. జయలక్ష్మి తానయై వచ్చి దేవేంద్రవర్మను వరించెను. దండనాయక బణపతి విక్రమ రణ కౌశలములు విజృంభించి, రాజరాజున కఖండ జయము నొడగూర్చెను.

తలవని తలంపుగా పరాజయము కలుగుట వలన వీరరాజేంద్రునకు కళింగ భూపతి తోడ సంధి జేసికొనుట సంభావ్యమని తోచెను. అంతట తన రెండవ కుమార్తె రాజసుందరిని రాజరాజున కిచ్చి యుద్వాహ మొనర్చి మైత్రిసాధించెను. ఈ కార్యములన్నియు క్రీ॥ శ॥ 1066 సంవత్సరమున జరిగెను. ఈ యుద్ధమును గూర్చియే "సరాజరాజః ప్రథమం జయశ్రియః పతిర్బభూవ ద్రవిళాహవోత్సవే, విరాజమానామథ రాజసుందరీ ముదూద్వహం శ్చోడమహీ భుజాత్మజాం" అను శ్లోకములో ప్రస్తావింప బడినది. అంతియే గాని దేవేంద్రవర్మ కుళోత్తుంగ చోళుని చోళ సైన్యముల నెదిరించి, విజయము సాధించి విజయాదిత్యుని పదస్థుని చేయుట, కుళోత్తుంగుని కుమార్తెను పరిణయమాడుట సంభవించలేదు.

ఇకనొక్క విశేషము గలదు. రాజ రాజ నరేంద్ర - అమ్మంగ దేవుల వివాహము క్రీ. శ. 1020వ సంవత్సరమున జరిగెను. శ్రీ రవికుమార్‌గారి అంచనా ప్రకారము దేవేంద్రవర్మ జననము కూడా నా సంవత్సరముననే. అనగా రాజరాజ నరేంద్రుని వివాహానంతరం జన్మించిన కుళోత్తుంగ చోళున కంటే కొన్ని సంవత్సరములు దేవేంద్రవర్మ పెద్దవాడని తేలుచున్నది. వాదానా సౌకర్యము కొరకు కుళోత్తుంగ చోళుని కుమార్తెను దేవేంద్ర వర్మ వివాహమాడినాడని అంగీకరించిన పక్షమున మామకంటె అల్లుడు పెద్దవాడు గానగుచున్నాడు. ఇది లోక విరుద్ధము. కావున ఈ వివాహగాథ యదార్థమై యుండు సావకాశము లేదు.

అదియునుగాక కులోత్తుంగ చోళుడు క్రీ. శ. 1040లో జన్మించి యుండవలెనను యూహను వెలిబుచ్చినారు ◆ శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు పంతులుగారు తమ "రాజ రాజ నరేంద్రుడు" అను గ్రంథములో. అందుచేత గంగరాజగు దేవేంద్ర వర్మ కుళోత్తుంగ చోళునికంటె 20 యేండ్లు పెద్దవాడగుచున్నాడు. ఇది లోక విరుద్ధ విషయము. కావున తనకన్న చిన్నవాని కుమార్తెను దేవేంద్రవర్మ వివాహమాడెనన్న నది హాస్యాస్పదము. లోక విరుద్ధము, సాంప్రదాయ విరుద్ధమనుట స్పష్టము. కావున

◆ రాజేంద్ర చోడుడెప్పుడు జనించెనో తెలియదు. కాని యతడు చక్రకూటాధీశ్వరుని శిక్షింపబోయిన నాటి కించు మించు ఇరువది యేండ్లవాడు గావచ్చును. అప్పటికతడు వేంగి యువరాజు. కర్ణాట విక్రమాదిత్యుని కంటె యువరాజు రాజేంద్ర చోడుడు ఇంచుక పెద్దవాడుగా కన్పట్టను. కుమార రాజేంద్ర చోడుడు చక్రకూటమున కరిగి బాహు బలమున విక్రమించి శౌర్య సహాయుడై ధారావర్షుని బూర్తిగ నోడించి మరల తలయెత్తకుండ సర్వ నాశకరముగా మర్దించెను. చక్రకూట జైత్రయాత్ర శ ౧౦౬౧-౧౦౬౨ సంవత్సరముల నడుమ రెండేండ్లు నడచినట్లూహింపవచ్చును.

కుళోత్తుంగ చోళుని కుమార్తెను దేవేంద్రవర్మ పరిణయమాడుట యథార్థమై యుండుటకు సావకాశము లేదు.

మరియొక విశేషమిట ప్రస్తావింతును. చోళ రాజేంద్ర దేవుని యేకైకపుత్రిక మధురాంతకి వేంగి యువరాజు రాజేంద్ర చోడున కగ్రమహిషి. ఈ వివాహము రాజ రాజ నరేంద్రుని మరణమునకు ముందు, రెండవ కొప్పం యుద్ధము జరిగిన పిదప జరిగి యుండెనని యూహింపబడుచున్నది. ఆ ప్రకారం కుళోత్తుంగ చోళుని వివాహము క్రీ. శ. 1061నకు పూర్వము క్రీ. శ. 1053 తర్వాతగాని జరుగలేదు. అది క్రీ. శ. 1055_1058 మధ్య కాలమున జరిగి యుండెనని యనుకొన్న, ఆ పిమ్మటగాని కుళోత్తుంగ చోళునకు సంతాన ప్రాప్తి లభించియుండదు గదా!

కుళోత్తుంగ చోళ-మదురాంతకి దేవుల వివాహము క్రీ. శ. 1055 లో జరిగియున్నదనుకొన్న ఆ పిదప కనీసము 3 సంవత్సరముల అనంతరమునగాని వారికి ప్రథమ పుత్రికా జననమగుటకు సావకాశముండనేరదుగదా! అట్లగుట కుళోత్తుంగ చోళుని కుమార్తెయని చెప్పబడుచున్న రాజ సుందరి క్రీ. శ. 1058వ సంవత్సరమున జనించి యుండవలెను. ఆమెకు యుక్తవయసు వచ్చునరికి క్రీ॥ శ॥ 1074వ సంవత్సరమగును. అప్పటికి శ్రీ రవి కుమార్‌గారి వక్కాణమునుసరించి 54 సంవత్సరముల వయసు యుండును. ఈ ప్రకారమైనచో వదువునకు 16 సంవత్సరములు, వరునకు 54 సంవత్సరములుగా తేలును. మధురాంతకి గర్భధారణము క్రీ॥ శ॥ 1055 గాక ఇంకను ముందునకుబోయిన ఈ వయోభేదము యెక్కువై సాంప్రదాయ విరుద్ధముగా భాసించును. కావున దేవేంద్రవర్మ భార్య రాజసుందరి కుళోత్తుంగ చోళునికుమార్తె అగుటకు సావకాశములేదని స్పష్టమగుచున్నది.

ఈ పై చర్చల సరళిని బట్టి శ్రీ రవికుమార్‌గారు, శ్రీ సుందరం, శ్రీ ఖండవల్లి వారల వ్రాతలాధారముగా కళింగ దేవేంద్రవర్మభార్య రాజసుందరి కుళోత్తుంగ చోళదేవుని కుమార్తె అనుట అసంగత విషయమని చెప్పక చెప్పుచున్నది.

సోమందేవిని గూర్చి నేను వ్రాసిన వ్రాతలను పూర్వపక్ష మొనరించుచు శ్రీ రవికుమార్ గారవలంబించిన వాద విధానమును గూర్చి వేరొక వ్యాసమున చర్చింతును.

"చరిత్ర విద్యాధర" తురగా కృష్ణమూర్తి, బి. ఏ.
పిట్టల వేమవరం
వయా ఖండవల్లి - తణుకు తాలూకా
(ప. గో.)

# నాథ సంప్రదాయమే వేమన, వీరబ్రహ్మంల మత సంప్రదాయం

యోగసాధన ప్రధానంగా గల నాథ సంప్రదాయ మొకటి ఆంధ్రదేశంలో ముఖ్యంగా రాయలసీమ, తెలంగాణా, గుంటూరు ప్రాంతాలలో బాగా వ్యాపించి వుండేది. ఈ నాథ సంప్రదాయ ప్రభావం తత్త్వకవుల, కవయిత్రుల మీద కన్పిస్తున్నది. యోగ ప్రధానమైన నాథ సంప్రదాయం ఒక్కసారే హఠాత్తుగా పుట్టి వ్యాపించింది కాదు. దీని చరిత్ర, పరిణామం చాల ప్రాచీనమైంది. నాథ సంప్రదాయం మొదట బౌద్ధమతంలో శాఖగానే వుండేది. అప్పుడు దానికి సిద్ధ సంప్రదాయమని పేరు. బౌద్ధమతం నీతిని, శీలాన్ని, సదాచారాన్ని బోధించేమతం. యోగ విద్యా ప్రభావానికి గురై దానిలో ఒక కొత్త సంప్రదాయం సిద్ధసంప్రదాయం పేరుతో బయలు దేరింది. ఈ సిద్ధ సంప్రదాయం భారతదేశంలోనే కాక టిబెట్టు, నేపాల్ దేశాలల్లోను బాగా విస్తరించి వ్యాపించింది. సిద్ధ సంప్రదాయంలో 84 మంది సిద్ధాచార్యులు అంగీకరింపబడినారు. సిద్ధాచార్యులకు సిద్ధ గురువులని కూడ పేరు. ఈ సిద్ధాచార్యులు మూల రచనలు యిప్పుడు మనకు దొరకటం లేదు. కాని టిబెటన్ అనువాదాలు మాత్రం కొన్ని దొరుకుతున్నవి. యోగ విద్య క్రీ. పూ. 150 ప్రాంతం వాడైన పతంజలి శాస్త్రబద్ధం చేసినాడు. కాని యోగ విద్య అంతకన్న ప్రాచీనమైంది. మొహంజదారో మట్టి సీళ్ళ మీది బొమ్మలను బట్టి ఆ నాటికే యోగవిద్య వుండేదని చెప్పవచ్చును.

హిందూమతంలోని ప్రతి సంప్రదాయమూ యోగాన్ని యేదో విధంగా అంగీకరించి అనుసరిస్తున్నది. కొన్ని హిందూమత సంప్రదాయాలు యమ నియమ ప్రాణాయామ ధారణ ధ్యానాదులను పాటించటంతో సరిపుచ్చుకోగా మరికొన్ని యోగవిద్య ద్వారా ఆత్మను పరమాత్మలో లీనం చేయవచ్చునని విశ్వసించినవి. ఇంకా కొన్ని సంప్రదాయాలు యోగసాధన ద్వారా అతీత శక్తులను సంపాదించవచ్చునని బోధించినవి. బౌద్ధ సిద్ధ సంప్రదాయంలో 'కాయసాధన'కు ప్రాధాన్య మెక్కువ. షడంగ యోగసాధన ద్వారా శరీరంలోని ప్రజ్ఞ లేక శక్తిని ఊర్ధ్వముఖంచేసి సహస్రదళ పద్మస్థానంలో అనుసంధింప జేయాలి. సహస్రదళపద్మ స్థానానికే మహాసుఖ స్థానమని పేరు. అట్లా అనుసంధింప జేసిన సాధకుడు తానే సత్యమని, తానే బ్రహ్మండమని, తానే బుద్ధుడనని అనుభవాన్ని పొందుతాడు. చుట్టూవున్న ప్రపంచం దూది పింజలాగ లేచిపోయి దాని అస్తిత్వం నశిస్తుంది. సాధకుడు శూన్యానుభవాన్ని పొందుతాడు. అందుకే దీనికి సహజ శూన్యసాధన అని పేరు.

సిద్ధ సంప్రదాయాన్ని సహజయానమని కూడ పిలుస్తారు. సిద్ధాచార్యులు కులవ్యవస్థకు, వైదిక కర్మకాండలకు పూర్తిగా వ్యతిరేకులు. సిద్ధగురువుల్లో మొదటివాడైన 'సరహపా' బ్రాహ్మణ భిక్షువు. అయినా అతడు కులాధిక్యతను నిరసించాడు – "ఎప్పుడో బ్రాహ్మణులు బ్రహ్మముఖం నుంచి పుడ్తే పుట్టి వుండవచ్చును, యిప్పుడు మాత్రం వాళ్ళు అందరిలాగానే పుడ్తున్నారు. మరి వారికి బ్రాహ్మణత్వ మెక్కడిది? ఒకవేళ వైదిక కర్మవశంతో బ్రాహ్మణు డౌతున్నాడంటె మరి చండాలున్ని ఆ కర్మలను యెందుకు చేయనియ్యటంలేదు? వేదాధ్యయనం చేత బ్రాహ్మణు డౌతాడంటె మరి చండాలున్ని కూడ వేదం చదివి బ్రాహ్మణుడుగా యెందుకు కానియ్యటం లేదు? అగ్నిలో నెయ్యి పోస్తే మోక్షం వచ్చేటట్లయితే మరి అందరిని యెందుకు యజ్ఞాదులను చేయనియ్యటం లేదు...." అని కొన్ని వందల సంవత్సరాల కిందనే సరహపా ప్రశ్నించాడు. బౌద్ధ సిద్ధాచార్యుల సాధనల్లో రసవాద విద్య ఒకటి. శరీరంలోని శక్తి పేరు బోధిచిత్త. బోధిచిత్తను ఊర్ధ్వముఖం చేసి సహస్రదళ పద్మం వైపు ప్రవహింపజేసి వజ్రంగా అంటె వజ్రంలాగ గట్టిగా మార్చాలి. రసవాదవిద్యలోని పాదరసం బోధిచిత్తకు ప్రతీక. రసరూపంలో కదిలే పాదరసాన్ని గట్టిలోహంగా అంటె బంగారంగా మార్చే విద్య బోధిచిత్తను వజ్రంగా మార్చే దానికి ప్రతీకగా వీరు రసవాద విద్యను సాధించారు. సాధనకు గురువు చాల అవసరం. గురు ముఖంగా తప్ప సాధకుడు సాధన చేయటానికి వీల్లేదు. అందుకే యీ సంప్రదాయంలో 84 మంది సిద్ధాచార్యులకు ప్రాముఖ్యమున్నది. తర్వాత తర్వాత యీ సిద్ధ సంప్రదాయంలో మంత్ర తంత్ర శక్తి సాధనలకు ప్రాధాన్యం హెచ్చింది. స్త్రీ పురుష సంయోగ సుఖమే మహాసుఖంగా పరిగణింప బడింది. క్షుద్రవిద్యలను సాధించటం, మద్యమైథునాల సేవనం – వీటితో దిగజారిపోయి దూష్యమై వజ్రయానం పేరుతో ప్రచారంలోకి వచ్చింది.

మంత్రతంత్ర శక్తులతో కూడిన యీ వజ్రయానానికి ఆంధ్రదేశంలోని శ్రీపర్వతం అంటె యిప్పటి నాగార్జున కొండ ప్రాంతం ప్రసిద్ధి కెక్కింది. క్రీ. శ. 7, 8 శతాబ్దాలవారైన బాణ భవభూతి కవులు శ్రీపర్వతం మంత్రతంత్రాలకు ప్రసిద్ధమైందిగా పేర్కొన్నారు. మంత్ర తంత్రాలుగల మంజుశ్రీ మూలకల్పం యిక్కడే వ్రాయబడింది. దానిలో శ్రీపర్వతం మంత్ర తంత్రాల సిద్ధికి స్థానమని చెప్పబడింది–

శ్రీపర్వతే మహాశైలే దక్షిణాపథ సంజ్ఞికే
శ్రీ ధాన్యకటకే చైత్యే జనవాతురే భువి
సిధ్యంతే తంత్ర మంత్రాపై క్షిప్రం సర్వార్థ కర్మసు.

సిద్ధ సంప్రదాయం వజ్రయానం పేరుతో దూష్యమైన పరిస్థితుల్లో నాథ సంప్రదాయం పేరుతో ఒక కొత్తసంప్రదాయం బయలుదేరి వ్యాపించింది. నాథ సంప్రదాయ ప్రవర్తకులు మత్స్యేంద్ర, గోరఖనాథులు. సిద్ధ సంప్రదాయంలో 84 మంది సిద్ధాచార్యులకు ప్రాముఖ్యమున్నట్లే నాథ సంప్రదాయంలో నవనాథులని పిలువబడే తొమ్మిదిమంది ఆచార్యులకు ప్రాముఖ్యమున్నది. మత్స్యేంద్ర, గోరఖనాథులు మొదట బౌద్ధ సిద్ధాచార్యులే అని తర్వాత వీరుదాన్ని ఉద్ధరించి యీ కొత్త సంప్రదాయాన్ని స్థాపించినారని రాహుల్ సాంకృత్యాయన్ తెలిపినాడు. నాథ సంప్రదాయ ప్రవర్తకుడు మత్స్యేంద్రనాథుడు కాగా దాన్ని వ్యాపింపజేసింది గోరఖనాథుడని అంటారు. గోరఖనాథుడ్ని గూర్చి అనేక కథలు ప్రచారంలో వున్నవి. నేపాల్, పంజాబ్, మహారాష్ట్ర, గుజరాతు, రాజస్థానం, బెంగాల్, ఆంధ్రప్రాంతాలవారు గోరఖనాథుడు తమ ప్రాంతం వాడే అని విశ్వసిస్తున్నారు. అంతేగాక అతన్ని గూర్చి ప్రచారంలో వున్న కథలను బట్టి అతని జీవితకాలం కొన్ని శతాబ్దాల వరకు విస్తరిస్తున్నది. దీన్నిబట్టి ఒకవేళ గోరఖనాథుడనే పేరుతో వ్యక్తులు వేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరు కాలాలల్లో వెలిసారేమోనని అనిపిస్తుంది. క్రీ. శ. 14వ శతాబ్దంవాడైన గౌరన తెలుగులో "నవనాథ చరిత్ర" పేరుతో నవనాథుల చరిత్రలను కావ్యంగా రచించినాడు. దీన్నిబట్టి నాథ సంప్రదాయం ఆంధ్రదేశంలో క్రీ. శ. 14, 15 శతాబ్దాల వరకు వ్యాపించియున్నదని చెప్పవచ్చును. నవనాథ చరిత్రనుబట్టి గోరఖనాథుడు శ్రీశైల ప్రాంతంవాడు. వీరశైవుడైన అల్లమ ప్రభువుతో యీ గోరఖనాథుడు శ్రీశైలంలో శాస్త్రవాదంచేసి ఓడిపోయినాడని చెప్పబడింది. అల్లమ ప్రభువు వీరశైవస్థాపకుడైన బసవేశ్వరునికి సమకాలికుడు. ఒకప్పుడు శ్రీశైలం నాథ సంప్రదాయుల అధికారంలో వుండేది. తర్వాత వీరశైవులు దాన్ని వశపరచుకొన్నారు. పై వృత్తాంతం యీ మార్పునే చెప్తున్నది. నాథ సంప్రదాయం బౌద్ధ సిద్ధ సంప్రదాయానికి వారసురాలుగా పుట్టినా అది హిందూమతంలోని సిద్ధాంతాలనెన్నిటినో తీసుకొన్నది.

సిద్ధ సంప్రదాయంలో యోగసాధనకు ఆలంబన దేవత యెవరులేరు. నాథ సంప్రదాయికులు యోగీశ్వరుడైన శివుడ్ని ఆలంబన దేవతగా తీసుకొన్నారు. ఆత్మ పరమాత్మ తత్త్వం, మాయ మొదలైన సిద్ధాంతాలను ఉపనిషత్తుల నుంచి, శంకరుని అద్వైతం నుంచి తీసుకొన్నారు. ఈ సంప్రదాయికులు సంఘంలో

వ్యాపించివున్న మూఢ విశ్వాసాలను ఖండించి అర్థంలేని వైదిక కర్మలను, పూజావిధులను, డంబాచారాలను, శుద్ధి అశుద్ధి మడి ఆచారాలను, కులభేదాలను కఠినంగా నిరసించారు. కర్మకాండ, పశుబలుల నిరర్థకతను, కులవ్యవస్థలోని నిస్సారతను, విగ్రహపూజలోని మూర్ఖతను వీరు ప్రజలకు విప్పిచెప్పారు. వీరికి ప్రధాన సాధనా మార్గం యోగం. అందుకే యీ సంప్రదాయానికి యోగ సంప్రదాయమని పేరు.

శంకరాచార్యుల తర్వాత హిందూ మతంలో నాథ సంప్రదాయం సమన్వయాన్ని సాధించింది. శంకరుని అద్వైతం సంస్కృతజ్ఞుల్లోనే అగ్రజాతుల్లోనే వ్యాపించగా నాథ సంప్రదాయం సామాన్య జనుల్లో ముఖ్యంగా నిమ్నజాతుల్లో వ్యాపించి జాగృతిని తేగలిగింది, ఒక గొప్ప జాతిసమన్వయాన్ని సాధించగలిగింది. ఉపనిషత్తుల విజ్ఞానం, యోగ, అద్వైత సిద్ధాంతాలను సమన్వయ పరచుకొని హేతువాదంతో కూడిన ఒక మతాన్ని అశిక్షితులైన జనులకు బోధించి వారందరిని ఒక్క తాటిమీద నడిచేటట్లు చేసింది యీ సంప్రదాయం. ఈ సంప్రదాయికులు జనులు మాట్లాడుకొనే భాషలో సులభంగా, ఒకొకసారి సరళమైన ప్రతీకాత్మక పద్ధతిలో దార్శనిక తత్త్వాలను, కుల వ్యవస్థలోని నిస్సారత్వాన్ని, శాశ్వత సత్యాలను ప్రబోధిస్తు ఏక్‌తారా వంటి వీణమీద జానపద బాణిలో పాడుకుంటూ తిరిగేవారు. నాథ సంప్రదాయికులు సంగీతాన్ని మించి ప్రచార సాధనంగా తీసుకొన్నారు. వీరిప్రచారం వల్లనే ఉపనిషత్తుల్లో సంస్కృత భాషలో చెప్పబడిన గంభీరమైన తత్త్వరహస్యాలు, యోగ విద్యారహస్యాలు, ఏకేశ్వరసిద్ధాంతం, నిర్గుణోపాసన-యివన్నీ అతి సామాన్యుల్లో వ్యాపించి నాటుకొని పోయినవి. కాశ్మీరం మొదలుకొని కన్యాకుమారి వరకు, సింధు మొదలుకొని అస్సాంవరకు భారతమంతా ఆత్మపరమాత్మ, జన్మ పునర్జన్మ, నిర్గుణబ్రహ్మ భావనలు, కర్మ సిద్ధాంతజ్ఞానం, ఏకేశ్వర వాదం సామాన్య జనుల్లో ఒక్కవిధంగా వ్యాపించిఉన్నాయంటె నాథ సంప్రదాయికుల ప్రచార ప్రభావమే కారణం. నాథ సంప్రదాయంచేత ప్రేరేపితులై అనేకప్రాంతాల్లో నిమ్నజాతులవారెందరో తత్వజ్ఞాన సంపన్నులై తత్త్వ పదాలను, పాటలను రచించారు.

కొంతకాలానికి నాథ సంప్రదాయం ఆయా భక్తి ఉద్యమాల ప్రభావానికి గురై వివిధ ప్రాంతాల్లో వివిధ రూపాలను ధరించింది. ఉత్తర భారతంలో నాథ సంప్రదాయం వైష్ణవభక్తి, రామోపాసన, సూఫీప్రేమ తత్త్వాల ప్రభావాలకు గురై ఒక గొప్ప భక్తి ఉద్యమంగా పరిణమించి సాహిత్యాన్ని ప్రజలను ప్రభావితం చేసింది. రామోపాసనను అంగీకరించిన నాథ సంప్రదాయికులు అజన్మ బ్రహ్మచారిఅయిన హనుమంతుణ్ణి యోగసిద్ధికల వానిగా చిత్రించుకొని తదుపాసన చేయటం కూడ ప్రారంభించారు. యోగసాధనలకు నిలయాలైన మఠాలన్నీ రామనామ జపం చేసే గుళ్ళుగా మారినవి. హనుమంతుని పాత్ర విశేషంగా వున్న రామాయణంలోని సుందరకాండం వారికి పారాయణ యోగ్యమైంది. నాథ సంప్రదాయం విఠలదేవుని భక్తితో మహారాష్ట్ర దేశంలో వార్కరీ సంప్రదాయం పేరుతో వ్యాపించింది. ముస్లింమత సిద్ధాంతాలచేత ప్రభావితమై నాథసంప్రదాయం పంజాబ్‌లో సిక్కుమతంగా పరిణమించింది. బెంగాల్‌లో నాథసంప్రదాయం చైతన్యుని వైష్ణవ భక్తితో లుప్తమైంది. ఇక ఆంధ్రదేశంలో, గుంటూరు, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల్లో సిద్ధ సంప్రదాయం, వజ్రయానం వ్యాపించి వుండేవి. అవి క్షీణించటంతో వాటి స్థానాన్ని నాథ సంప్రదాయం సులభంగా తీసుకొన్నది. సిద్ధ, నాథ సంప్రదాయాలు, మంత్ర తంత్రవిద్యలు రాయలసీమ ప్రాంతంలో బాగా లోతుగా పాతుకొనిపోయినవి. అందుకే అక్కడ యిప్పటికి యోగులు, బాబాలు పుట్టువున్నారు. అంటె సూత్రం తెగకుండా యోగుల సంప్రదాయం ఆ ప్రాంతంలో యింకా కొనసాగుతూనే వున్నదన్న మాట। నాథ సంప్రదాయాన్ని వ్యాపింపజేసిన గోరఖ నాథుడు అసలు ఒకే ఒక వ్యక్తి అని అంగీకరించి నట్లయితే అతడు ఆంధ్ర దేశంలో పుట్టి నేపాల్ వరకు పయనించి తన సంప్రదాయాన్ని ప్రచారం చేసాడని చెప్పాలి. నవనాథుల్లో గోరఖనాథుడు, చౌరంగి అని పిలువబడే సారంగధరుడు యిద్దరు ఆంధ్ర దేశంలో పుట్టినవారని ఐతిహ్యం. నేపాల్ మొదలుకొని రాయలసీమ వరకు నాథ సంప్రదాయం సామాన్య జనుల్లో అతి ప్రచారంలో వుండేది. ఆంధ్రదేశంలో వీరశైవ విజృంభణతో నాథ సంప్రదాయం. వీరశైవంలో అంతర్భాగంగా కూడ ప్రజల్లో వ్యాపించి వుంటూ వచ్చింది.

ఆంధ్రదేశంలో నాథ సంప్రదాయం పూర్తిగా యెప్పుడూ నశించలేదు. ప్రాంతీయ బోధకుల వ్యక్తిత్వ ప్రభావంతో నాథ సంప్రదాయం రూపాన్ని మార్చుకుంటూ వచ్చింది. రాయలసీమలో యెప్పుడోగాని నాథ సంప్రదాయం అచల మార్గమనే పేరుతో కూడ వ్యాప్తిలోకి వచ్చింది. శతాబ్దాలుగా ఆంధ్రదేశంలో సామాన్య జనుల్లో వ్యాపించివున్న నాథ సంప్రదాయాన్ని క్రీ. శ. 15, 16

శతాబ్దాల్లో ఉప్పెనలాగ వచ్చిన వైష్ణవమత వ్యాప్తి ముంచెత్తింది. యోగ సంప్రదాయం విష్ణువును ఆలంబనగా కూడ గ్రహించి కొంతవరకు ప్రచారంలోకి వచ్చింది. అయినా మూల యోగ సంప్రదాయం పూర్తిగా చావలేదు. వైష్ణవమత ప్రభావం అంతరించగానే క్రీ. శ. 17వ శతాబ్దంలో అంటె తాళికోట యుద్ధం తర్వాత మళ్ళా సామాన్య జనుల్లో తలెత్తింది. విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత దేశంలో యేర్పడిన నిరాశా నిస్పృహల మధ్య యీ యోగ సంప్రదాయం ప్రజల్లో వ్యాపించింది. సామాన్య జనుల్లో యెంతోమంది బోధకులు, గురువులు బయలు దేరారు. వారు బోధించిన నీతి, ఆధ్యాత్మిక తత్త్వాలు, కాలజ్ఞానాలు ప్రజలకు యేదో కొంత ఆశను కల్పించినవి.

అట్లా తమ తత్త్వగీతాల చేత ప్రసిద్ధికెక్కిన వారు వేమన, వీరబ్రహ్మం, సిద్దయ్య మొదలైనవారు. వేమన ఒక మతాన్ని స్థాపించకుండా సంచారం చేస్తు తాను చూచిన కుళ్ళును నిరసిస్తు నీతి, ఆధ్యాత్మికతత్త్వాలను బోధించే పద్యాలను చెప్పాడు. వీరబ్రహ్మం మతాన్ని స్థాపించి, శిష్య ప్రశిష్య వర్గంతో ఆచార్య పీఠాన్ని అధిష్ఠించాడు. యోగసాధన, తద్వారా ఆత్మపరమాత్మల కలయిక, నిర్గుణోపాసన, అద్వైత తత్త్వాలను వీరబ్రహ్మం బోధించాడు. గంభీరమైన ఆధ్యాత్మిక, యౌగికజ్ఞానాన్ని అతను, అతని శిష్యులు సిద్దయ్య మొదలైనవారు సులభమైన భాషలో పాడుకోటానికి వీలైన పదాలుగా రచించారు. ఒకొకసారి సరళమైన ప్రతీకలను తీసుకొని అశిక్షితులైన జనులకు వీరు యోగరహస్యాలను బోధించినారు — "కాయమను పుట్టలోను చందమామ, జంటనాద స్వరములాద చందమామ, పామును పెకలింపవలెను చందమామ, తొమ్మిది వాకిళ్ళ మూసి చందమామ, పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ...." అని కుండలినీ శక్తిని పాముగా ప్రతీకాత్మకంగా చెప్పబడింది. "ఊదురు కొలిమి తిత్తుల సమరసము తెలియవలెరా, వాద భేదములు నడచి యాత్మను శోధింపగవలెరా, ఒకటి మొదలు వృక్షము లెక్క మిక్కిలి కొమ్మలురా, ఎక్కిచూచిన యెంతో పొడుగు నాకాసంబంటెందిర, రొక్కమైన పండొక్క కొమ్మయు చేతికి చిక్కదురా ఒప్పుగ దెలిసినవారికి పంపుయొద్దనే యున్నదిరా" ॥ఊదురు॥ — అని యోగసాధన, పరమాత్మజ్ఞానం ప్రతీకాత్మకంగా సుబోధకంగా చెప్పబడినవి. నాథసంప్రదాయికులు కుల భేదాన్ని నిరసించారు. "ఏ కులమని వివరమడిగితే యేమని తెల్పుదు లోకులకూ పలుగాకులకు దుర్మార్గులకు యీ దుష్టులకూ.." అని అంటాడు సిద్దయ్య. కులమెంచానేల గుణము కారణము కుల బిందు కులమాయె కులమెక్కువేది ॥కులమెంచా॥ యోని లింగము రెండు ఏకమై తరచుగా యోనిలో పిండము వెలసెనపుడు, యోని ప్రజాపతులు యెనసిపుట్టిన కులము ఘనమైన కులమెంచగానేల గుణమే కారణము ॥ కులమెంచగా ॥ - అని సిద్దయ్య గుణమే ప్రధానం కాని కులం కాదని అన్నాడు. వేమనకూడ కులవ్యవస్థను నిరసించాడు. విగ్రహపూజలను, మూఢాచారాలను, అగ్రకులజుల అత్యాచారాలను తిట్టిపోసాడు. వీరబ్రహ్మంలాగ వేమన గృహస్థ జీవితాన్ని గడపలేదు —

"సతుల గవయనేల సుతుల బడయనేల
వెతలు పడగనేల వెర్రితనము
నేలమీది రాయి నెత్తికెత్తినయట్లు
విశ్వదాభిరామ వినుర వేమ."

అని అంటాడు వేమన.

వేమన నాథ సంప్రదాయికుడు. కాబట్టి శివుడు ఆలంబనగా గల యోగసాధనను, నిర్గుణోపాసనను అంగీకరించినాడు. అందుకే అతడు మూఢవిశ్వాసాలకు నిలయమై ప్రజలను తప్పుడుత్రోవను పట్టించే వైష్ణవ, శైవ, వీరశైవాదులను అతడు విమర్శించాడు. సిద్ధ సంప్రదాయంలోని రసవాద విద్యను నాథ సంప్రదాయికులు కొందరు కొన్ని ప్రాంతాల్లో సాధన చేసారు. రాయలసీమ దట్టమైన అడవులో రసవాద విద్యను సాధించే యోగసాధనలు చేసే నాథ యోగులు వేమన నాటికి వుండి వుంటారు. అటువంటి యోగి ఒకడు వేమనకు గురువైనాడు. అందుకే వేమన రసవాదవిద్యను కూడ ప్రయత్నించాడు. నాథ సంప్రదాయంలో నిర్గుణ ఈశ్వర భావన శూన్యభావంగా పరిణమించింది. ఈ శూన్యభావనకూడ బౌద్ధ, సిద్ధ సంప్రదాయం నుంచి వచ్చిందే. వేమన 'బయలు' అంటె శూన్యాన్ని గురించి యిట్లా అంటాడు—

"బయలందు పుట్టె సర్వము
బయలందే లీనమయ్యె బ్రహ్మండంబుల్ .."

"బయలు బ్రహ్మ మనుచు భావింపు చుండుము
బయలుఁ జూడఁ దాను బ్రహ్మమగును
బ్రహ్మమైన బయలు భావమందుంచరా...."

అర్థంలేని కర్మకాండను, మూఢాచారాలను, తీర్థయాత్రలను వేమన నిరసించాడు —

"కాశిపోదుననుచు గడి కట్టగా నేల
కాశి తీర్థమునకుఁ గదలనేల
దోషకారికెల్ల దొరుకురా యా కాశి...."

శరీరంలోనే సమస్త బ్రహ్మాండమున్నదని వేరే తీర్థయాత్రలకు పోయే అవసరం లేదని నాథ సంప్రదాయికుల విశ్వాసం.

కర్మ సిద్ధాంతాన్ని బౌద్ధ జైనంలో వలెనే నాథ సంప్రదాయికులు అంగీకరించారు —.

"పాపమనగ వేరె పరదేశముల లేదు
తనదు కర్మములను దగిలియుండు...."

అని అంటాడు వేమన. వేమన నీతి బోధించే పద్యాలను కూడ యెన్నిటినో వ్రాసాడు —

"కలిమినాడు నరుడు కానడు మదమున
లేమినాడు మొదలె లేదు పెట్ట
కలిమిలేమి లేని కాలంబు కలుగునా...."

"అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచెముండుటెల్ల కొదువగాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా...."

"తామసించి సేయందగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయదెచ్చి పడవేయ ఫలమౌనె...."

"తల్లిదండ్రిమీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా...."

"గుణవతియగు యువతి గృహము చక్కగనుండు
చీకటింట దివ్వె చెలగు రీతి
దేవియున్న యిల్లు దేవాలయ గృహంబు...."

ఇట్లా యెన్నో పద్యాలను ఉదాహరణలుగా యియ్యవచ్చును.

వేమన కులవ్యవస్థను, విగ్రహపూజలను నిరసించాడు—

"మాలవాని నేల మరి మరి నిందింప
నొడల రక్తమాంస మొకటెగాదె
వానిలోన మెలగువాని కులంబేది...."

"శిలలఁజూచి నరులు శివుడని మెత్తురు
శిలలు శిలలెగాని శివుడుగాడు
తనదులోని శివుని దానేల తెలియడో...."

వేమన మూఢవిశ్వాసాలను, అర్థంలేని కర్మకాండలను నిరసించాడు. ఇదంతా హేతువాదంగా అభ్యుదయ భావాలుగా ఆధునికులను ఆకర్షించినవి. వేమనను ఆధునిక సిద్ధాంతాల వెలుగులో పరిశీలించటం ప్రారంభించారు. వేమన చెప్పిన అభ్యుదయ భావాలుగల పద్యాలను మాత్రమే తీసుకొని అతన్ని 'ప్రజాకవి' అని అంటున్నారు. కాని అతని నీతి, ఆధ్యాత్మిక తత్త్వంగల పద్యాలను పట్టించుకోవటం లేదు. కొన్ని వందల సంవత్సరాలకు పూర్వమే భారతదేశాన్ని ఊపేసిన మత సందాయాన్ననుసరించి ఆ సిద్ధాంతాలనే వేమన తేట తెనుగులో వ్యక్తం చేసాడు. అతని పద్యాలను పూర్తిగా నాథ సంప్రదాయ సిద్ధాంతాల వెలుగులో పరిశీలిస్తే వేమన కబీరువలె ఒక 'సంత్‌కవి'గా నిలబడుతాడు! ఇప్పుడు లభించే వేమన పద్యాల భావాల్లో అస్పష్టత, పరస్పర ఖండనంతో కూడిన గందరగోళం కన్పిస్తున్నదంటె పామరుల్లో యెందరో వేమన అవతారాలుగా జన్మించి చెప్పిన పద్యాలే కారణం.

వేమన పద్యాలైనా, వీరబ్రహ్మం సిద్ధయ్యల తత్త్వాలైనా ఆధ్యాత్మిక, దార్శనిక, నీతి సందేశాలతో యోగ విద్యాబోధనలతో స్పష్టమైన, సరళమైన భాషలో వ్రాయబడినవి. వీటిల్లో సరసత్వం కనబడదు. వైష్ణవ భక్తకవుల కవిత్వంవలె నాథ యోగ సంప్రదాయానికి చెందిన భక్తయోగకవుల కవిత్వం రసప్లావితంకాదు. కాని వీరి కవిత్వం పాఠకులకు నీతి జ్ఞాన బోధలను, మనఃశాంతిని కలిగిస్తుంది. నాథ యోగ సంప్రదాయ కవులు నిస్సంగులై సంచరించేవారు. గృహస్థ జీవితం మీద వారికి అసహ్యం. సమస్త లోభాలకు మూలకారణం స్త్రీ అని ఆమెను నిందించటం కూడ చేసారు. వైష్ణవ భక్తకవులు అట్లాకాదు. వారు గృహస్థ జీవితాన్ని సంపూర్ణంగా అనుభవిస్తు కర్మఋణ్యులై ఇహలోక పరలోక సాధన చేసారు. సమస్త లోభాల నడుమ జీవిస్తు ఆత్మనిగ్రహం చూపాలంటారు వీరు. వీరబ్రహ్మం సంసార జీవితాన్ని గడిపాడంటె అది వీరశైవమత ప్రభావమే కారణం. వేమన సంసార జీవితాన్ని రోసి నిస్సంగుడై సంచరిస్తు ఆధ్యాత్మికతత్త్వాన్ని యోగ రహస్యాలను నీతిని ప్రజలకు బోధించాడు. నిత్య జీవితంలోని దాంబికతను నిరసించాడు. వీరబ్రహ్మం, సిద్ధయ్యలు నీతినికాక ఆధ్యాత్మిక తత్త్వాన్ని యోగసాధనా రహస్యాలను ప్రజలకు బోధించారు.

డా॥ ముదిగంటి సుజాతా రెడ్డి

# లేఖ

## శాస్త్రీయ దృక్పథం - ఒక చర్చ

"శాస్త్రీయ దృక్పథం - ఒక అవగాహన" అనే మకుటంతో నేను రాసిన వ్యాసాన్ని (భారతి, మార్చి 1982) పరామర్శిస్తూ శ్రీ భట్టిప్రోలు కామేశ్వరరావుగారు సుదీర్ఘంగా వ్యాఖ్యానించినారు. (1982 నవంబరు, భారతి) వారి వ్యాఖ్యలలోని కొన్నింటిలో ఔచిత్యం లోపించి ఉండడంవల్ల ఈ విమర్శ చేయవలసి వచ్చింది.

"నిర్ధారించడానికి తగిన అవకాశం లేనంత మాత్రాన సిద్ధాంతాన్ని తీసిపారేయకూడదు."— అని అనడం అశాస్త్రీయమని ఆయన రాసినారు. ఇది తప్పు అవగాహన అని చెప్పడానికి ఒకే ఒక్క ఉదాహరణాన్ని చెబుతాను. అది కూడా ఆ వ్యాసంలో ప్రస్తావించిందే. సంపూర్ణ సూర్యగ్రహణంనాడు జంతువుల ప్రవర్తనా సరళి, జీవక్రియా వ్యవస్థ మొదలైనవి ఏవిధంగా మారుతాయి ? అసలు మారుతాయా ? అని ప్రపంచ ప్రసిద్ధి చెందిన శాస్త్రవేత్తలు ఎన్నో ప్రయోగాలు జరిపినారు. కొన్ని స్పష్టమైన భేదాలను కనుక్కోగలిగినారు. (నేను కూడా నత్తల శ్వాసక్రియా విధానములో, ఆక్సీకరణ - క్షయకరణ వ్యవస్థను ప్రభావితంచేసే ఎంజైమ్‌ల వ్యవస్థలో మార్పురావడం గమనించినాను). అయితే ఈ మార్పు నిజంగా గ్రహణంవల్లే వచ్చిందా అంటే, గ్రహణం లేని రోజులలో ఆ మార్పు రాలేదుకాబట్టి, అవును అని చెప్పవచ్చును. అయితే మళ్ళీ గ్రహణం వస్తే అటువంటి మార్పే మళ్ళీ వస్తుందా అంటే చెప్పడం కష్టం. ప్రకృతి పరంగా కలిగే ఎన్నో మార్పుల ప్రభావం జీవులపైన ఉంటుంది. కాబట్టి అన్నిసంపూర్ణ సూర్యగ్రహణాలప్పుడూ జంతువులు ఒకే విధంగా ప్రవర్తించక పోవచ్చును. ప్రవర్తించ వచ్చును కూడా. అయితే నిర్ధారించడానికి ఏ మాత్రం అవకాశం లేదు. అంతమాత్రాన ఈవాదాన్ని, అశాస్త్రీయ మంటారా ? అలా అనడం సరియైనదేనా ? ఆలోచించు కోవలసిన అవసరం లేదా? సిద్ధాంతం అను కొన్నా అభ్యంతరం లేదు. ఈ విషయాన్ని రచయిత స్పష్టంగా గుర్తించవలె.

ప్రకృతిని అర్థం చేసుకోవడమే 'సైన్స్' కాని విశ్లేషించడానికి వీలుకాని పరిసరాలను సయితం 'బేసిక్ రీసర్చ్' పేరుతో "ఎక్స్‌ప్లాయిట్" చేయడం 'సైన్స్' కాదు. అది 'సైంటిఫిక్ ఎప్రోచ్' కానేకాదు. ఈ అవునా? కాదా? తెలుసుకోవడానికి 'ఫిలాసఫిక్ టెన్షన్' అవసరము. ప్రతి సిద్ధాంతం వెనుక ఈ విధమైన తర్కబద్ధమైన చర్చ ఉండడాన్ని రచయిత గుర్తించక పోవటం విచారకరం. కామేశ్వరరావుగారు శాస్త్రవేత్తలు ప్రకృతి వాదులని, నేను ఈశ్వరవాదినని అభిప్రాయపడ్డారు. ప్రకృతి, ఈశ్వరుడు ఒక్కటే అనుకొంటే వచ్చిన నష్టమేమీ లేదు. ప్రకృతిశక్తైనా, ఈశ్వరశక్తైనా ఒక అజ్ఞాతశక్తి ఉందనేది వాస్తవం. అది శాశ్వతసత్యం. అంతేకాదు అదేనాటికి తెలిసిరాలేదనేది కూడా ఒక నగ్నసత్యం. ఉదాహరణకు "బెర్ముడా ట్రయాంగిల్"ను పేర్కొంటాను. అక్కడ ఏ శక్తి పనిచేస్తోందో ఇంతవరకు ఎవరికీ తెలియడం లేదు. తెలిసే అవకాశమూ లేదు. అంత చిన్న 'ఫ్యాక్టర్', అదే తెలియనప్పుడు ప్రకృతి పరంగా దాగి ఉన్న అజ్ఞాతశక్తి తెలుస్తుందని ఆశించడం సబబేనా? ఇందులో దృఢ విశ్వాసాన్ని పెంచుకొనే ప్రసక్తిలేదు. యదార్థాన్ని గుర్తించే విజ్ఞత మాత్రమే ఉన్నది. దీనిని రావుగారు తెలుసుకోవలె.

ఒక్కమాట. శాస్త్రవేత్తకైనా, తత్వవేత్తకైనా పిడివాదం పనికిరాదనే వాస్తవాన్ని గుర్తుపెట్టుకోవడం ఎవరికైనా ముఖ్యం !

డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు
తిరుపతి



# గ్రంథ విమర్శలు

## మూడు నూతన గ్రంథాలు

### శ్రీమద్భగవద్వాణి

[శాంతిసాధన. గీతానుసరణ పద్యకృతి. కర్త: కవిశేఖర శ్రీ కర్రా త్రిమూర్తి కవి. డెమ్మీ సైజు 28+180+14 పేజీలు. వెల : 10 రూ. ప్రచురణ - ఆంధ్ర సాహితీ ప్రచార సభ, కెల్విన్ లైన్ 1/4, తాల్పుకూర్ పోస్టు, 24 పరగణాల జిల్లా, పశ్చిమ బెంగాల్. ప్రతులకు - శ్రీ కర్రా త్రిమూర్తికవి, ఆదివారప్పేట, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా.]

భగవద్గీతకు ఇదివరకు గద్య పద్య, గేయాది ప్రక్రియలలో తెలుగులో ఎన్నో అనువాదాలు వచ్చాయి. ఇంకా వస్తున్నవి. కొన్ని అనువాదాలుగా కాక మూలాభిప్రాయాన్ని వివరించే అనుసరణలూ ఉన్నవి. అట్టి అనుసరణలలో ఈ పుస్తకం ఒకటి.

రచయిత భగవద్గీతకు భగవద్వాణి అని పేరుపెట్టి శాంతసాధన అని నామాంతరంకూడా ఉంచారు. అధ్యాయాలను విన్యాసాలనీ 'అర్జున విషాదయోగము' మున్నగు అధ్యాయ నామాలలోని చివరి 'యోగానికి' 'గీతి' అనిన్నీ పేర్కొనడం దీని నవ్యత. మూలశ్లోకాలలో కొన్నిటి అభిప్రాయం పద్యంలో విపులంగా చెప్పబడింది. కొన్నిటి అభిప్రాయాలు యథాతథంగా పద్యాలలో ఇమడ్చబడినవి. రెండుమూడు శ్లోకాలకు ఒకేపద్యం చెప్పడం, ఒక శ్లోకానికి రెండేసిపద్యాలు చెప్పడంకూడ కానవస్తుంది. పద్య రచన నిరాఘాటంగా అర్థం సులభంగా బోధపడే పద్ధతిలో కొనసాగింది. సుప్రసిద్ధ పండితులు వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, కర్రి వేంకట సుబ్బారావుగారు మున్నగువారి ప్రశంసలను అందుకొన్న రచన యిది. వదాన్యుల ఆర్థికసహాయంతో పుస్తకం చక్కగా తయారయింది. పశ్చిమ బెంగాల్‌రాష్ట్రం లోని 24 పరగణాలజిల్లా తాల్పుకూర్ లోని ఆంధ్రసాహితీ ప్రచార సభవారు దీనిని ప్రకటించారు రాష్ట్రేతరాంధ్రుల ఆంధ్ర సాహిత్యాభిమానానికి ఇది తార్కాణ.

సులభశైలిలో రచింపబడిన యీ పద్యకృతి భగవద్గీతా జిజ్ఞాసువుల ఆదర ప్రోత్సాహాలను అందుకొనగలదని భావిస్తున్నాను.

### తులసీ రామాయణము
(సుందర కాండము)

[అనువాదకులు శ్రీ కుట్టుపల్లి ఆదినారాయణ. క్రౌన్ సైజు 64+4 వెల 2 రూ. ప్రకాశకులు- తులసీ నికేతన్, సంగడిగుంట, గుంటూరు - 3]

రామాంజనేయ భక్తాగ్రగణులు, తులసీదాసుపట్ల ప్రగాఢ గౌరవాభిమానాలు కలవారు అయిన ఆదినారాయణగారు తులసీదాసు 'రామచరితమానస'ను వచనంగా తెలిగించి యిదివరకే ఆంధ్రుల ఆదరాన్ని పొంది యున్నారు. ఇప్పుడు ఆ రామాయణంలో ప్రధానమైన సుందరకాండను ప్రత్యేకంగా ప్రకటిస్తున్నారు. దీనితోపాటు తెలుగునాట సుప్రసిద్ధంగా ఉన్న ఆంజనేయదండకం, ఆంజనేయ స్తుతి శ్లోకాలు, హనుమాన్ చాలీసా, హనుమాన్‌జీ ఆరతి దీనికి అనుబంధాలుగా చేర్చబడినవి. సంకలనకర్త అంతతో తృప్తిపడక భగవద్గీతలోని పద్దెనిమిది అధ్యాయాలలోని పద్దెనిమిది ముఖ్యమైన శ్లోకాలను తీసుకుని తాత్పర్యంతో కూడా ఇచ్చారు. ప్రార్థనా శ్లోకాలతోసహా ఉన్న ఆ శ్లోకాలకు 'గీతాసార' మని పేరు పెట్టారు.

పుస్తకం చివర నాలుగుపేజీలలో, తామిదివరలో ప్రకటించిన 'తులసీరామాయణం'పై వివిధ పత్రికలలో పడిన సమీక్షలను చేర్చారు. దీని 'ముందుమాటలో' 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు దీనిపై సదభిప్రాయాన్ని ఇచ్చారు.

ఆదినారాయణగారి వచనరచన సరళంగా సాగింది. తులసీదాసు మహాకవి 'రామచరితమానస' లోని అభిప్రాయాలను సంగ్రహంగా ఇదితెలియజేస్తున్నది.

బహుళప్రచారంలో ఉండి, ఆంధ్రులందరిచేతా ఆదరించబడుతూ ఉన్న ఆంజనేయదండకం, హనుమాన్ చాలీసా

కూడా దీనిలోకలిసి వుండడంవల్లనూ,. దురవగాహమైన భగవద్గీతసారాన్ని పద్దెనిమిది శ్లోకాల్లో తాత్పర్యసహితంగా సంగ్రహంగా ఇందులో ఇయ్యబడినందువల్లనూ ఇది అందరికీ మిక్కిలి ఉపయోగించగలదని చెప్పవలసి ఉన్నది.

## నృసింహ సాంఖ్య దర్శనం

[శ్రీ రాజ్ఞీ నృసింహమహాగ్నిచిత్ ప్రణీతం. పయోదా పరనామం గల 'చక్రవాకి' ఆంధ్ర తాత్పర్య సహితం. **తాత్పర్యకర్త** : శ్రీశ్రీశ్రీ పరిపూర్ణ ప్రకాశానందభారతీ స్వామివారు. డెమ్మీసైజు 10+71పుటలు. వెల 5 రూ.లు. ప్రాప్తిస్థానములు-(1) శ్రీ పరిపూర్ణ ప్రకాశానంద భారతీ స్వామివారు, కేర్ శ్రీ అయ్యగారి శ్రీరామమూర్తి, మారుతీ వ్యాయామ కళాశాల యెదుట, పోస్టు- సత్యనారాయణ పురం, విజయవాడ - 520 011 ]

రాణీ **నృసింహ** చయనులుగారే శ్రీ రాజ్ఞీ నృసింహ మహాగ్నిచిన్నామధేయులు. ఆయన వేదవేదాంగాల్లోనూ, శాస్త్రాల్లోనూ గొప్ప పండితులు. లౌకిక వ్యవహారజ్ఞులు. కొంతకాలం కొన్ని ఉద్యోగాలు నిర్వహించి, పిదప సన్యసించినారు. ఆయన ఈ సాంఖ్య దర్శనాన్ని సంగ్రహంగా సంస్కృతంలో సూత్రప్రాయంగా రచించారు. తక్కిన దర్శనాలవలెనే సాంఖ్యదర్శనం దురవగాహమైనది. పూర్వోత్తర మీమాంసలకు, న్యాయవైశేషికాలకు, యోగానికీ ఉన్న ప్రచారం సాంఖ్యదర్శనానికి లేదు. అది మరీ దురవగాహంగా ఉండడమే దీనికి కారణమేమో! ఆ దర్శనాన్ని ఈ మహావిద్వాంసులు సంస్కృతంలో రచించడం వల్ల విద్వాంసులకు తప్ప తదితరులకు దీనివల్ల ఎక్కువ ప్రయోజనంకలుగదని భావించి వారికుమారులూ, బహుముఖప్రజ్ఞాధురీణులు, సకలశాస్త్రవేత్తలూ అయిన శ్రీ వెంకటాచలపతిప్రసాద మహాగ్నిచిత్తులుతండ్రిగారి సాంఖ్యదర్శనానికి పయోద నామాంతరంగల చక్రవాకి అనే తెలుగు తాత్పర్యాన్ని రచించారు. వీరే సన్యసించినతర్వాత 'శ్రీ పరిపూర్ణ ప్రకాశానంద భారతీస్వాము' లయినారు. ఆయన యీ ఆంధ్రతాత్పర్యంతోపాటు సారోపదర్శనం, భావభాస్కరం అనే ఆధ్యాత్మిక గ్రంథాలను చాలసంగ్రహంగా సంస్కృతంలో రచించి తెలుగులో తాత్పర్యం కూడా వ్రాశారు. అవికూడా ఈపుస్తకంలోనే చేర్చబడినవి. ఈరచనలన్నింటిలోనూ కపిలమహర్షి సాంఖ్యసిద్ధాంతం, ఇతర ఆధ్యాత్మిక విషయాలులో సంగ్రహంగా ఉన్నందువల్లను తెలుగులో తాత్పర్యంకూడా చేర్చబడుటవల్లను, జిజ్ఞాసువులకీ సంగ్రహకృతులు మహోపకారకాలని చెప్పవలసి, ఉన్నది. ఇందులో గ్రంథకర్తల జీవిత చరిత్రలు కూడా సంగ్రహించబడినవి. వాటినిబట్టి యీ పితా పుత్రుల ప్రతిభా పాండిత్యాలు వ్యక్తంకాగలవు. ఈ పుస్తకానికి తగిన ప్రచారం లభించవలసి ఉన్నది.

శ్రీ బులుసు వేంకట రమణయ్య

## గతితార్కిక భౌతిక మానవతావాదం

[రచన : త్రిపురనేని మధుసూదనరావు. వెల : రు. 2, ప్రచురణ : విప్లవ రచయితల సంఘం, నెల్లూరు జిల్లా యూనిట్.]

సాంఘిక రాజకీయ ఆర్థిక సమస్యల పరిష్కారానికి మార్క్సిజమ్ ఒక్కటే మార్గమని నమ్మడంలేదు. ఆచరణలో మార్క్సిజమ్ పని చేస్తున్న తీరును బేరీజు వేయడానికి శాస్త్రీయ దృక్పథం అవసరమని నిరూపించగలగడం మరొక అంశం. "మార్క్సిజమ్ ఈజ్ నాట్ ఎ క్లోజ్డ్ బంచ్ అఫ్ డాగ్మాస్" అని యీ నాకు కనిపెట్టిన వారికదొకవింత అయితే కావచ్చునేమో గాని యీ గ్రంథకర్త 16వ పుటలో పేర్కొన్న "బూర్జువా మేధావి ఎమ్. ఎన్. రాయ్" తనువ్రాసిన "ట్వెంటియత్ సెంచర్ ఫిజిక్సులో 1930 దశకంలో యీ సంగతిని ఉపపత్తులతో విశదం చేసిన సంగతిని వి. ర. సం. వారి సంగతేమోగానీ చాలామంది మార్క్సిస్ట్ మిత్రులు అంగీకరించునారు. "ఇతర దేశాల్లో వుందో లేదో తెలియదుకానీ మనదేశంలో కొద్దిమంది మేధావులకి మాత్రమే పరిమితంగా అయినా నవీన మానవతావాదం ఒకటి వుంది" అని యీ రచయిత అంటున్నారు. ఈ వాక్యం గురించి వ్రాయవలసినదీ, విమర్శించవలసినదీ చాలా వున్నది గానీ ఒకమాట చెపితే సరిపోతుంది. ఎమ్. ఎన్. రాయ్ సాహిత్యం గురించి యీ రచయితకు పరిచయం లేదు సరిగదా ప్రపంచ హ్యూమనిస్టుల సంఘం శ్రీ వి. ఎమ్. తార్కుండేను గౌరవించిన చిన్న సంగతయినా తెలియదనిపించుతుంది. ఎందుకనంటే తెలిసేవుంటే "ఇతర దేశాల్లో వుందో లేదో తెలీదుకానీ" అని విజ్ఞుడయిన యీ సిద్ధాంత వ్యాఖ్యాత, పండితుడు అని వుండేవాడుకాదు. అది ఆయన అభిప్రాయం. మరి ఆ అభిప్రాయం కలగడానికి ఆధారాలేమిటో పుస్తకం నిండా ఉటంకింపులనిచ్చిన యీ మేధావి వ్రాయనవసరం లేదా? అంతకు ముందు "వ్యక్తిని మాత్రమే ఆశ్రయించిన ఏదీ కూడా

మానవతావాదం కానేరాదు" అన్నాడు ఈ రచయిత. వ్యక్తిని కాక దేన్ని ఆశ్రయించాలో సెలవియ్యలేదు యీ వి. ర. సం. ప్రవక్త.

గతి తార్కిక భౌతికవు, నవతావాదం అనే కొత్త పద సమామ్నాయాన్ని వాడుకలోకి తీసుకురాగలిగిన యీ రచయిత మానసిక మానవతావాదానికి సైన్సు ఆధారమని అంగీకరించాలిగదా? ఇంతకూ యీ వ్యాసం ఎవరిని ఉద్దేశించి ఇంత వివరంగా వ్రాసినట్టు? గతి తార్కిక భౌతిక మానవతావాదం అనే కొత్త పదజాలానికి మార్క్స్ గ్రంథాల్లోంచి ఇన్ని ఉటంకింపులు ఇచ్చిన యీ రచయిత ఎమ్. ఎన్. రాయ్ వ్రాసిన (క్రోడీకరించిన) "న్యూ హ్యూమనిజమ్" అనే గ్రంథాన్ని చదువలేదనుకుందామా? ఎమ్. ఎన్. రాయ్ వ్రాసిన రొమాంటిజమ్, రేషనలిజమ్ అనే రెండు భాగాల గ్రంథం పేరు యీ మేధావికి వినిపించలేదా? పాఠకులు మన్నించాలి. మానవవాదంలో, మానవతావాదం లేదని వాదించే మేధావితో చర్చించటం అనవసరమని విన్నవించుకున్నందుకూ బాధలలో ఉన్నవాడికి, కష్టాలలో ఉన్నవాడికి 'పాపం' అని ఏదో కొంత సహాయం చేయడం మానవవాదం అవుతుందనీ, మానవతావాదం కాజాలదని వాదించడం గతి తార్కిక భౌతికవాదం ఎలా అవుతుందో వివరించితే సమంజసంగా ఉంటుంది.

ప్రతిదానికిగల ఇంటర్ రిలేటెడ్ నెస్, ఇంటర్ కనెక్టెనెస్‌ను చూడవలసినదిగా డైలెక్టిక్స్ కోరుతుందని వాదించే యీ రచయితకు యూరోపియన్ దేశాలలోని బూర్జువా వాదం మనదేశ చరిత్రకు వర్తించదనీ, నవ్యమానవవాదానికి మార్క్సిజానికిగల సంబంధం తెలియదనీ అనుకుందామా? గతి తార్కిక భౌతిక మానవతావాదం అనేదొకటి కలదని మార్క్సిస్టులలో ఎంతమంది అంగీకరించుతారు? ఈ మాటలలోని 'గతి' అనే పదానికి వివరణ యేమిటి? 'గతి' అంటే చరిత్ర తీరా? ప్రకృతి తీరా? తార్కికవాదం మాత్రం చరిత్రకు, ప్రకృతికీ వ్యాఖ్యానం ఇవ్వదా? "మానవుడు కేవలం ప్రకృతి పరిణామ ఫలితమే కాదు. మనిషి సామాజిక రాజకీయ వుత్పత్తి" అన్నారు ఈ రచయిత యీ పుస్తకం 18వ పుటలో. ప్రకృతి పరిణామం నుంచి సామాజిక రాజకీయ వుత్పత్తి వేరని యీ వ్యాఖ్యాత సిద్ధాంతమా? అదే అయితే దాన్ని బలపరచే ఆధారాలను ఇచ్చి వుండాల్సింది.

"తొలి మానవతావాదం ఆధునిక విజ్ఞాన శాస్త్రాల నుంచి పుట్టి సామాజిక జీవితంలో ప్రవేశించింది" 8వ పుట. ఇక్కడ తొలి మానవవాదం అంటే ఏమిటి? మానవచరిత్రకు మానవతావాదం నుంచి విడదీయడం సాధ్యమా పరిణామ వాదులకు. మానవ చరిత్ర ప్రారంభమయినప్పటినుంచీ వివిధ స్థాయిలలో మానవతావాదం వున్నదని చరిత్రతో పరిచయం వున్నవారందరూ అంగీకరించుతారు. అయితే అది శాస్త్రీయ మానవతావాదం అవునా కాదా అన్నది వేరే అంశం. మానవుడినుంచి మానవతను విడదీయడం సాధ్యమా?

వ్యక్తిచైతన్యం అమలులోనున్న సామాజిక పరిస్థితుల వ్యాపారం (Function) అనే విషయాన్ని వివరించాలి. ఫంక్షన్ అనే ఆంగ్ల పదానికి వ్యాపారం అర్థం చెప్పడం సమంజసమేనా? ఈ రచయిత గురు స్థానంలో వున్నారు కనుక ఏ మాటకయినా ఏమయినా అర్థం చెప్పగల సమర్థులు. కానీ ఒక విషయం గమనించడం అసందర్భంకాదు. ఏవేవో గ్రంథాలు చదవలేదని ఎవరెవరినో నెపమెన్నిన యీ "గురువు"గారు తన 35 పుటల పుస్తకం నిండా కొటేషన్స్ పుంఖానుపుంఖంగా యిచ్చినంతమాత్రానగానీ, ఇదే గతితార్కిక భౌతిక మానవతావాదం అన్నంత మాత్రానగానీ యీపుస్తకం విలువ పెరగలేదు. పెరగదు. ఇక్కడ తప్పని సరయి ఒక ఇంగ్లీష్ కొటేషన్ ఇవ్వవలసి వస్తున్నది: "Humanism starts from the dictum that 'man is the measure of every thing' (protageres) or "man is the root of mankind" (Marx) and advocates reconstruction of the world as commonwealth and fraternity of free men, by the collective endeavour of spiritually emancipated moral men." ఈ వాక్యం మొదటిలో New అనే ఇంగ్లీషు మాటను చేర్చటం జరిగింది. అంతకు ముందు దీన్నే Radical humanism అన్నాం. ఇప్పుడు Scientific humanism అంటే ఇక గతి తార్కిక భౌతిక మానవతావాదం అనే మాటలనవసరమవుతాయి. త్రి. మ. రావుగారు మరొకసంగతిగమనించాలి. అదేమంటే "Radicalism integrates science into social organisation and reconciles individuality with social life." ఇప్పుడు నవ్యమానవవాదం అని ఎమ్. ఎన్. రాయ్ చెప్పిన దానికి త్రి. మ. రావు గారు వివరించిన గతి తార్కిక భౌతిక మానవతా వాదానికి తేడా యేమిటో మరొక వ్యాసం వ్రాస్తారా?

ఈ గ్రంథకర్త వివరించిన మానవతావాదానికీ న్యూహ్యూమనిజానికి చాలా తేడాలున్నాయ్. భావవాద మానవతావాదాన్నిగానీ అస్తిత్వవాదాన్నిగానీ నవ్యనమానవవాదం అంగీకరించదు. న్యూ హ్యూమనిజమ్ ఒక చరిత్ర నున్నది. క్రిస్టియన్ హ్యూమనిజమ్ వంటి వాటికి భిన్నమయినది న్యూహ్యూమనిజమ్. ఈ వ్యాసంలో జీన్‌పాల్ సార్త్రేను ఎందుకు కోట్ చేసినట్టు? సార్త్రే తాత్విక సిద్ధాంతాన్ని పూర్తిగా అర్థం చేసుకొనకుండా కొన్ని వాక్యాలను ఉదహరించటం కేవలం గడుసుతనం కాదా?

"ఆలోచన, చైతన్యం మనిషి మెదడు ఉత్పత్తులు కాదని ఎవరూ అనలేదు. అనరు. ఈ వాక్యం ఎంగెల్స్ చెపితే ఒక అర్థం. ఎమ్. ఎన్. రాయ్ చెపితే మరొక అర్థం ఇవ్వదు - ఇవ్వరాదు. గతి తార్కికమైనదయినా కాకపోయినా మానవతా వాదం మానవతావాదం కాకుండాపోదు. చరిత్రలోపోలేదు కూడా. ఇక 'భౌతిక' అదే మాటకు ఎవరికి తోచిన అర్థం వారు చెబుతున్నారు. పదార్థం వాదం అని ప్రయోగిస్తే అపచారమేమో తెలియదు. మానవతావాదం గురించి ఈ రచయిత అభిప్రాయాలను ఈ పుస్తకం పరిచయం చేస్తుంది. ఆ అభిప్రాయాలతో ఏకీభవించకపోవడం నేరమా?

శ్రీ వి. ఎస్. అవధాని

# గోదావరి లోయ 'నమ్ము'

[వెల: రు. 3-50 లు. ప్రతులకు: నవయుగ బుక్ హవుస్, సుల్తాన్‌బజారు, హైదరాబాదు; పీస్ బుక్ సెంటర్, సుల్తాన్ బజారు, హైదరాబాదు]

కవిత్వం వ్యక్తిపరమా? సమాజపరమా? అనే చర్చ ఇటీవల కొంతకాలంగా సాగుతున్నది. కవిత్వం బౌద్ధికమైన ఉత్పత్తి. కవిత్వాన్ని తన వైయక్తిక అనుభూతిలోంచి సృష్టిస్తాడు కవి. కనుక కవిత్వం వైయక్తికమేనని వాదించేవారు లేక పోలేదు. కవితాసృష్టి వైయక్తికమే. అయితే పఠనం సామూహికమైనది. కవిత్వం కవి సృష్టి కనుక, కవి వ్యక్తి కనుక తనకోసమే కవిత్వం రాసుకుంటాడా? తన అనుభూతితో తనచుట్టూ విస్తరించిన సమాజానికేమీ సంబంధం లేదా? సమాజాన్నుంచి పారిపోయి తానొక ఏకాంత సౌధంలో, ఎవడికీ పట్టని తన వ్యక్తిగత అనుభూతిని అక్షరబద్ధం చేస్తాడా? దానికి శుద్ధ కవిత్వం అని పేరు పెట్టుకుంటాడా? ఇవన్నీ సవాలక్ష ప్రశ్నలు. ఎవరెన్ని చెప్పినా అనాడూ, ఈనాడూ కూడా కవిత్వం సమాజాన్ని అంటి పెట్టుకునే ఉన్నది. ఈ సమాజంతో మాకేం పనిలేదు అనుకునే 'మేధావి వర్గకవులు' సమాజ బహిష్కృతులే అవుతారు.

నమ్ము గోదావరీలోయ కవితలు, పాటలు ఈ సమాజాన్ని, దానినైజాన్నీ ప్రతిబింబిస్తూ, రావలసిన పోరాటాన్నీ, దాని చైతన్యాన్నీ తీవ్రంగా వ్యక్తం చేసేదిగా ఉన్నాయి. "భౌతిక ఉత్పత్తి లాగానే బౌద్ధిక ఉత్పత్తికి కూడా సమాజమే మూలం. ఒక కవికి మాత్రమే పరిమితంగా ఉండే కవిత్వంకానీ, ఒక శ్రోతకీ ఒక పాఠకుడికీ మాత్రమే పరిమితంగా ఉండే కవిత్వంకానీ ఎక్కడా లేదు. రచనా క్రమం - రచన - పాఠకుడూ, అధ్యయనంచేయటం అన్నీ సామాజికమే" అన్న త్రిపురనేని మధుసూదనరావుగారి అభిప్రాయం స్థూల దృక్కులకు సైద్ధాంతికంగా కనిపించినా సూక్ష్మ దృక్కులకు వాస్తవమనిపించక మానదు. "విప్లవ కవిత్వం కేవలం సాహిత్యోద్యమ ఫలితంకాదు. కేవలం రాజకీయోద్యమ ఫలితంకాదు. సామాజిక విప్లవోద్యమ ఫలితం. సామాజిక విప్లవ పోరాటాల్ని సామాజిక రూపాన్ని పొందే చైతన్యంలోకి అనువదించటం విప్లవ కవిత్వం. విప్లవ చైతన్యం కవిత్వరూపాన్ని పొందటమే విప్లవకవిత్వం" అన్నారు మధుసూదనరావు. ఈ సమాజాన్నీ, దాని వైకల్యాన్ని కవిత్వేతి వృత్తంగా స్వీకరించిన ప్రతికవినీ రాజకీయాలకు తాకట్టు పడినవాడని పరిహసించే శుద్ధ కళావాదులు విప్లవ కవిత్వ నిర్వచనాన్ని సక్రమంగా అర్థం చేసుకోలేదు. ఈ సంకలనంలోని కవితలు రాజకీయపరమైనవా? సమాజపరమైన వేదనకు చెందినవా? అని కవిత్వాన్నీ, సమాజాన్నీ భేదదృష్టితో చూడనివారు ఆలోచించగలరు. వ్యక్తి, వ్యక్తిస్వేచ్ఛ, వ్యక్తివాదం, ఇంటలెక్చువాలిటీ, పొయిటిక్, సెన్సిబిలిటి అని గగ్గోలుపెడేవాళ్ళు ఈనాలుగు పాదాలూ చదివితే క్షేమం.

"కడుపుల్లోకి చీల్చుకు పోయిన
బుల్లెట్ల బాధకన్న
నేలతల్లి నుంచి ఎడబాటు చేసే కుట్ర
బాధాకరమైనది
సంఘటితమైతేనే సహించలేని
కుట్ర యిది
కానీ, సమిష్టి జీవిత తత్వం జనం నరనాల్లో
తర తరాలుగా పారుతూ ఉన్నది
దాన్ని అణ్చేందుకు బుల్లెటతో అన
కట్టను కట్టలేరు.
చక్రవర్తుల మరణ శాసనాన్ని మరొక్క-
సారి చదవండి."

ఒక భావం కవిత్వంగా రూపొందేటప్పుడు కవి అయినవాడు చాలా జాగ్రత్త తీసుకుంటాడు. సిద్ధాంత నినాదం కంటె, సిద్ధాంత భావన కళాత్మకమైనపుడు దాని శక్తి అనంతంగా మారుతుంది. కళకున్న ఈ శక్తిని కళాకారుడు పుష్కలంగా ఉపయోగించుకుంటాడు. క్రియకు ప్రతిక్రియే న్యాయం అనే సత్యాన్ని అత్యంత శక్తిమంతంగా చెప్పాడు కవి.

"బంగ్లాల కోసం
బండల్ని పల్గగొట్టినట్లనే -

వంతెనల కోసం
కొండల్లో బర్మార్ల
పేల్చినట్లనే -
బువ్వ గింజల కోసం
పీరి పొట్టల్ని
భూమ్మీద బాదినట్లనే
మిమ్మల్ని అకలి పాల్జేసి నోళ్ళను గూడా ...."

శ్రమ ఒకడిది; సుఖం మరొకడిది. శ్రమ పడేవాడికి, శ్రమ సుఖాన్ని అనుభవించేవాడికిగల భేదాన్ని చాలా సూక్ష్మంగా, కవితాత్మకంగా చెప్పారు.

"కండల కొండల్లోంచి
చిమ్మిన స్వేద జలం
భూమి 'టర్బయిన్' పై దుమికి
కలవాళ్ళ యిళ్ళల్లో
కాంతులు గుమ్మరిస్తుంది
శ్రమించే గరీబుగాళ్ళ యిళ్ళల్లో
హోరై గర్జిస్తుంది."

ఈ సంకలనంలోని కవితలన్ని పీడిత ప్రజల్లో రావలసిన విప్లవ చైతన్యాన్ని కళాత్మకంగా మలచినవి.

# శృంగార లహరి

[జోశ్యము జనార్ధనశాస్త్రి. వెల : రు. 10-00 లు, ప్రతులకు : జోశ్యము జనార్ధనశాస్త్రి. రిటైర్డు తెలుగు పండితుడు, తాడిపత్రి - 515 411]

ఇది నాలుగు భాగాల కావ్యం. ఒక్కొక్క భాగానికి తరంగం అని పేరు పెట్టారు. మొదటిది దేవతాకం, రెండవది సాంసారికం, మూడవది జానపదం, నాల్గవది నాయికా నాయకం. శృంగార ఏవ ఏకో రసః అని పూర్వాలంకారికులు చెప్పారు. చతుర్విధ పురుషార్థాలకు ధర్మ శృంగారం మూలం కాబోలు శాస్త్రిగారు ధర్మ శృంగారం ప్రధానంగా స్వీకరించారు. శృంగారంతోపాటు సునిశితమైన హాస్యం కూడా కవిగారిలో ఉంది. పద్యాలు అటవెలదిలో రాశారు. అటవెలదికి, శృంగారానికి అవినాభావ సంబంధమేమో ! ఐదు వందల పైబడిన పద్యాల సంకలనం ఇది.

"కోట్ల కోట్ల రెట్ల కొలత బ్రహ్మానంద
సూక్ష్మ రూపపుటిహసుఖ మీసుఖము
భంగుర మనరాదు; రంగారు శృంగార
లహరి దాని భాసురంపు ప్రహరి"

అని శృంగారం మీద శాస్త్రిగారు తమ అభిప్రాయాన్ని వెలయించి ఏ తదభిప్రాయ వ్యక్తీకరణకు ఈ కావ్యాన్ని రచించారు. ఈ కావ్యాలనికి దాశరథిగారు, గౌరిపెద్ది రామ సుబ్బశర్మగారు, ఉత్పల సత్యనారాయణాచార్యగారు విపుల పీఠికలు రాసి ఈ కావ్య తత్త్వాన్ని చదువరికి సుబోధకం చేశారు.

# విశ్వంభర (వచన కవితలో సమగ్ర కావ్యం)

[డా॥ సి. నారాయణ రెడ్డి. వెల : రు. 6-00 లు. ప్రతులకు : ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాద్.]

వచన కవితా ప్రక్రియలో కథా కావ్యాలు రావాలని కుందుర్తి లాంటివారి ఆశ. కథా కావ్యాలు వచన కవితలో రానవసరంలేదని తిలక్ ఏనాడో ఘంటా పథంగా చెప్పారు. డా॥ నారాయణరెడ్డి ఇప్పటి వరకూ కావ్య ఖండికల రూపంలో వచన కవితా సంకలనాలు అనేకం వెలయించటం జరిగింది. మానవ జీవిత మహాప్రస్థానాన్ని ఇతి వృత్తంగా తీసుకొని ఇప్పుడు 'విశ్వంభర' అనే పేరుతో సమగ్ర వచన గేయ కావ్యాన్ని రాశారు. భూమి కూడ మానవ జీవితం ఆరంభ కాలం నుంచీ ఇప్పటిదాకా మానవుడు సాధించిన విజయాలూ, పొందిన పరాజయాలూ, మానవుడుగా బతికాలనే మహత్తర మానవీయ దృక్పథం, స్వార్థం కోసం మనిషి రాక్షసుడుగా మారే ప్రవృత్తి, సమస్త మానవ జీవితానుభూతుల సమగ్ర స్వరూపావిష్కరణ విశ్వంభరలో దర్శనీయ మవుతుంది.

"శిరస్సు జండా ఎత్తి
అరు గేసిన ఉదయం;
పడమటి ఉరి కంబం మీద
వెలుతురు తలను వేలాడ దీసిన
అస్తమయం ఒకటేనేమో !"

మానవుడు పుట్టకముందు ఉదయాస్తమయాలు, ప్రకృతి సౌందర్యం, బీభత్సం అన్నీ ఒక్కటే. విడమరిచే వివేకంలేనప్పుడు జ్ఞానమైనా అజ్ఞానమైనా ఒకటే. పుష్టి మీదున్న కట్టు కథల్ని నమ్మితే

శాసన ధిక్కారం లోంచి జన్మించిన ఆదిమ మానవుడు నుంచి, శాసన ధిక్కారంలోనే తన అస్తిత్వ నిరూపణం చేసుకొనే ఆధునిక మానవుడి వరకూ మనిషి సాగించిన అనేక అన్వేషణల ఫలితం విశ్వంభర కావ్యం.

"గోటికి ఎదురు ఈటె
కోరకు ఎదురు ఖడ్గధార
ఆత్మరక్షణకు నేర్చుకున్న
ఆదిమ పాఠమది."

ఇది ఆదిమ మానవుడు క్రూర జంతువుల నుండి తన రక్షణకు చేసినప్రయత్నం అనాడు మనిషికి జంతువులబాధ. ఈనాడు మనిషికి మనిషి బాధ. మనిషే క్రూరజంతువైనప్పుడు సాయుధమే తప్ప ఆత్మరక్షణకు అన్యమార్గం లేనిస్థితి నేడు. ఈ భావాన్నే నారాయణరెడ్డి మరో పద్ధతిలో చెప్పారు.

"నిన్నటి మట్టి బెడ్డ లేనా
నేడు మండుతున్న స్ఫులింగాలు
నిన్నటి గడ్డి పరక లేనా
నేడు లేస్తున్న ధ్వజ స్తంభాలు
నిన్నటి మేష కంఠాలేనా
నేడు గర్జిస్తున్న కంఠీరవాలు
నిన్నటి దూది పింజలేనా
నేడు ప్రతిఘటిస్తున్న పర్వతాగ్రాలు."

ఈ పాదాలు తెల్లవాడిపై మనం చేసిన తిరుగుబాటు సందర్భంగా కావ్యం ముగింపులో చెప్పినవి. స్వాతంత్ర్యానంతరం స్వదేశీయ పీడనకు వ్యతిరేకంగా పీడితులు సాగిస్తున్న స్వేచ్ఛా సమరానికి పై పాదాలు అన్వయిస్తే ఇంకా బాగుంటుందేమో ! ఎందుకంటే - నారాయణరెడ్డిగారే చెప్పినట్లు

"సమతను సాధించే అడుగు
స్తంభించిపోదు ఒక మేరకు
సాగిపోతూనే ఉంటుందది
సరిహద్దులు దాటి ముందు ముందుకు."

స్వాతంత్ర్యాన్ని అర్ధరాత్రి ఉషోదయంగా నారాయణరెడ్డిగారు సంభావించారు. అసలింకా తెల్లవారలేదని యువ కవులు భావిస్తున్నారు. స్వాతంత్ర్యానంతర భారతదేశ సామాజిక వ్యవస్థపై నారాయణరెడ్డిగారు మరోకావ్యం రాస్తే బాగుంటుంది.

# శిలాలోలిత

[రేవతీదేవి. వెల : రు. 6-50 లు. ప్రతులకు : నవోదయ పబ్లిషర్సు, ఏలూరురోడ్డు- విజయవాడ-2; ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు.]

"నాలోపల నాబాధలు - నా వెలుపల శత జగత్తు ఆక్రోశించిన కరుణా బీభత్సరవాలు" అన్నాడు తిలక్. రేవతీదేవిగారి మానసిక అంతర్ ప్రవృత్తికీ, బాహిరమైన సామాజిక ఆలోచనా విధానానికీ ఈ సంకలనంలోని ఖండికలు నిదర్శనాలు. భాష, భావన పరిపుష్టంగా ఉన్నవ్యక్తికి తన భావ ప్రకటనకు రచన వాహిక అవుతుంది. కేవల భావ ప్రకటన కవిత్వంకాదు. ఆలోచనాత్మక కళారూపం కవిత్వం. రేవతీదేవిగారు తన దైవ అస్తిత్వం కోసం తపన పడిన కవయిత్రిగా కనబడుతుంది. సమాజపు అతి సాధారణమైన, నీతి, నియతుల సంకెళ్ళల్లో స్వేచ్ఛా కాంక్షితమైన అస్తిత్వం ఇమడదు. అప్పుడే సంఘర్షణ. ఆ సంఘర్షణలోంచి పుట్టినవే ఈ కవితలు. ఈ కవయిత్రి కవిత్వం కోసమే కవిత్వం రాయలేదు. తనకు మినహాయించిన సమాజంకాని, సమాజాన్ని మినహాయించిన తనుకాని రేవతీదేవిగారి కవిత్వలక్ష్యం కాదు. అయితే ఆవిడ ఆశించే సమాజం వేరు.

ఈ కవితా సంకలనానికి సంజీవ దేవ్‌గారు మంచి పీఠిక రాశారు. ఆ పీఠికలో రేవతీదేవిగారి కవితాత్మను బాగావిశ్లేషించారు. ముఖ్యంగా 'హ్రీ ప్రతి' అనే ఖండికలోని కవిత్వ పరమార్థాన్ని చక్కగా విశదపరచారు.

ఈ సంకలనానికి 'శిలాలోలిత' అని నామకరణం చెయ్యటం భావస్ఫోరకంగా ఉంది.

"ఇంతకీ నేను పుట్టిందెప్పుడు
పుట్టినప్పుడు పుట్టినట్లా
చైతన్యించినప్పుడు పుట్టినట్లా
చైతన్యించిన నాడు తొలిసారిగా ఓడిపోయాను.
అప్పటి నుంచి నిత్యం ఓడిపోతూనే ఉన్నాను.
ఐనా
నన్ను ఓడిస్తున్న వాళ్ళెన్నటికీ
నన్ను గెలుచుకోలేరు
ఇది
నా ఓటమిలోని
నా గెలుపు."

బహుశా ఇందుచేతనే నేమో! శిలాలోలిత అని పేరు పెట్టింది. ఉన్మాద ప్రకృతి, ఉక్కు శిశువు, అనురాగదగ్ధ సమాధి, చిట్లని నీటిబుడగ, ఈ రాత్రి మొదలైన ఖండికలలో రేవతీదేవిగారి వైయక్తిక వేదన, సామాజిక వేదన వ్యక్తమవుతాయి. దేవుడూ ఖండిక, 'భగవంతుడా రక్షించు నాదేశాన్ని' అన్న తిలక్ ఖండికను జ్ఞప్తికి తెస్తుంది.

"తాము కల్పించుకున్న దేవుడికి
మనుషులు దాసాను దాసులైనట్లుగా
తాము తయారించిన డబ్బుకి
తామే దాసాను దాసులు."

అంటారు కవయిత్రి డబ్బు పంజరం అనే గేయంలో. ఇదే సమాజ విచ్ఛిత్తికి మూలం. కనుక ఈ పంజరాన్ని పగులగొట్టి స్వచ్ఛంగా, స్వేచ్ఛగా బ్రతకాలని ఆమె ఆశ.

"అన్యాయాల్లేని అక్రమాల్లేని
దోపిడీలేని దగాలేని
అమానుషాల్లేని, అవమానాల్లేని
సామాజిక వ్యవస్థ కోసం
మనిషి మనిషిగా బ్రతకటానికి
కావ సినవన్నీ అందరికీ సమకూర్చే
సామాజిక వ్యవస్థ కోసం."

ఒక నూతన తరాన్ని ఆమె ఆహ్వానించింది. "నేనేం రాస్తున్నానో నాకు తెలుసు. నేనెందుకు రాస్తున్నానో నాకు తెలుసు. అది ఈ రచనలో మీకు కూడా అనిపిస్తే 'ఐతే నేనూ సర్లేదన్న మాట' అని మురిసిపోతాను" అని అట్లా మురిసి పోకుండానే ఆమె మరణించటం 'తెలుగు కవిత' దురదృష్టం.

## నిరసన

[అద్వయం ఫైకో ప్రచురణ, ఎండా వానాకాలంలో అచ్చు, 1982. వెల: అపారం. ప్రతులు: అపురూపం. అద్వితీయ ముద్రణ]

కవితా పరిరక్షణ సమితి అనే పేరిట ఒక కొత్త నినాదం పుట్టింది. "కవిత్వమును రక్షింపుడు. కవిత్వము మిమ్ములను రక్షించును." ఇది అద్వైతం ఫైకో సరికొత్త స్లోగన్.

కుకవి స్తోత్రరత్నమ్, దుడ్డుకర్ర, రొడ్డ కొట్టుడు, సత్కారం, తిరస్కారం అనే కవితా ఖండికలు, నేటి రెవ్యూ నేడే అనే మేనిఫెస్టో లాంటి వచన రచన ఉన్నాయి.

దిగంబరుల తరువాత మళ్ళీ ఒక సంచలనం కవిత్వంలో ఆరంభమైతే దానికి 'నిరసన' కవులు ప్రాతినిధ్యం వహిస్తారేమో! పఠాభి ఎప్పుడో తన వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్య సంప్రదాయం నడుం విరగ్గొట్టాడు. అంతకు ముందే సాహిత్య విమర్శలో మూఢపద్ధతులు, కవిత్వంలో అంధానుకరణను రామలింగారెడ్డిగారు కవిత్వతత్త్వంలో దుయ్యబట్టారు. అక్కిరాజు ఉమా కాంత పండితుల వంటివారి రూళ్ళకర్ర దెబ్బలకు మూర్ఛిల్లకుండా ఆధునిక కవిత సజీవంగా బతికి బట్టకట్టిందంటే ఆధునిక తెలుగు కవిత్వం యొక్క ప్రాభవం ఎంత గొప్పదో గ్రహించవచ్చు.

కవిత్వం, విమర్శ ఇప్పుడేస్థితిలో ఉన్నాయో తెలుసుకోడానికైనా 'నిరసన' చదివి తీరవలసిందే. దీన్ని సైజునిబట్టి కరపత్రం అనడానికి వీల్లేదు. కరపత్రం పరిధి, పైశాల్యం వేరు. కుకవి స్తోత్రమ్ అనే ఖండికను ఊరూరా ఊరేగిన ఒకానొక గ్రంథంయొక్క 'హింసకు ప్రతిహింసలో' పురాణం శర్మగారు ఉదహరించి ఉన్నారు. అప్పుడే 'నిరసన' మీద చందు సుబ్బారావు గారి లాంటివారు గేయాలు కూడా రాస్తున్నారు.

"కుళ్ళిన శవాలను ఊరేగించడం తప్ప
ఉచితానుచితలు తెలియని
ఎదిగీ ఎదగని పరిణతి చెందని
శాశ్వత పరిహారకులకు తిరస్కారం
భేషజాల చమ్కీ కోట్లను ధరించి
ఊరేగుతున్న లుచ్ఛాగాళ్ళకు తిరస్కారం
ఈ శవాల శవారాధకుల ప్రపంచాన్ని
నిలువు లోతున పాతిపెట్టేందుకు
ప్రయత్నిస్తున్న అంత్యక్రియలు నిర్వహిస్తున్న
కుకవితా శత్రువులకు, విశ్వామిత్రులకు
నిరసన కవుల, నిజాయితీ నీరాజనాల నమస్కారం."

అర్పించుకుంటున్నారు వీళ్ళు. ఈ నిరసన బీభత్సాన్ని ధ్వంసం చెయ్యడానికి, సౌందర్యాన్ని సృష్టించడానికేనా?

## తూర్పు వాకిళ్ళు

[నాగభైరవ కోటేశ్వరరావు. వెల: రు. 3-00 లు. ప్రతులకు: నాగభైరవ కోటేశ్వరరావు, గవర్నమెంటు కాలేజి, విడవలూరు, నెల్లూరు జిల్లా]

నాగభైరవ గతంలో కొన్ని కావ్యాలు ప్రచురించారు. ఆయన మనసున్న కవి. ప్రాచీన, ఆధునిక సాహిత్య, సామాజిక

సం|ప్రదాయాలను ఆకళించుకుని తన ప్రాపంచిక దృక్పథాన్ని సంయమనంతో కవితాత్మకం చేస్తున్నారు.

తూర్పు వాకిళ్ళు మానవజీవితంలో ఉషోదయానికి ప్రతీక. మనిషి మారాలనీ హృదయ దర్పణంగా ఆశిస్తున్నా రీయన. ఆ మార్పు పద్ధతిపై నాగభైరవగార్కి పెద్ద అభిప్రాయం ఉన్నట్లు లేదు. సంస్కారం మనిషిని మారుస్తుంది అనుకుంటే సంస్కారం దేనిమీద ఆధారపడి ఉంటుంది? అనేది ప్రశ్న. వీటన్నింటి వెనకాల దృశ్యాదృశ్యంగా కనబడుతున్న ప్రాథమిక శక్తి ఏదైతే ఉన్నదో అది మారకుండా హృదయాలు మారవు. అయినా కవులు ఆశాజీవులు గదా :

"ఈ రోడ్లు
పగలంతా ఆదర్శాలు నటిస్తూ
రాత్రిలు కోరికలతో వ్యభిచరిస్తూ
అవినీతిని రవాణా చేస్తాయి
మానవత్వాన్ని దివాలా తీస్తాయి.
నాగరికత శరీరం కింద
నా దేశపు గుండెకి
కుసంస్కార రుధిరాన్ని
కొల్లలుగా మోసుకుపోతున్న సిరలు
నా దేశపు రోడ్లు."

మరి దీనికి పరిష్కారం ఎక్కడ ?

మనిషి మారటంలోనా ? అదే అయితే మనిషిలో మార్పు ఏ పద్ధతిలో రావాలి ? దానికి దారితీసే పరిస్థితులేవి ? ఆ పరిస్థితులు రావటానికి అవసరమైన చర్య లేమిటి ? ఇవి శేషప్రశ్నలు కావూడదు.

పైథాగరస్ సిద్ధాంతాన్ని ఆరుద్రగారు త్వమేవాహంలో ఈ నాటి ధన స్వామ్య వ్యవస్థకు అన్వయించి ఋజువుచేశారు. కోటేశ్వరరావుగారు కుటుంబానికి అన్వయించి తప్పుడు లెక్కగా తేల్చారు.

"ఇంత విశాలమైన అంబరం
ఇది మీకు దొరకడమే సంబరం."

ఇంకా అంత్య ప్రాసలమీద మోజు పోకపోతే ఎట్లా?

"శిశిరం శిథిలమై వీడ్కోలు చెప్పింది
వసంతం చైతన్యపు వాకిళ్ళు తెరిచింది
పూరింట్లో కొత్తగాలి షికార్లు చేస్తుంది
వాకిట్లో నా చెట్టు పాటలు పాడుతుంది."

నాగభైరవగారి ఈ ఆశావాదాన్ని హర్షిద్దాం :

## కళా ప్రారంభం (సాహిత్య మాస పత్రిక)

[చెరబండరాజు సంస్మరణ సంచిక. వెల: విడి ప్రతి రూ. 2-00 లు, సంవత్సర చందా రు. 20-00 లు ప్రతులకు : తారానగర్ (బిహెచ్. ఇ. ఎల్. దగ్గర) హైదరాబాదు-500 133]

చెరబండరాజు కొన్ని కవితలు, మైత్రేయ చెరబండరాజుపై రాసిన చరమగీతం అనే గేయం, నూతన మానవుడు 'చెర' భరత్ బాబు వ్యాసం, కా. వి. గారి 'లయ' పుస్తక సమీక్ష, దిగంబర కవిగా చెరబండరాజు కె. శ్రీనివాస్‌గారి వ్యాసం ఉన్నాయి.

## చైతన్య దీపిక

[సాంస్కృతీ సమాఖ్య బాపపురి శాఖ సమర్పణ. బాపట్ల యువ రచయిత(త్రు)ల రచనల సంకలనం. వెల: రు. 0-50 పై. లు]

ఇందులో కవితలు, స్కెచ్, ఆధునిక నవలాసాహిత్యంపై జరిపిన గోష్ఠిలో వెలిబుచ్చిన అభిప్రాయాలు, మొదలైన రచనలున్నాయి. మారని మనుషులు కథ ఉంది. పధ్నాలుగు పేజీల కరపత్రం లాంటి సంకలనం.

## ఆ రోజు (కవితా సంకలనం)

[వంగల రంగాచార్యులు. వెల: రు. 6-00లు. ప్రతులకు : వంగల రంగాచార్యులు, డిప్యూటి లైబ్రేరియన్, జిల్లా కేంద్ర గ్రంథాలయం, ఆదిలాబాద్ - 504 001]

వీరి కవితా సంకలనంలో విఘ్నేశ్వర స్తుతి, సరస్వతీ ప్రార్థన, హనుమ స్తుతి మొదలైన పద్యాలనుంచి అనేక విషయాలపై కవితలున్నాయి. సాధారణంగా లైబ్రరీఉద్యోగులకు కవిత్వం అన్నా, కళలన్నా చుక్కెదురు. రంగాచార్యుల వారిని వారి కవిత్వాభిరుచికై అభినందించాలి. అయితే వారి కవిత్వం బాల్యావస్థను దాటలేదు.

"ఇకనైనా మేలుకో
ధనార్జన కోరికను చంపుకో

సాటివారివి అదుకో
చావెరుగని కీర్తివి అందుకో"

అనే సూక్తులు, మానవత్వ ప్రబోధం, శ్రీశ్రీ, విశ్వనాథలను గురించి పొగడ్తలు, కుటుంబ నియంత్రణ కవిత్వం-ఇంకా ఇంకా చాలా కవితలున్నాయి.

## అరుపులు (కవితా సంకలనం)

[వెల : రు. 3-00 లు, ప్రతులకు : క్రాంతి కళానికేతన్, గాంధీనగరమ్, ఎలమంచిలి - 531 055]

ఈ సంకలనానికి అరుపులు అని పేరు పెట్టడంలో చాలా ఔచిత్యం ఉంది. వీటిల్లో చాలా భాగం కవితా శూన్యమైన అరుపులు. కొల్లూరి 'మృత్యు సముద్రంలో నేను' అనే ఖండిక చదవటానికి బాగుంది. సంకలనంలో ముద్రారాక్షసాలు అనేకం. అసలు సంకలనమే రాక్షసమైనపుడు ముద్రారాక్షసాన్ని గురించి పట్టించుకోనవసరం లేదు. భావపరంగా ఇది నానాజాతి సంకలనం.

"ఈ మనుషుల కంటే
మెల్లిగా కదిలే చీమలే నయం
ప్రాణం కొంచెమైనా
పోరు సాగించటం మానుకోవు."

ఇట్లాంటి ఒక మోస్తరు మినీ కవితలు అక్కడక్కడా ఉన్నా ఈ అరుపుల్లో అవి వినపడవు.

"చుట్టం వస్తే
కూర - పప్పు
వట్టప్పుడు
చారు - ఉప్పు
ఆ అప్పు తెచ్చిన ముప్పు
తప్పేటందుకే ఈ ఉప్పు."

ఇట్లాంటి చచ్చురాతలు రాసి కవిత్వమని దేశం మీదికి ఎగబడ్డ వాళ్ళని ఏం చేసినా పాపం తీరదు.

## ఆంజనేయ శతకము

[ఉపాధ్యాయుల రామమోహనరావు. వెల : రు. 3-00 లు. ప్రతులకు : సారథీ పబ్లికేషన్సు, యం. సీతామహాలక్ష్మి, పెదపాడు, ఏలూరుతాలూకా, ప. గో. జిల్లా]

ఈ శతకానికి ప్రస్తావన, ప్రవేశిక, తొలిపలుకు, పరిచయం నాలుగు ముందు మాటలున్నాయి. "భక్తులందరూ ఈ శతకమును నిత్య పారాయణతో ఉపయోగించుకొనుచూ స్వామివారి అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక" ఇది సామూహికాభిప్రాయం.

"అంతరింద్రియ బహిరింద్రియములఁ గట్టి
వడుచు, భవమను శృంఖముల బడితి నొసగ
ముక్తినిన్, శృంఖలాబంధ మోచకుడవు
అంజలించెద నతులు వీరాంజనేయ."

ఇది కవిగారి వాంఛ; అట్లే అగు గాక.

## శ్రీ నారశింహ శతకము

[మామిండ్ల రామగౌడ్. వెల : రు. 3-00 లు. ప్రతులకు : గౌడశ్రీ గ్రంథమాల, రుద్రూరు, బోధన్(తా), నిజామాబాద్ జిల్లా.]

ఈ శతక ప్రారంభంలో నీరాజనం ఈ శతక తత్వాన్ని చెబుతోంది. సమర్పణంలో అవధూత బ్రహ్మశ్రీ గోవిందగిరి స్వాములవారికి అంకిత పద్యాలున్నాయి. మహారాజ పోషకులు శ్రీ చందూరు సాయి గౌడుగారిని గురించి కొన్ని పద్యాలున్నాయి.

"కవిత లిందులేవు - కవిగాని హృత్తప
భరితమైన యనుభవములు కొన్ని
మనవి చేసుకొంటి మన్నించు భక్తి మం
దార ! దొసగులున్న నారసింహ."

ఇట్లాంటి పద్య శతక మిది.

## దివ్యసందేశము అను మిధునా ధర్మము

[మునునూరు సాంబశివరామమూర్తి. వెల : రు. 5-00 లు ప్రతులకు : మునునూరు సాంబశివరామమూర్తి, రామచంద్రపురం - 533 255, తూర్పు గోదావరి జిల్లా.]

మునునూరు సాంబశివరామమూర్తి గారు చారిత్రిక పరిశోధకులు. వారు అనేక శిలా తామ్రశాసనాలను సంస్కరించారు. స్నేహితుని భార్య మరణించినపుడు ఆ దుఃఖమును తనదిగా చేసుకొని భార్యా భర్తల అనుబంధాన్ని గూర్చి, జన్మసాఫల్యాన్ని గూర్చి రాసిన కావ్యమిది. ఈ కావ్యము ఆరు ఖండాలుగా విభజింపబడింది. పరిశిష్టంలో మరికొన్ని పద్యాలున్నాయి. ఈ కావ్యంలోని పద్యాలు అన్ని శీల నివేదనకు సంబంధించినదే: ఆధ్యాత్మిక దృక్పథం మిక్కుటంగా ఉన్నవారికి ఇవి అనందాన్నిస్తాయి.

"పుట్టి పెరిగి చచ్చు భువిలోన జీవులు
సంతతంబు - దానవింతలేదు
అంతు పంతులేని - వంతల జిక్కుట
ఎంత దోచు మివుల - జింత పుట్టు".

ఇది కవిగారి అభిప్రాయం బ్రతుకుమీద.

# ఆనందవల్లి

[డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు. వెల: రు. 6-00 లు. ప్రతులకు: పి. గురుప్రసాద్, రామారావుపేట, పెద్దాపురం, తూ. గో. జిల్లా.]

కవితా హేతువులో శేషగిరిరావుగారు కావ్యం ఎందుకు రాయవలసి వచ్చిందో అందుకు అనువైన స్వజీవిత పరిస్థితులేమిటో వివరించారు. డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య ఉపశృతిలో కవిత్వ గొప్పతనాన్ని ఆయన దైవ ఆధ్యాత్మిక దృక్పథంతో విచారించారు. ఆచార్యులవారి దృష్టిలో కవిత్వ పరంగా శైలి, ధార, పాకము, వర్ణన, రసపోషణ మొదలైన సాంకేతిక పదజాలం పడికట్టుపదాలు, చిల్లర విషయాలు. టోకు విషయం ఆధ్యాత్మికం. కనుక మనుషుల్లోకూడా చిల్లర మనుషులు, టోకు మనుషులు ఉంటే ఆచార్యుల వారు టోకు మనిషి. జీవితంపట్ల ఆచార్యులవారికిఉన్న దృక్పథమే అందరికీ ఉండాలని లేదు. "'పునరపి జననం పునరపి మరణమ్' గోవిందుని భజించుట ప్రారంభముకాని మూఢమతి పుట్టి జీవించి చచ్చు చుండును. ఈ కలత నిద్రనుండి మెలకువ కలిగిన వారి జన్మమే చరితార్థము" అంటున్నారు ఆచార్యులవారు. చిల్లరవిషయమేమిటంటే శేషగిరిరావుగారి కావ్యం అలౌకిక జీవితానికి సంబంధించినది. ఆయన విశ్వాసాలు ఆయనకున్నాయి. కాని కవితా పరంగా పద్యాన్ని చక్కగ, ఔచిత్యవంతంగా నడపగలరు. అందుకు ఈ కావ్యం మొత్తం ఉదాహరణే. వారి గురువుగారు వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని గురించి రాసిన ఒక పద్యం సాక్షాత్కారంలోది గమనిస్తే వారి పద్యరచనా శిల్పం సుబోధకమవుతుంది.

"నీ నయనాంచలమ్ములు
నీల విశాల విలోల కాంతి రే
ఖా నిబిడీ కృతమ్ములయి
కన్పడినంత, మదీయ శుష్క దే
హాన తళుక్కనన్ మెఱసి
యాంతరసీమ చరించి చెప్పగా
రాని అలోక సుందర తీర మ్మగు
నీమ చరింప చేసెడిన్."

# గొఱ్ఱెలు

[బోయ జంగయ్య. వెల: రు. 5-00 లు. ప్రతులకు: చేతన పేపర్ మార్టు, నల్లగొండ-508 001]

"కథలు ఆకాశంలో పుట్టవు. మనిషి జీవితంలోంచి పుడతాయి. అందుచేతనే రచయితలు జీవితానికి దగ్గరగా ఉండాలి. జీవితానికి దగ్గరగా ఉండగలిగిన వారే మంచి రచయితలుగా మిగులుతారు." రా. వి. శాస్త్రిగారి ఈ మాటలకు జంగయ్యగారి ప్రతి కథా మంచి ఉదాహరణ.

పనిష్మెంట్ కథలో ఎమ్. ఎల్. ఎ. రెడ్డి మోతి కోడలు లచిమిని అనుభవించిన విధం ఒక భయంకరమైన వాస్తవికత. ఉరితీయనున్న కొడుకు ప్రాణాలు రక్షించుకుందామని మోతి, భర్త దక్కుతాడుగదా అని ఇష్టం లేకపోయినా లక్ష్మి రాజారెడ్డి పశువాంఛకు లొంగిపోయారు. చివరకు భర్తా దక్కలేదు, మానమూ దక్కలేదు. గొర్రెలు కథ ఈనాటి రాజకీయాలకు దర్పణం. చౌదరి, రెడ్డి నాయకుడు - నాయకత్వం - ఎన్నికలు - వీళ్ళమధ్య సాధారణ పౌరులు, కక్షలు, కార్పణ్యాలు పెంచుకోవటం, వ్యక్తిగత స్వార్థ రాజకీయాలకు బలికావటం రచయిత అద్భుతంగా చిత్రించారు. ఇంకానా ఇకపై సాగవు కథ వర్తమాన దోపిడీ వ్యవస్థ భవిష్యత్తులోకి పొడిగింపబడదనే ఆశావాదంతో ముగిసేకథ గ్రామ దొర, కరణం కూలీల సమ్మెను వొమ్ము చేసిన కథనం ఇది. సమ్మె చేస్తున్న కూలీలకు జొన్నలు కొల్చినట్టే కొలిచి కేసు బనాయించి జైల్లోకి నెట్టేస్తారు. బడిపిల్లలు మాత్రం గంటతో బడికి పోకుండా పిడికెళ్ళు బిగించి దొర ఇంటివైపు పయనిస్తారు. మనసుకథ వ్యవస్థాగత కట్టుబాట్లకు సంబంధించినది. కట్టుకున్న భర్తకు తెలియకుండా మరొకరితో సంబంధం పెట్టుకున్నప్పుడు ఊరంతా పంచాయితీకి సిద్ధమయితే భర్త ఆమె బట్టల మూటను తీసుకువచ్చి ఆమె ముందు పడేసి పోతాడు. ఇదొక సంస్కారం. గత్తర కథలో ప్రజలను ఇంకా అజ్ఞానంలో ఉంచాలనే పెత్తందార్ల వారి అన్యాపదేశ దాష్టీకం కనబడుతుంది. కలరా వ్యాధి జాతర్లతో, బలులతో, మంత్రాలతో తగ్గదని కరణానికీ తెలుసు. కాని వ్యాధిని ఆధారంగా ప్రజల్లోని మూఢనమ్మకాలు ఊతంగా గతంలో తనకు గల పగను తీర్చుకుంటాడు కరణం. కాని తనకే వ్యాధి సోకినపుడు డాక్టర్‌కు కబురు పెట్టమంటాడు. బంజరు భూములు ఆక్రమణలో హరిజనులకు జరుగుతున్న అన్యాయాలను కళ్ళకు కట్టినట్టు చిత్రించే కథ బంచరాయి.

ఈ కథలన్నింటిలోనూ ఈ నాటి వాస్తవికత, ముఖ్యంగా తెలంగాణా గ్రామాల్లో జరుగుతున్న ఘోరాలకు ఈ సంకలన ప్రతిబింబం. అభూత కల్పనలోంచి, అవాస్తవిక ప్రపంచంలోంచి దెయ్యాల భూతాల క్షుద్ర సాహిత్యంలోంచి తెలుగు రచన బయపడి పునర్జీవించడానికి ఇట్లాంటి సంకలనాలు ఎన్నైనా రావాలి.

శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.